# భారతి

సాహిత్య మాసపత్రిక



సంపాదకుడు

శివలెంక శంభుప్రసా

జూలై 1957

సంపుటము ౩4 : : సంచిక 7

విడిపత్రిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## జూలై 1957

# జ్యోతిరేఖ

శ్రీ మాదిరాజు రంగారావు

మధుర మధుర పీయూషావర్షిత
పుష్పీకృతాత్మ వారిద గామిని!
కిణ కిణ పద రచనా సంచారిణీ
నా కవితా శ్రీ మసృణీ భామిని.

వినీల కాంతిమేఘు హృదయవీథి
రివ్వున జంగు నక్షత్రపూలు రువ్వ
స్ఫేష్ఠరమ్మద మాలాదీపిక
ఊహా లేఖావిష్కృత లాసిక.

హిమానీ వీచీ స్ఫీత ప్రభా
తారణ నాకధుని శ్రీమసృణీ
ఫేన తరంగిణివై, తమో రాశి
కాంతిపునీతము గావింపగ,
గీతికాభినందనతో, అవనీ
స్థలి దిగ్గు, నీకై, నవ శరత్కాశ
హిమ గిరీంద్ర శిఖరరూప మెత్తిన
నను వీక్షించుచు యెన్ని అబ్దములు
తమోవైష్ఖ్య రేఖ లాగ సాగెను___

నీలాంబుద వీణా ఘోషమూని
శంపా రేఖాతంత్రులు మ్రోయగ
కదలివచ్చు, నీ ఘోషము ననుసరించు
వాయూచ్ఛ్వాసోత్తరంగవ దూహాలు

కనులకు కనుపించని, జ్యోతి
శ్శిఖవై తపించిపోవు, యోగి
కాగ్ని పరిస్ఫీతారుణ హా
హృదయ కనక శతపత్రమువలె
వికస్వర తేజోఽవధిభూత తవ
రూప సమాహితమా నాకళాత్మ.

# నిలవనీరు

'శ్రీ విరించి'

పాత్రలు : సుధ(25): చీకూ చింతా లేకుండా సంసారం చేస్తోన్నట్లు కనిపించే అందమైన యువతి.

సుందరమ్మ (35): పేరుకు తగిన ఆకారం. విధవరాలు. రిఫ్రెష్‌మెంట్ రూం యజమానురాలు.

శేషమ్మ (18): సుందరమ్మకు అసిస్టెంటు.

గంగరాజు (25): రిఫ్రెష్‌మెంట్ రూంలో సరకులు ట్రేంతో బుజానికి తగిలించుకుని ప్లాట్‌ఫారం మీద అమ్ముతూండే మనిషి.

సీతాపతి(40): టికెట్ ఇన్‌స్పెక్టరు

పార్వతమ్మ(35): సుధకు పరిచిత.

మధు (30): ప్రాక్టీసు చేస్తోన్న డాక్టరు.

దృశ్యం : సందడిగా వుండే రైల్వే స్టేషన్ రిఫ్రెష్‌మెంట్ రూం. ఎడమ వైపు కౌంటరు. అద్దాల బీరువాల్లో రొట్టెలు, బన్నులు, బిస్కట్లు, పళ్లు, ఫలాలు వగైరాలు తీర్చిన గిల్ల గ్లాసులు, టీ కప్పులు, సోడాలు, టానిక్కులు. వెనక గోడకు రెండు కిటికీలు. వాటి కింది అద్దంతలుపులు మసిబారి వుంటాయి. పైవాటికి రంగు రంగుల కాగితాలు. గది కుడి ప్రక్కగోడకికూడా యిలాంటి కిటికీలే వుంటాయి. ఈ గోడకే దర్వాజా. అది దాటి ప్లాట్‌ఫారంమీదికి వెళ్లొచ్చు. వెనక గోడ నానుకుని మూడు బల్లలు, మూలన స్టౌ. కుడివేపు గోడకు రెండు బల్లలు, దర్వాజా పక్కన మరో బల్ల. గోడలనిండా రకరకాల ఎడ్వర్‌టైజ్‌మెంటు కాగితాలు, కాలెండర్లు, కాయితాల పూవులూ!

కాలం : అన్ని రంగాలూ దాదాపు సాయంత్రం అయిదూ అయిదున్నర మధ్యకాలంలో నడిచినట్లు భావించుకోవచ్చు. పోతే, ఒక్కో రంగానికీ, తరవాతి రంగానికీ మధ్య రెండేసి నెలల విరామం.

## 1

* * అస్తమించే సూర్యుడి కిరణాలు కుడివయిపు కిటికీలోంచి పరావర్తించి కౌంటరుమీదికి పడుతుంటాయి. వెనకవైపు బెంచీల్లో

---

'నోయల్ కవర్డ్' ఆధారంగా

కూచుని ఓ యువకుడు పేపరు చూస్తూ విలాసంగా టీ తాగుతున్నాడు మరో ప్రక్క సుధ కూర్చునుంది. పాతికేళ్లు. సుందరమయిన విగ్రహం. దానికి తగిన దుస్తులు. చేతిలో ఏదో పుస్తకం. చదువుతూ, మధ్యమధ్య తనలో తాను ముసిముసి నవ్వులు నవ్వుకుంటూంటుంది.

గంగరాజు వచ్చాడు. యూనిఫారంలో వున్నాడు సరాసరి కౌంటర్ దగ్గరికి వెళ్ళాడు.

గంగ : ఆపిల్స్ అయిపోయాయి, అరడజను కావాలి.

సుంద : ఏదిచూపనీ (తేరపరకాయించి చూస్తుంది)

గంగ : ఇందాక ఓ పల్లెటూరిఅమ్మి, నాదగ్గర అయిస్‌క్రీంవుందా అనడిగింది, నాకు నవ్వాగింది కాదు.

సుంద : అందులో నవ్వాల్సిందేముంది నాయనా?

గంగ : నన్ను చూస్తూకూడా, అయిస్‌క్రీం అమ్మేకుర్రాడినని అనుకోవటం...హో, హో... (నవ్వుతాడు)

శేష : ఏమిటా వకిలినవ్వు?

సుంద : నువ్వూరుకో శేషీ. యిదిగో, గంగరాజా, నువు మరీ అసభ్యంగా లిగూరవుతున్నావు. బొత్తిగా పెద్దాచిన్నా లేకండా యేమిటా నవ్వు? ఊ...యీ యాపిల్స్ తీసుకుపో...

గంగ : రైటో. (వెళ్లిపోతాడు)

సుంద : ఇదుగో, శేషీ, ప్రతిసారీ 'నువు పనిలో వున్నావు' అని గుర్తుచెయ్యటానికి నాకు తలప్రాణం తోకకొస్తోంది.

శే : ఇప్పుడు నే నేమీ కానిపని చెయ్యలేదమ్మా!

సుం : ఎందుకట్లా తెలివితక్కువదానిలా జేబె ముఖం వేసుక్కూర్చుంటావు? నిన్ను ఆ జాబితా రాయమన్నాను, యేమయింది?

శే : రాశాను.

సుం : ఏది?

శే : మీ బల్లమీద పెట్టాను.

సుం : మరి...నీ కాపీపుస్తకం?

శే : ఇదుగో—

సుం : అయితే, వెళ్ళి మూడోనంబరుబల్ల శుభ్రం చెయ్యి. దానిమీద ఎంత చెత్త పేరిందో చూడు—

శే : చెప్పాకాదమ్మా, గొడ్డైపోతున్నాను.

సుం : దంపుళ్లో, తంపుళ్లో! వెళ్ళి చెప్పినపని చెయ్యి, పూరికే వాదించక.

[సీత పతి వస్తాడు]

సీ : హల్లో!

సుం : ఏం, ఆఫీసుపనయిపోయిందా?

సీ : నిన్నిట్లా వద్దామనుకుంటే, క్షణం తీరిక లేదు.

సుం : ఏం కొంప మునిగింది యేమిటి?

సీ : కొద్దిగా గందరగోళం జరిగిందిలే.

సుం : దేన్ని గురించి?

సీ : నాకళ్లారా చూశాను, వాడు ఫస్ట్‌క్లాస్ పెట్టెలోంచే దిగాడు, తీరా చూస్తే వాడిదగ్గర మూడో క్లాసు టిక్కెట్టు. చిబ్బు కట్టమన్నాను, పేచీ పెట్టుక్కూర్చున్నాడు, దాంతో పెద్దగొడవ!

సుం : నువు రాకపోతే, యేదో యిలాంటిదే జరిగుంటుందనుకున్నాను.

సీ : నాస్నేహితుడొకడు, పెళ్ళి చేసుకుంటున్నాడు.

సుం : మంచిదేగా!

సీ : అలావున్నావేం, యివాళ?

సుం : ఎవరూ? నేనా? నాకేం?

సీ : ...యివాళ ..నువ్వు...యేమిటో...యిదిగా వున్నావు.

సుం : (అతనిమాట వినిపించుకోకండానే) శేషీ! కుంపట్లో బొగ్గులు చూడు...

శే : అట్లాగేనమ్మా—

సుం : ఇక్కడ పూరికే బాతాకానీ వేసుక్కూర్చోటానికి నాకు తీరిక లేదు సీతాపతీ!

సీ : నాకో కప్పు టీ యివ్వవా మరి?

సుం : టీ తప్పకుండా తాగు, తాగిన వెంటనే మాత్రం వెళ్ళిపో. శేషి కలిపిస్తుంది, తీసుకో— నాకు బోలెడు పనుంది.

సీ : నువు కలిపిస్తే బాగుంటుంది.

సుం : కాలం కర్మం మనకోసం అట్టే వుండవు, సీతాపతీ!

సీ : నువు నేది, నాకు అర్థం కావటంలేదు.

సుం : నీకస లర్థం కాదు—ఊ.

[మధు లోపలికొచ్చి కౌంటర్ దగ్గరికి వెడతాడు]

మ : ఓ కప్పు టీ.

సుం : అలాగే - రొట్టెగానీ బన్ గానీ యిమ్మంటారా?

మ : వొద్దు, టీ చాలు.

సుం : అను కొన్నా.

మ : ఇదుగో! (బల్ల ముందుకొచ్చి కూర్చుంటాడు. టోపీ బల్లమీద పెట్టి, టీ తాగుతూంటాడు. సుధ గడియారం కేసి చూసి తన సంచీ సర్దుకుని, ప్లాట్ ఫారం వయిపు వెడుతుంది. శేషమ్మ కౌంటరు వెనక్కి వస్తుంది)

శే : మున్నీ యివాళ పాలు ముట్టనయినా లేదు. ఎటు పోయిందో ఏమో.

సుం : పాలు పెట్టావా, అసలు?

శే : ఆ! దగ్గరిపో నయినా రాలేదు.

సుం : చూడు, అకోడ్లో వుందేమో-

సీ : ఓహో! జంతువు లంటే సరదా! మా ఆవిడకీ అంతే - రెండు పిల్లులూ, మూడు కుక్కలూ - మాయింట పెరుగుతున్నాయి.

[దూరంగా పెద్ద చప్పుడు గణ గణ మని గంట]

సుం : అదుగో రైలు.

[రైలు ప్లాట్ ఫారం మీదికి వస్తోండగా, చెవులు చిల్లులు పడేలా రణగొణ ధ్వని]

సీ : నా టీ మాటేమిటి?- నేను వెళ్ళిపోవాలి, మరో నిమిషంలో నలభైమూడు వచ్చేస్తుంది.

సుం : (టీ కప్పు అందిస్తూ) యింటిదగ్గ రెవరున్నారు?

సీ : మరో కుర్రాడిని కూర్చోబెట్టి వచ్చా.

సుం : నీపనికి బద్ధకిస్తున్నావు.

సీ : కాస్త విశ్రాంతి తీసుకోవటంలో మరేం ప్రమాదం లేదు లే.

[చేతి రుమాలుతో కన్ను అద్దుకుంటూ, సుధ కౌంటరు దగ్గరికి వస్తుంది.]

సు : ఏదమ్మా, ఓ గ్లాసెడు నీళ్ళివ్వు. కంట్లో యేమిటో పడింది. గరగరలాడుతోంది.

సుం : యేదీ, యిటురండి, చూస్తాను.

సు : మీకా శ్రమ అక్కర్లేదు. కన్ను కడిగితే చాలు. అదే పోతుంది.

సుం : యిదిగో (నీళ్లగ్లాసు అందిస్తుంది.)

సీ : బొగ్గుముక్క అయివుంటుంది, బహుశా.

సుం : బయటికొస్తే ఫరవాలేదు కాని—లేకపోతే ప్రమాదం.

సు : చాలా బాధ...అబ్బా...

సుం : యేం—తగ్గిందమ్మా?—

సు : ఊహు—(మధు బల్ల దగ్గర్నుంచీ లేచి వస్తాడు)

మ : యేదీ, నన్ను చూడనివ్వండి.

సు : అక్కర్లేదు—యేదో నలుసు—అంతే—

సుం : కనుపాప అంచున ఓసారి తుడవండి.

మ : నన్ను చూడనివ్వండి, నేనో డాక్టర్ని—అందుకని,...

సు : (సిగ్గుపడుతో) అలాగే...

మ : వెలుతురు వయిపు తిరగండి. ఏదీ, పైకి చూడండి, ఆ! యిప్పుడు కిందికి, ఆ! అదిగో—అక్కడే నుంచునుండండి. (చేతి రుమాలు అంచు వేలికి చుట్టి కంటికొనల్లో తుడుస్తాడు)—అదీ! అయిపోయింది.

సు : అబ్బ, బాధంతా తగ్గిపోయింది, ప్రాణం కుదటబడ్డది.

మ : ఇసుక రేణువు, మరేం కాదు.

సు : యీ బాధనించి రక్షించారు. నమస్కారాలు.

మ : ఇందులో యేముందండీ—

సీ : అదిగో—రైలు రానేవస్తోంది—నేను పరిగెత్తాలి.

సు : నా అదృష్టం కొద్దీ మీ రిక్కడున్నారు.

మ : దానికేం లెండి—యీ మాత్రం చికిత్స ఎవరేనా చెయ్యగలరు.

సు : కాని, చేసింది మీరేకద! కృతజ్ఞత ఎలా తెలపాలో అర్థం కావటంలేదు. నమస్కారాలు, నమ...అదిగో, నా రైలు, నడతాను, సెలవు...

(వెళ్లిపోతుంది కనిపించేవరకు ఆమెవైపు చూచి తరవాత యథాస్థానంలో కూర్చుంటాడు, మధు.)

[రైలు వెళుతోన్న చప్పుడు—తెర...]

## 2

* * సుందరమ్మ, శేషమ్మ వుంటారు. బల్లలన్నీ ఖాళీగా వుంటాయి

సుంద : బాగుంది, చాలా బాగుంది; యీ పనీ ఆ పనీ చేసినందువల్ల నాకు వొరిగేదేమిటి? వొళ్లు తెప్పరి తప్ప; పగలల్లా యింటి చాకిరిలో నౌకర్లా వొళ్ళొంచి పనిచేసి, రాత్రికల్లా ప్రేమపాత్రమైన భార్యగా నటించాలి వాళ్ల సంతోషంకోసరం! ఇది నావల్ల కాదని చెప్పేశాను, గాలానికి చేపలేం తక్కువగా లేవని లేచిపోయొచ్చేశాను; పెటేబేడా సర్దేసుకని ఆ క్షణాన్నే అతన్ని వొదిలి వచ్చేశాను.

శే : మళ్ళా అటువైపు వెళ్లనే లేదన్నమాట!

సుం : ఈ జన్మలో పొసగదు ఆ పని! కొన్నాళ్లు పాటు మా అక్క దగ్గరున్నాను. తరవాత ఓ స్నేహితుడితో కలిసి వుంటూ, టీ షాపు పెట్టాం, మే మిద్దరం.

శే : మరి అతగా డేమయ్యాడు?

సుం : మూడేళ్లు గడిచాక, యీలోకాన్నే వదిలి వెళ్ళాడు.

శే : పాపం!

సుం : ఇక చూచావూ—తరవాత అనుకున్నవన్నీ సక్రమంగా నెరవేరాయి.

[గంగరాజు ప్రవేశిస్తాడు]

గం : రెండు డ్రింకులూ—యాపిలు...

సుం : యెందుకూ?

గం : ప్లాట్‌ఫారం మీద పార్టీ వాళ్ళు కావాలన్నారు.

సుం : వాళ్ళు యిక్కడికే ఎందుకు రాకూడదో!

గం : ఆ మాట వాళ్లనే అడగాలి. (శేషమ్మవైపు చూచి, కన్ను గీటుతాడు)

సుం : కంట్లో నలుసేమయినా పడిందేమిటి?

గం : ఎప్పుడూ, యిక్కడికొచ్చినప్పుడల్లా, ఏదో పడినట్టే వుంటుంది.

శే : చాల్లే,—సోది.

సుం : గంగరాజు, కాస్త మర్యాదగా ప్రవర్తించటం నేర్చుకోమని నీ కనేక పర్యాయాలు చెప్పాను. యివిగో డ్రింకులు, యాపిల్సూ—వెళ్ళు—

గం : ఈ పంచుకి అడుగున చిల్లున్నట్టుంది.

సుం : వాళ్ళకంత పట్టింపుగా వుంటే, నేరుగా యిక్కడికే వచ్చి యేరుకోమని చెప్పు—

గం : సరే, అట్లాగే

సుం : ఈ జనం—రామ రామ—ప్లాట్ ఫారం మీద నుంచుని రెండు ముక్కలు నోట కుక్కుకుందామని ఎందుకనుకుంటారో నా కర్థం కాదు. సరే, సీతాపతిని మటుకు టీకి రావటం మర్చి పోవద్దని చెప్పు.

గం : రైట్ (వెళతాడు)

[మధు, సుధ ప్రవేశిస్తారు]

మ : టీ పుచ్చుకుందామా? నిమ్మరసమా?

సు : టీ—(స్తంభం పక్క బల్లముందు కూర్చుంటుంది—మధు కౌంటర్ దగ్గరికి వెళతాడు)

మ : రెండు—టీ.

సుం : రొట్టె, బన్లూ...

మ : (సుధతో) యేం?

సు : ఆ బన్లు యివాళ తయారుచేసిన వేనా?

సుం : ఆహా యీ వుదయమే తయారయినై.

మ : అయితే రెండు బన్లు యివ్వండి. (సుందరమ్మ రెండు ప్లేట్లలో బన్లు పెట్టియిస్తుంది యింతలో శేషమ్మ టీ కలుపుతుంది)

సుం : ఎనిమిదణాలు—

మ : ఇంద—(మధు బల్లముందు కొచ్చి కూర్చుంటాడు)

సు : (శేషమ్మతో) నేను లెక్క డొక్కా చూచుకుంటూంటాను, సీతాపతి వొస్తే చెప్పు

శే : అట్లాగే.

సు : బన్లు చాలా బాగున్నాయి.

మ : అవును.

సు : నీకు టీలో పాలు ఎక్కువుంటే యిష్టమా?

మ : అవును, నీకో?

సు : నాకూ అంతే!

మ : స్టేషను హోటళ్ళలో టీ ఎప్పుడూ అట్లాగే వుంటుంది.

సు : నేను కాదనటం లేదు—కాని, యివాళ మధ్యాహ్నం నువ్వంతా నీ కర్తవ్యాన్ని మరిచావు.

మ : మరేం ఫరవాలేదు, ఉదయమంతా పని చేశానుకద! కాస్తంత విశ్రామం తీసుకున్నందువల్ల మునిగిపోయేదేం లేదు, యిందులో మనం పాపం అనుకోవలసిందేం లేదు కద!

సు : నాకేం తెలీదు — కాని ఓ ఊహ! ఏదో జరగకూడనిది జరుగుతున్నట్టు అనిపిస్తుంది.

మ : అబ్బ! నువెంత తమాషాగా మాట్లాడు తున్నావ్!

సు : చిన్నప్పుడు—వేసవికాలంలో పడకగది కిటికీలోంచి దూకి చెరువుకువెళ్ళి స్నానం చేసి వస్తూండేవాళ్ళం. విపరీతమయిన చలి! అయినా అదేదో పరాక్రమంగా తోచేది! నా అంతట నేనే ఆపనిచేస్తుంటే దాన్ని కాదు, కాని ప్రమాదాన్ని పంచుకోవటం. అంతే! యిప్పుడూ సరిగ్గ అట్లాగే అనిపిస్తోంది నాకు.

మ : మరో బన్, తీసుకో.

సు : అబ్బ, నువు నవ్వుతున్నావు, నన్ను ఎగతాళి చేస్తున్నావు.

మ : నవ్వుతున్న మాట నిజమే కాని, నన్ను గురించి కూడా నవ్వుకుంటున్నాను.

సు : యేం, ఎందుకని?

మ : నువిందాక పాపం అన్నప్పుడు నాకేదో భయమేసింది.

సు : అదుగో చూచావా, నేచెప్పటం లేదూ?

మ : కాని, మనమేం తప్పుపని చెయ్యలేదు.

సు : కావచ్చు, చేసివుండక పోవచ్చు—

మ : యేదో గాలివాటున కల్సుకున్నాం, మళ్లా కల్సుకున్నాం. లాంఛనానికని యింత పుచ్చుకుంటున్నాం. తరవాత సినిమా చూస్తున్నాం. ఇంతకంటే సాధారణంగా, సహజంగా జరిగేది మరేముంటుంది?

సు : ఏమయినా, మనం పెద్దవాళ్ళం.

మ : నేనింకా పెద్దవాడిని కాననుకుంటాను; నువ్వు?

సు : నేను పెద్దదాన్నే సుమా! గౌరవకుటుంబానికి చెందిన వివాహిత స్త్రీని. భర్త యిల్లు వాకిలి మొగ్గ పిల్లలూ.

మ : కాని, నీలో యీ వూహ లేవీ ప్రవేశించని పసితనపు కోమలత్వం యేదో అంతర్భాగంగా వుండి వుండాలి. ఇంకా కిటికీలోనుంచి యివతలికి దూకుదామనీ, చెరువులో యీత.........

సు : బహుశా, మన వివరంకూడా సంపూర్ణంగా ఎదగమనుకుంటా!

సు : అబ్బ, నువెంత తమాషాగా మాట్లాడు తున్నావు!

సు : ఈ మాటలు నువ్వు యిందాక నే అన్నావు.

మ : బహుశా నువ్వు వినివుంటా వనుకున్నాను.

సు : లేదు, విన్నాను.

మ : నేనూ గౌరవ కుటుంబీకుడినే. నాకూ ఇల్లూ భార్య పిల్లలు బాధ్యతలు వున్నాయి. నాకూ చేతినిండా బోలెడంత పనివుంది. అందులో విచిత్రమైన ఎన్నో ఆదర్శాలున్నాయి!

సు : ఆమె ఎట్లా వుంటుంది?

మ : ఎవరు? నా భార్యా?

సు : అవును.

మ : పొట్టిగా, నల్లగా, బలహీనంగా...

సు : ఏం తమాషా! ఆమె చాలా అందంగా వుంటుందనుకున్నా!

మ : మరి...మరి...నీ, భర్త ఎలా వుంటాడు?

సు : మధ్యరకం ఎత్తు. ఉంగరాలజుత్తు. దయార్ద్ర హృదయం. ఉద్రేకాలు, ఉద్వేగాలు లేకుండా గంభీరంగా వుంటాడు.

మ : ఎంత గర్వంగా చెప్పావు?

సు : అలావా? (క్రిందికి చూస్తుంది)

మ : యేమిటి సంగతి?

సు : సంగతా? అంటే?

మ : నువు హటాత్తుగా దిగజారిపోయేవు!

సు : మనం చాలా చిలిపిగా ప్రవర్తిస్తున్నాం—

మ : ఎందుకని?

సు : ఎందుకనో నాకూ తెలీదు. ఏమయినా, మనం పూర్తిగా అపరిచయస్థులంకదా!

మ : కిటికీ మూయటం దారి వేరు—అందులో నా వేలు నలిగేలా చేయటం దారి వేరు!

సు : అబ్బే, మరేం అనుకోకు!

మ : సరే, మళ్లా మొదటికి వద్దాం.

సు : —ఏదీ—పూర్తిగా బాగున్లేదంటావా, అంటే —కాఫీ కన్నా.

మ : నా వృత్తి ధర్మం ప్రకారం, ఈ ప్రశ్నకు జవాబు కావాలంటే నువ్వు ఫీజు యివ్వ వలసొస్తుంది.

సు : (నవ్వుతో) నీ రైలు వొచ్చే వేళయింది.

మ : అబ్బ! దాన్ని గురించి ఆలోచనెందుకు? మన సంభాషణకు అంతరాయంగా ఆ రైలు రావటం తెలుసుకుంటే...

సు : ఊరికే గుర్తుచేశాను. మరేం లేదు; అన్నట్టు, యిందాక యేమిటి అన్నావు? పనీ ఆదరాలూ మిళితమా? ఏమిటా ఆదరాలు.

మ : అబ్బో, అదో పెద్దకథ!

సు : డాక్టర్లందరికీ ఆదరాలు వుండి తీరాలను కుంటాను, లేకుంటే—కార్యభారం మరీ దుర్భర మవుతుంది. నువ్వు యిక్కడికి ప్రతి గురువారం వస్తావనుకుంటాను.

మ : అవును, ఒకరోజు యిక్కడి ఆస్పత్రిలో గడిపి వెళతాను. యిక్కడి పెద్దడాక్టరూ నేనూ కలిసి చదువుకున్నాం. అతని దగ్గర వారానికో రోజయినా ఆస్పత్రి రోగుల్ని పరిశీలించేందుకు వస్తాను.

సు : ఇందువల్ల నీకేమయినా లాభమా?

మ : లేకేం! చాలమంది డాక్టర్లు-ముఖ్యంగా యౌవనదశలో, ప్రయివేటు కలలుకంటారు. యివన్నీ చాలమటుకు వాళ్ల వృత్తికి సంబంధించే వుంటాయి. ఏమి...యిదంతా నీకు వింతగా అనిపించటం లేదుకద!

సు : లేదు, అర్థం కావటంలేదుకాని వింతగా మటుకు లేదు.

మ : నా వుద్దేశం యేమిటంటే, గొప్ప డాక్టర్లందరూ మొదట మంచి ఆసక్తి కలవాళ్లయివుండాలి. రచయితలలాగ, చిత్రకారులలాగ, యింకా కావాలంటే మత ప్రచారకులలాగ. వాళ్లకు కూడా నలుగురికీ మంచిచేదామనే నిర్వికారమయిన సత్సంకల్పం వుండాలి!

సు : అవును, నాకిప్పుడు అర్థమవుతోంది.

మ : ఇక చూడావూ—రోగనిరోధమే నివారణ కన్న లక్షరెట్లు నయం, అదే నా లక్ష్యం. రోగ నిరోధక వైద్యానికీ, మామూలు వైద్యానికీ అసలు పోలికే లేదు. ఈ వైద్యం కేవలం నియమాలు, జీవన విధానాలు, ప్రపంచజ్ఞానం మీద ఆధార పడివుంది. ఉదాహరణకి, నా ప్రత్యేకత—గుండెజబ్బులు.

సు : ఓ!

మ : భయపడకు మరి. సాంతంవింటే అసలు భయపడాల్సిందే వుండదు. గాలితోపాటు దుమ్ము రేణువుల్ని కూడా పీల్చటం యీరోగానికి మూలకారణం. ఈ వూరి ఆస్పత్రిలో యీ వ్యాధిగురించి పరిశీలించటానికి మంచి సదుపాయాలున్నాయి, యిక్కడే బొగ్గు గనులున్నాయి కదు మరి!

సు : నువ్వు హటాత్తుగా చిన్నవాడివై పోయినట్లున్నావు.

మ : అట్లాగా!

సు : నిజంగా, చిన్నకుర్రాడిలా!

మ : ఎందుచేత నీకట్లా కనిపిస్తోంది?

సు : యేమో నాకు తెలీదు...ఊఁ...తెలుసు.

మ : చెప్పుమరి!

సు : ఊహూ, చెప్పలేను. నువ్వు బొగ్గగనుల్ని గురించి మాట్లాడుతున్నావు.

మ : అవును గాలితోపాటు బొగ్గునుసి కూడా ఊపిరి తిత్తుల్లోకి వెళుతుంది—యిదోరకం.

సు : ఇంకోరకం యేమిటి?

మ : చాలా వున్నై, లోహపు దుమ్ము, ఉక్కు పరిశ్రమలున్నాయే— అవి! యింకా— రాతి దుమ్ము — బంగారపు గనులూ—

సు : ఓహో — (గణగణమని ఘంటానాదం) అదిగో, నీ రైలుబండి.

మ : అవును.—

సు : నువ్వీ రైలు తప్పిపోకూడదు.

మ : ఊహు—

సు : అసలు సంగతేమిటి?

మ : ఏమీ లేదు...యేమీ లేదు—

సు : యివాళ చాలా వుంది. మధ్యాహ్నమంతా చాలా హాయిగా గడిచిపోయింది.

మ : అందుకు నాకూ చాలసంతోషంగా నే వుంది. కాని ఈ యీరోగాల కబుర్లు చెప్పి నిన్ను విసిగించినందుకు మాత్రం విచారంగా వుంది.

సు : అవి నాకంతగా అర్థంకావులే!

మ : సరే, మళ్లీ కలుసుకుందాం — (రైలు వస్తోన్న సవ్వడి)

సు : పై ప్లాట్‌ఫారానికి వెళ్లాలి కదూ? పరిగెత్తాలి. నన్ను గురించెపుడూ దిగులుపడకు. నా రైలూ మరో నిమిషానికల్లా వస్తుంది—

మ : మనం మళ్లీ కలుసు కుందామా? (రైలు యింకా మీదకి వస్తోన్న సవ్వడి) మరి—మరి

సు : ఏమిటది?

మ : వచ్చే గురువారం, సరీగా యివాళటి టైముకే

సు : ఊహు, కుదరదు బహుశా—

మ : అబ్బ ... బతిమాలు కుంటాను నిన్ను... ప్రార్థి...

సు : సరే, అలాగేలే— (మధు లేస్తాడు)... పరిగెత్తు—

మ : వెళ్లోస్తాను,

సు : సరే, నే నక్కడికే వస్తాను—

మ : మంచిది, వెళతా... (పరిగెడుతూ అప్పుడే వస్తోన్న సీతాపతిని ఢీకొడతాడు)

సీ: : ఓ! ఏమిటది నింపాదిగా పరిగెత్తు మరేం తొందర లేదు— [తెర]

## 3

* * రిఫ్రెష్‌మెంట్ రూంలో ఎవరూ లేరు; సుందరమ్మ తప్ప. ఆమె కిందికి వంగి, స్టౌలో బొగ్గులు కూరుస్తో వుంటుంది. సీతాపతి వస్తాడు. ఆమె వక్కర్తే ఉండటం చూచి, వీపు తట్టుతాడు. ఆమె బంతిలా పైకిలేస్తుంది.

సుం : ఎంత సాహసం! ఎంత దారుణం!

సీ : నే నాపని చెయ్యకుండా వుండలేకపోయా!?

సుం : నీ చేతులు పడిపోను—

సీ : నీకు కోపం వచ్చినప్పుడు, అచ్చంగా అప్సరసలా వుంటావ్ —

సుం : ఒక్కడికొచ్చి నీ యిష్టంవచ్చినట్టు ప్రవర్తించటం, ఏమిటీ చేష్టి...

సీ : పోయిన సోమవారం జరిగిందాన్నిబట్టే, యీమాత్రం చనువుకొద్దీ వీపున తట్టినందుకు నువ్వేమీ అనుకుంటా వనుకో లేదు-

సుం : పోయిన సోమవారం మాట అట్లావుంచు- నేనిప్పుడు 'డ్యూటీ'మీదున్నాను-ఎవరన్నా స్టేషన్‌మాష్టరు కిటికీలోంచి నువ్వుచేసినపని చూస్తే—యింకేమున్నా వుందా?

సీ : ఆ! యేం చేస్తాడ్లెదూ!

సుం : సిగ్గులేకపోతే సరి—ముఖానికి—!

సీ : అంతంత లేనిమాట లుపయోగించకు మరి—

సుం : చాల్లే – ఊరుకో (కౌంటర్ వెనక్కు వెళు తుంది. — సీతాపతి సన్నగా యీలపాట ప్రారంభిస్తాడు—)

సుం : నీ యీల పాటలు కట్టిపెట్టు. ప్లాట్‌ఫారం మీదకి వినిపిస్తుంది—

[సీతాపతి యింకా పెద్దగా పాడతాడు—]

సుం : ఇదుగో, సీతాపతీ, ఖచితంగా అడుగుతున్నాను. నువు యికనయినా జాగ్రత్తగా మసులుకుంటావా? లేదా?

సీ : (పాట సగంలో ఆపి) యిది నా సంతోష సమయాల్లో ఒకటి!

సుం : ఇదుగో, నీ 'టీ' కప్పు తీసుకు, దూరంగా పోయి కూచో.

సీ : నిజం చెప్పాలంటే - యీ తప్పంతా నీదే!

సుం : నీకు - బహుశా - మతి పోయుంటుంది.

సీ : ఇవాళ రాత్రికి...

సుం : నువ్వు జాగ్రత్తగా ప్రవర్తించకపోతే, యివాళ రాత్రీ లేదు, రేపు రాత్రీ లేదు. మరో రాత్రీ...

[సీతాపతి మళ్లీ పాట ప్రారంభిస్తాడు]

యిదుగో, నోరు మూసుకుంటావా లేదా!

సీ : ఒక్క ముద్దివ్వు.

సుం : అంగాంటి అసభ్యపు పన్లేమీ చెయ్యను, ఏమనుకున్నావో.

సీ : ఒక్కటంటే ఒక్కటే! చాలు (ఆమె భుజం తడతాడు)

సుం : సీతాపతి, యింతతో నీ చిలిపిచేష్టలు ఆపుదూ-

సీ : రా, రా, యిది ప్రణయం...

సుం : ఛా, అవతలికి పో!

సీ : రా, ఒక్కముద్దు — ఒక్కటి...ఒక్కటి చాలన్నానుగా!

[ఒకక్షణం పెనుగులాడుకుని, యిద్దరూ రొట్టెల వరసమీద విరుచుకు పడతారు. అవన్నీ నేలపాలవుతాయి.]

సుం : చూశావా, చక్కటి రొట్టెలన్నీ నేలపాలయినై, నీమోటసరసం, నావూనూ!

[సీతాపతి వాటిని యేరేందుకు వొంగుతాడు, గంగరాజు ప్రవేశం.]

గం : సరిగ్గా సమయానికి వచ్చినట్టున్నానే!

సుం : నోరుమూసుకు, రొట్టెలు పైకెత్తు.

గం : అంతకంటేనా...

[మధు సుధ వస్తారు, సుధ మామూలు బల్ల దగ్గిరికివెళ్ళి కూర్చుంటుంది. మధు కౌంటర్ దగ్గిరికి వస్తాడు.]

మ : రెండు టీ,

సుం : రొట్టెలూ, బన్లూ...

మ : ఒద్దు, టీ ఒక్కటే చాలు.

సీ : వాతావరణం బాసున్నట్టుంది, డాక్టరు గారూ!

మ : చాలా బాగుంది.

సీ : కాని, వాతావరణంలో కొద్ది తడి వున్నట్టుంది.

[సుందరమ్మ మధుకు రెండుకప్పులందించి డబ్బులు పుచ్చుకుని, గంగరాజువైపు తిరుగుతుంది.]

సు : ఏమిటి, ఊరికే గుడ్లగూబలా చూస్తున్నావ్?

గం : శేషమ్మ ఎక్కడుందా, అని!

సుం : అదెక్కడుంటే నీకెందుకూ? నువ్వు నాలుగో నంబరు ప్లాట్‌ఫారంమీద నీపని చూసుకో— పద! అంతే!

గం : ఇవ్వాళ, గ్లాక్సోజు బిస్కట్టు పొట్లాలకు ఎక్కడలేనిగిరాకీ వచ్చిపడింది, నాకు స్టాకు కావాలి.

సుం : నీదగ్గరెన్నున్నై?

గం : మూడు—

సుం : మరోడజను తీసుకుపో. లెక్కరాయటం మర్చిపోకు.

గం : రైటో! (అంటూ డజనుప్యాకెట్లు అందుకు వెళ్లిపోతాడు)

మ : నాకు నిర్దయగా వుండటం చేతకాదు.

సు : అసలు సంగతి అదికాదు.

[ఓయువకుడు లోపలికివచ్చి కౌంటర్ దగ్గిరికి వెడతాడు.]

యు : కప్పుకాఫీ.

సుం : ఇంద (కాఫీకప్పు అందిస్తోంటేగా, సీతాపతి ఓరగా చూస్తాడు)

మ : మనమిట్లా విడిపోలేం.

సు : యిట్లా విడిపోతేనే బావుండు ననిపిస్తోంది.

మ : నిజంగానా?

సు : అదే ఆలోచిస్తున్నాను.

సుం : (యువకుడితో) ఆరుకాన్లు (డబ్బు తీసుకుంటుంది.)

సీ : ఇవాళ రాత్రి విషయం మామూలే కద!

సుం : చూదాం-(శేషమ్మ ప్రవేశిస్తుంది, కౌంటర్ వెనక్కు నెడుతుంది.)

మ : నిజానికి మనం విడిపోయి ప్రయోజనం లేదు-మనమిద్దరం ప్రేమికులం కద! పంథవం అయినా కాకపోయినా మనం హృదయానికి హృదయం యిచ్చుకునే ప్రేమికులం!

సు : ఇది ఎంత తప్పో మీకు తోచటం లేదా? ఎంత తప్పు!!

మ : తప్పో ఒప్పో తరవాతిమాట, నేను యథార్థాన్ని గమనిస్తున్నాను.

శే : (సీతాపతితో) మిమ్మల్ని స్టేషను మాస్టరుగారు రమ్మంటున్నారు.

సీ : ఎందుకూ? వాడితో నాకేం పని?

శే : యేమో, నాకేం తెలుసూ?

సుం : వెళ్లు సీతాపతీ, వాడెల్లాంటి ఉద్దండుడో నీకు తెలుసుగా!

సీ : వాడెంతటి చవట వెధవో నాకు తెలుసు-

సుం : యేమిటామాట! శోషవుంటేగా...తొందరగా ఇంత తాగేసి వెళ్ళు.

సీ : ఈ వెధవ వుద్యోగానికి క్షణం తీరిక లేదు, ఉమ్మిడీ...

సుం : వెళుదూ—

సీ : మళ్ళీ వస్తానూ—

సుం : అల్లాగేలే - (సీతాపతి వెడతాడు.)

[సుందరమ్మ కౌంటర్ చివరికి వెళుతుంది.]

మధు : (అతి తొందరగా) శ్రీహరి వచ్చేటప్పటికి చాలా ఆలశ్యం అవుతుంది. ఎవరికీ తెలిసే అవకాశం లేదు.

సు : అంత కక్కుర్తి పడా? అప్రతిష్ఠ. అంతకన్నా యేమీ లేకండా వుండటమే నయం.

మ : ఇప్పటికే చాలా ఆలస్యం అయిపోయింది. ధైర్యం తెచ్చుకో సుధా. ఇద్దరం ఒకే పడవలో ప్రయాణిస్తున్నాం. మనం పరస్పరం ఉదారంగా వుందాం- యేం?

సు : ఇందులో ధైర్యానికేముంది? దొంగచాటుగా మరొకళ్లయింట్లో జేరటం, మొగుడొకంటి వాడికి తెలీకుండా, త్వరత్వరగా భయపడుతో, రహస్యంగా యివతల పడటం— యింతకన్నా, ఒకళ్ళకొకళ్లం దణ్ణంపెట్టుకు యింకెప్పుడూ కలవకుండావుండటం నిజంగా ధైర్యమయిన పని!

మ : నువ్వా ధైర్యమయిన పని చెయ్యగలవా— యేమో నాచేతకాదు!

సు : చేతకాదూ?

మ : విను సుధా, యిది యిదివరకెప్పుడూ మనకు సంఘటించని విషయం. ఇంతకుముందే మనం ప్రేమించబడ్డాం, సుఖపడ్డాం, తృప్తిపడ్డాం. అది వేరేవిషయం. దీని మాటో, యిది దానికి పూర్తిగా వ్యతిరేకం. విచిత్రమయిన ప్రేమసన్నివేశం... మన సామాన్య జీవితాల విలువతో దీన్ని కొలవలేం.

సు : ఇది ఎందుకంత ముఖ్యమయిందనుకోవాలి? మనం దీనికంత ప్రాముఖ్యం ఎందుకివ్వాలి?

మ : మరో మార్గం లేదు కనక!

సు : లేకపోలేదు మధూ, మనం కాస్త గాంభీర్యం నేర్చుకోవాలి.

మ : అత్యంత అవసరమయినదీ, నిజమయినదీ— మన నరాల బాధకి కావల్సిందీ అయిన దీని పట్ల మనకు గాంభీర్యం యెందుకు? అల్లాగయితే, యీ కోరికనించీ యివతల పడటం గాంభీర్యంతో కాదు—బలహీనతతో నేమో

సు : నీకంత పట్టింపా?

మ : నీకు తెలీటంలేదా?

సు : కష్టం, చాలా యాతన, నాకేమీ తోచటం లేదు.

మ : అల్లా అనకు సుధా!

సు : నిన్ను ప్రేమించటం నాకెంతో గండం. నిన్ను ప్రేమిస్తే నాయింట్లో నేను పరాయిదాన్నవుతాను. అతిపరిచయమయిన వస్తువులుకూడా — సంవత్సరాల తరబడి చూస్తోన్న తలుపు తెరలు, కొయ్యపెట్టెలు- యింటి సామాన్లన్నీ నావంక విచిత్రంగా చూస్తాయి. అవి నావికావనిపిస్తుంది. నిన్ను వొదిలి వెళ్ళాక—యిదివర కెన్నడూ ఎరగనంత యేకాంతంతో బాధపడతాను... నా జీవితం యావత్తూ నానించి దూరదూరంగా పోతున్నట్టవుతుంది. నాకేం చెయ్యటానికీ తోచదు.

మ : ...సుధా!...

సు : నాకు నా భర్తన్నా, పిల్లలన్నా యిదే ప్రేమ. అంతా నావాళ్లుకారా?— నేను

యొకరినో చూస్తున్నాననిపిస్తుంది. అర్థమవుతోందా—నే. చెబుతున్నది — మగవాళ్లకి ఈ పని తేలికేమో?

మ : నాకు తెలీదు.

సు : అబ్బ, నాకేసి విచారంగా చూడకు— నేనేం నసగటం లేదు. నిజంగా!

మ : ప్రేమలో పడటం ఎవరికిగానీ అంత తేలిక విషయంగా వొదిలిపోలేదనుకుంటాను.

సు : మనకింకా కొద్ది నిముషాలే టైముంది. అబ్బో! నా వుద్వేగం తొందరగా విడిపోవటం నా కిష్టమని కాదు...నాకు, ధైర్యం కావాలి.

మ : దారి పొడుగునా రైల్లో నిన్ను నా కౌగిలిలోనే వుంచుకుంటాను. ఒంటరితనం నాకు ప్రాణాంతకంగా తయారవుతుంది. నా గది తలుపు చప్పుడవుతే, ఎవరో గాని లోపలికి చొరబడుతూంటే... నువ్వే నేమోనని ఆశగా తలపైకెత్తుతాను...

సు : మనం చాలా చిలిపిగా మాట్లాడుకుంటున్నాం, కదూ!

మ : శుక్రవారం, శని-ఆది-సోమ-మంగళ-బుధ—

సు : గురు—

మ : అంతేకదూ?

సు : అవునంతే!

మ : మళ్ళీ యిల్లు దాటెయ్యకు—

[రైలుగంట మోగుతుంది. శేషమ్మ కాఫీ కప్పు సుందరమ్మ ముందు పెడుతుంది]

సుం : (కాఫీ తాగుతూ) సీతాపతి, అప్పుడప్పుడూ తుంటరితనపు చేష్టలు చేస్తాడన్నమాటే గాని మొత్తంమీద పెద్దమనిషే. గౌరవనీయుడు...

[రైలు వస్తోన్న చప్పుడు]

సు : అదిగో నీ రైలు-

మ : నేను దాన్ని దాటేస్తాను.

సు : వద్దు—వెళ్ళు, నా మాట విను.

మ : ఉహు.

సు : కాస్త విశదంగా ఆలోచించగలిగితే బాగుణ్ణు. నాకేం చెయ్యాల్సిందీ తోస్తే బాగుండును.

మ : నువ్వు నన్ను నమ్ముతావా?

సు : ఆ! ముమ్మాటికీ.

మ : వొట్టి కోసం కాదు. మనసులో మాట చెప్పు

సు : నిజంగా నే—

మ : అంతా మనకు వ్యతిరేకంగావుంది. పరిస్థితులు ఎదురుతిరుగుతున్నై. ఈ తనువులిట్లా తెల్లవారాల్సిందే. మనం యీ ప్రేమని యింతటితో ముడిపెట్టి దాచేద్దాం. దీనివల్ల మరెవరికీ నష్టం కలగకూడదు. కలిగేనష్టమేదో మనమే భరిద్దాం.

సు : అందువల్ల మనకు నష్టమా?

మ : అవును—ఆ సమయం వచ్చినప్పుడు.

సు : సరే!

మ : యీ వ్యవహారం మరెవరికీ తెలియకుండా కనీసం అనుమానలేశంగా నయినా స్ఫురించకుండా వున్నంతవరకే మన ప్లాను సాగుతుంది.

సు : మంచిదే!

మ : మనం దీన్నిగురించి యికముందెప్పుడూ మాట్లాడొద్దు. ఇదుగో, నేను వెళుతున్నాను. శ్రీహరి గదికే మళ్ళీ. నీ కోసం ఎదురు చూస్తాను. నువ్వు ఎంతకీ రాకపోతే, నువ్వు సిద్ధమవలేదనుకుంటాను. ఓ నిశ్చయానికి రావటానికి నీకింకా టైం కావాలనుకుంటాను. యింక అప్పుడు (అంటూ ఆమెకో కౌగిలింత ముక్క యిచ్చి, వెనక్కి తిరిగి చూడకుండా వెళ్ళిపోతాడు-)

[రైలు పరిగెడుతున్న చప్పుడు. సుధ లేచి తలుపువైపు నడుస్తుంది—తెర]

## 4

* * రిఫ్రెష్‌మెంట్ రూంలో రెండే లైట్లు వెలుగుతున్నై. దాదాపు కొట్టు కట్టేసే టయిమయింది. ఖాళీగా వుంటుంది. రైలు వడివడిగా వెళుతున్న చప్పుడు. శేషమ్మ వచ్చి కౌంటర్ మీద గుడ్డ కప్పుతుంది. ఇంతలో గంగరాజు వస్తాడు. యూనిఫారంలో కాక, మామూలు దుస్తుల్లో ఉంటాడు.

గంగ : ఏం, యింటికి వెళుతున్నావా?

శే : అవును-

గం : అయితే నీకోసం ఆగమంటావా?

శే : నేను తిన్నగా యింటికి వెళ్ళిపోవాలి.

గం : ఏం కథ?

శే : అమ్మ నాకోసరం కాచుకునుంటుంది.

గం : ఇక్కడ యేదో ఆలస్యం అయిపోయిందని చెప్పొచ్చు లేవూ?

శే : అల్లా యిదివరకే చాలాసార్లు చేశా.

గం : ఈ రోజూ అదేపాట! షాపు చాలా రష్‌గా వుందని చెప్పు.

శే : చాల్లే. అమ్మ యేమంత తెలివి తక్కువదను కున్నావ్?

గం : కాస్త తెలివిగా ప్రవర్తించమశేఖీ. అయిదు నిమిషాలు ముందుగా కొట్టు కట్టేసి, రష్ మూలంగా పదినిమిషాలు ఆలస్యం అయిందను. అలాగ్గా పావుగంట కలిసొచ్చేస్తుంది.

శే : ఇంతలో సుందరమ్మ తిరిగొచ్చేస్తే!

గం : ఏం వెర్రిమాట! సీతాపతితో సరదాగా షికార్లు కొడుతూంటే అప్పుడే యెల్లావస్తుంది. సరే! నీకోసం దార్లో కాచుకునుంటా-

శే : అల్లాగే లే (గంగరాజు వెళ్ళిపోతాడు)

[సుధ వస్తుంది.]

సు : ఓ గ్లాసు ద్రాక్ష...

శే : షాపు మూసేస్తున్నానమ్మా.

సు : కనిపిస్తూనే వుంది. కాని యింకా పూర్తిగా మూసెయ్యలేదుగా!

శే : సరే... నాలుగణాలు.

సు : (పర్సు తీసి డబ్బులిస్తూ) ఇదుగో - నీదగ్గర చిన్న కాయితం ముక్క, ఓ కవరూ ఉన్నాయా?

శే : బుక్‌స్టాల్‌లో దొరుకుతాయనుకుంటా!

సు : కాని స్టాల్ కట్టేశారు, కాస్త చూద్దూ-యే మూలన్నా వున్నాయేమో?

శే : సరే, వుండండి, చూస్తాను. (లోపలికి వెళు తుంది. సుధ గ్లాసు తీసుకుంటుంది-)

శే : (తిరిగి వొస్తూ) అదృష్టం కొద్దీ, వున్నై.

సు : థాంక్స్!

శే : మరో నిమిషానికి షాపు మూసేస్తాను.

సు : ఊ-(తీరిగ్గా కూచుని యేదో రాస్తూంటుంది. యింతలో వుప్పెనగా మధువస్తాడు.)

మ : అమ్మయ్య! యిక్కడే వున్నావుకద! బతికించావు!

సు : దయచేసి వెళ్ళిపో. యింకనాతో మాట్లాడకు-నీకు పుణ్యముంటుంది.

మ : నిన్నిట్లా ఎట్లా వెళ్ళనిస్తాననుకున్నావ్?

సు : నేనువెళ్ళి తీరతాను. యిదే మంచి పద్ధతి.

మ : నువ్వుచాలా క్రూరంగా మాట్లాడుతున్నావు సుధా.

సు : నాకు తలతీసేసి నట్టుంది, నీకేం పోయిందీ!

మ : వాడింత తొందర్లో తిరిగిరావటం కొంప ముంచింది! అయినా, వాడు నువ్వెవరో ఎర గడు. అదీకాక, వాడసలు నిన్ను చూడనే లేదు.

సు : ముందునించీ మీ మాటలన్నీ విన్నా- మెల్లిగా దిగి, కిటికీల దగ్గరకొంగి, నానిదానిలా భయపడుతూ - యిబ్బందిల పడ్డాను - యింకా గుండెలు గభీమని కొట్టుకుంటూనే వున్నాయి.

మ : అలా-నిష్ఠూరంగా మాట్లాడకు సుధా.

సు : ఈ కథంతా విన్నాక అతను నవ్వివుంటాడు కదూ? నువ్వు కూడా, నన్ను గురించి ప్రపంచంలో యితర మగవాళ్ళలా మాట్లాడావుగా!

మ : మేం నిన్ను గురించి మాట్లాడనే లేదు-ఊరూ పేరూ లేని...

సు : నువ్వు నాతో నిజం చెప్పవ్. నేనెవరో అతని కెందుకు చెప్పకూడదు? మనం ప్రేమికులమనీ, రహస్యంగా, యింకెక్కడా చోటు లేదు కనక-అతని గదుల్లో కలుసుకుంటున్నామనీ, బయట పడటమంటే మహాభయంగా వున్నదనీ...ఎందుకు చెప్పలేదూ? మనం అతి చవుకబారు మనుష్యుల మనీ, సాహసం శూన్యమనీ...

మ : అబ్బ, సుధా-యిదంతా.

సు : ఇదంతా నిజమే, సాక్షాత్తూ నిజం-కదూ-!

మ : నాకు తెలుసు-నీకిదంతా చాలా బాధగా వుంటుందని. నాకూ చాలా విచారంగా

వుంది. యీ అనుకోని దుస్సంఘటన, నిజంగా—మన దురదృష్టం. కాని, మనం నిజంగా ప్రేమించుకున్నట్టు మనకు తెలుసు కద! అదే కావల్సింది!

సు : అంతే కాదు. కావల్సింది. యింకా వున్నై. ఆత్మ గౌరవం, సభ్యతా పోయిన తర్వాత యింకేమిటి?...ఉహు, యింతటితో చాల్లే యిక!

మ : ఇంతేనా, యింతేనాయిక మన సంగతి?— ముందు, ముందు, నా ముఖం కూడా చూడవా?

సు : నువు నాకో సహాయం చేస్తానంటే—(కాస్సేపు నిశ్శబ్దం)

మ : నిన్ను నేను ప్రేమిస్తున్నాను సుధా. నా జీవితాంతం ప్రేమిస్తూనే వుంటాను. ఎవరేమనుకున్నా ఫరవాలేదు. ఇప్పుడు నీ వేపు చూడలేను, ఎందుకంటే యిది తుదికి వాంది. నిన్ను ప్రేమించటానికి తుదకాదు, మనం కలిసి వుండటానికి! అబ్బ, యిప్పుడే కాదు—సుధా...యిప్పుడే కాదు.

సు : అవును, ఇప్పుడే కాదు.

మ : ఈ సాయంత్రాన్ని గురించి నువేమనుకుంటున్నావో నాకు తెలుసు. మనవి విభిన్న జీవితాలు; దూరదూరంగా మెలుగుతాం. పాపం చేస్తున్నామన్న భీతి అప్పుడప్పుడూ భారమవుతూంటుంది. మనం జాగ్రత్తగా వుండాలి, ప్రయత్నంలో వుండాలి. ఎంత ధైర్య సాహసోపేతమయిన పనయినా సరే చేసేట్టుండాలి. మన హృదయాలకీ మనసులకీ అంత దౌర్జన్యం చెయ్యలేం కద!

సు : మంచిదే!

మ : నేను వెళిపోతున్నాను.

సు : ఓహో!

మ : అయితే, అప్పుడే కాదు. (శేషి వస్తుంది)

శే : షాపు మూసేసే టయమయింది.

మ : అలాగా!

శే : ఇక తాళం వేసెయ్యాలి!

మ : ఈమె యింకో పావుగంటలో రాబోయే రైలు కోసరం ఎదురుచూస్తోంది. ఒంట్లో బాగుళ్ళేదు. ప్లాట్ఫారం మీద ఎముకలు కొరికే చలి!

శే : వెయిటింగ్ రూం తెరిచే వుంటుంది, చూడండి.

సు : ఒక్క పావుగంట సేపు కూచోనిస్తే, నేను చాలా ఋణపడి వుంటాం.

శే : అబ్బే! రూల్సుకు వ్యతిరేకంగా ఎట్లా చెయ్యను?

మ : (ఆమెకో అయిదు రూపాయిల నోటు అందిస్తూ) కాస్త రైలు వచ్చేంత వరకూ కనిపెట్టివుండు, తరవాత నీ యిష్టం!

శే : అయితే, లైట్లు తీసెయ్యాల్సి వుంటుంది. లేకపోతే, యింకా మూసెయ్యలేదని ఎవరేనా లోనికి జొరబడగలరు!

మ : ఎంతసేపూ! ఒక పావు గంట!

శే : మీరి వేవీ ముట్టుకోకండా వుంటారు కద!

మ : ఏమీ ముట్టుకోం.

శే : సరే (లైటు ఆర్పేస్తుంది, ప్లాట్ఫారంమీద లైటు తాలూకు కాంతి కిటికీలోనుంచి గదిలోకి పడుతూవుంటుంది)

మ : నువు చాలా మంచి దానివి! (శేషి ప్లాట్ఫారం మీదికి వెళిపోతుంది. వెళుతూ తలుపు మూస్తుంది)

మ : యిప్పుడు నువో వాగ్దానం చెయ్యాలి!

సు : ఏమిటది?

మ : ఈ క్షణంలో ఎంత ఖేదపడుతున్నా సరే! జరిగిపోయిందానికి ఎంతగా వగుస్తున్నా సరే, వొచ్చే గురువారం యథాప్రకారం వస్తానని నాకు మాటయివ్వు.

సు : వస్తాను, కాని — ఆ యింటికొక్కడు.

మ : సరీగా ఆ సమయానికి సినిమాహాలు దగ్గరికిరా. నేనో కారు అద్దెకు తెస్తాను, అట్లా వూళ్ళోకి పోదాం.

సు : అలాగే! తప్పకుండా వస్తాను —

మ : మనం మాట్లాడుకోవాలి, నీకింకా విశదీకరించాలి.

సు : ఏమిటి, వెళ్ళిపోవటం సంగతేనా?

మ : అవును.

సు : ఎక్కడికి వెడతావు, నీ ప్రాక్టీసంతా వొదిలి?

మ : నాకో ఉద్యోగం దొరికింది. వెళ్ళకుండా దారిలేదు అదేదారి?

సు : ఎక్కడా?

మ : చాల దూరం అయిదొందల మైళ్ళు.

సు : ఓ!

మ : మా అన్నయ్య అక్కడున్నాడు. కొత్త హాస్పిటలు తెరుస్తున్నారు, నన్ను రమ్మంటున్నారు. నిజానికి యింతకంటే గొప్ప అవకాశం ఉండదు, భార్యనీ పిల్లల్నీ కూడా తీసుకెళతాను. కొన్ని వారాలుగా యీ సమస్యే నన్ను వేధిస్తోంది, ఏదో ఒకటి తేల్చుకోవాలి. ఇంకా ఎవరికీ చెప్పలేదు. నిన్ను వొదిలిపెట్టటమంటే యేదోలా బాధగా ఉంది. కాని, ఏం లాభం యిది జరిగి తీరుతుంది.

సు : ఎప్పుడు వెళతావు?

మ : దాదాపు, రెండు నెల్లలో.

సు : అయితే, దగ్గర్లోనే నన్నమాట.

మ : ఇక్కడే వుండి పొమ్మంటావా? ఆఫర్ను తోసి పారేయమంటావా, చెప్పు!

సు : తెలివి తక్కువగా మాట్లాడకు-మధూ!

మ : నువేం చెబితే-అల్లా చేస్తాను.

సు : నువుచాలా కర్కోటకుడివి-(ముఖం రెండు చేతుల్లో కప్పుకుని యేడుస్తుంది.)

మ : (ఆమె చుట్టూ చేతులు వేస్తూ) అబ్బే, యేడవకు...యేడవకు సుధా!

సు : ...ఉండు, ఉండు...ఒక్క నిమిషం ఆగు!

మ : నేన్నిన్ను-ప్రేమిస్తున్నాను...ప్రేమ...

సు : నాకూ తెలుసు.

మ : మనం చాలా కష్టపడతాం...

సు : నేను చాలా తెలివి తక్కువదాన్ని... (ప్లాట్ ఫారంమీద ఘంటానాదం) అదిగో, నా రైలు రానే వచ్చింది.

మ : నీకు, నామీద కోపమేం, లేదు గద!

సు : నాకేం కోపంలేదు... ఊరికే హైరానుగా ఉంది. అంతే!

మ : నన్ను క్షమించవూ?

సు : ఎందుకూ, నువేం చేశావని?

మ : అన్నింటికీ-ముందు నిన్ను కలుసుకున్నందుకు, నీకంట్లోపడ్డ నలక తీసినందుకు, నిన్ను ప్రేమిస్తున్నందుకు, నీ కింత ఖేదం కలిగిస్తున్నందుకు...

సు : (నవ్వటానికి ప్రయత్నిస్తూ) నువు నన్ను క్షమిస్తే, నేనూ నిన్ను క్షమిస్తాను.

[రైలు వస్తున్న చప్పుడు. శేషి గబగబా ప్రవేశిస్తుంది]

మ : పద రైలు ఎక్కిస్తాను,

సు : అక్కర్లేదు-ఉండిపో,

మ : సరే!

సు : వెళతాను మధూ!

మ : ఉంటా-సుధా-(వెనుదిరిగి చూడకుండా, హడావిడిగా ప్లాట్ ఫారంమీదికి వెళుతుంది)

సు : అటు పోయే చివరి రైలు యింకా రాలేదనుకుంటా?

శే : ఏమో, నాకు తెలీదు.

మ : సరే, నేను వెయిటింగ్ రూంలో కూచుంటాను, నీ సహాయానికి సంతోషం!

శే : నేనింక తాళం వేసుకు పోవాలి!

మ : సరే, వస్తాను-(అతను ప్లాట్ ఫారంమీదికి వెళ్ళేటప్పటికి రైలు కదుల్తుంది) [తెర]

## 5

* * సుందరమ్మ కౌంటర్ దగ్గర, శేషమ్మ స్టౌదగ్గర, వుంటారు, సీతాపతి వస్తాడు.

సీ : ఒక—టీ! పంచదార ఎక్కువ! ముందు ఓ బన్ కూడా యివ్వు.

సుం : ఏమిటి హడావుడి, సీతాపతీ!

సీ : (వినిపించుకోనట్టు) శేషీ, తొందరగా కానీ, వెళ్లాలి.

సుం : శేషికి ఆర్డరివ్వటానికి నీకున్న హక్కేమిటి? అలా వీల్లేదు.

సీ : శేషీ, నే చెబుతున్నా కద. తయారుచెయ్యి

శే : అబ్బే, నే నివ్వనండీ.

సుం : శేషీ, నువో నిమిషం వెనకగదిలోకి వెళ్లు.

శే : అల్లాగేనమ్మా (వెళుతుంది)

సుం : జాగ్రత్తగా ప్రవర్తించు సీతాపతీ, స్టేషన్ యావత్తూ, మనల్ని చూచి నవ్వాలని వుందా యేమిటి?

సీ : ఇందులో నవ్వేందుకేముంది?

సుం : ఇదుగో టీ.

సీ : నీకెట్లా వుంది?

సుం : కొత్త ఒళ్లుదగ్గర పెట్టుకుమాట్లాడు, నాకెట్లా వుండటమేమిటి?

సీ : నేననేదీ—(ఆమెకి దగ్గరగా వొంగుతాడు)

సుం : చూడూ, ఎవరో వస్తున్నట్టున్నారు.

సీ : ఆ! యింకెవరూ మన లైలా మజ్నూలే!

[మధు సుధ వస్తారు. ఆమె మామూలు కుర్చీలో కూర్చుంటుంది. మధు కౌంటర్ దగ్గిరికి వెళతాడు]

సుం : రెండు టీ—కదూ?

మ : అవును—(డబ్బుయిచ్చి, రెండుకప్పులు పట్టుకెళ్లి, సుధపక్క కూర్చుంటాడు)

సీ : నేను స్టేషను మాష్టరుతో మాట్లాడాను.

సుం : యేమన్నాడూ?

సీ : ఏమంటాడు? అతని మంచితనం మనకు తెలీందా? సరే నన్నాడు.

[ఓ పన్నెండేళ్ళ అమ్మాయి పరుగెత్తుకొస్తుంది]

అ : శేషమ్మ ఎక్కడుంది?

సుం : ఎందుకమ్మాయి? యేమిటి పని?

అ : శేషమ్మ తల్లికి మళ్లా ముంచుకొచ్చింది. తొందరగా తీసుకురమ్మన్నారు.

సుం : అయితే లోపలికెళ్ళు, శేషమ్మ లోపలుంది... కాని, గాభరాగా మాత్రం చెప్పకు, అసలే అర్భకపు పిల్ల, మూర్ఛపోతుందో యేమో. నింపాదిగా చెప్పు.

అ : వాళ్లు తొందరగా తీసుకు రమ్మన్నారు, మరి!

సుం : ఇలాంటిదేదో జరుగుతుందని నేననుకుంటూనే వున్నాను. ఉండు, అయితే—నేనే వెళ్ళి శేషమ్మని పిల్చుకొని వస్తా—ఒక్క నిమిషం ఆగు, సీతాపతి—(లోపలి కెళుతుంది)

సీ : నువ్వు బుక్‌స్టాల్ దగ్గరున్నావు కదా! యీ కబురు నీకెలా తెలిసింది?

అ : వాళ్లు ఫోన్లో మాష్టారికి చెప్పారు, ఆయన నన్ను పంపారు.

సీ : అట్లావా?

అ : శేషమ్మ అమ్మ యీసారి చనిపోతుందంటారా?

సి : ఏమో, నాకు జ్యోతిషం రాదు.

అ : డాక్టరు అలాగని అన్నాట్ట—ఫోన్లో చెప్పారు... ఆమె చాలా కాలం నించీ తీసుకొంటోంది. (సుందరమ్మ, శేషమ్మ వస్తారు)

సుం : శేషమ్మ కూడా నువ్వూ వెళ్లు అమ్మాయ్.

అ : అలాగే రా శేషమ్మ!

సుం : చూడు, శేషీ, నువి రాత్రికి మళ్ళీ రానక్కర్లేదు. యింటిపట్టు నే వుండు—పాపం.

సీ : అదేమిటి, మనం యివాళ సినిమాకి వెళదామనుకున్నాం కదు. పాపుదగ్గర?

సుం : సిగ్గుచేటు! అవతల ముసలిదానికి ఒచ్చేప్రాణం, పొయ్యేప్రాణంగా వుంటే, మనకి సినిమాకి మునిగిపోయిందేమిటి? యివాళ, కాకపోతే, రేపాయిరి...

సీ : కాని... కాని...

సుం : చాల్లేవూరుకో, నాకు రాత్రి పిడకలవచ్చింది. నాకు పిడకల వచ్చిందంటే ఆ తెల్లారి ఎవరో గుటుక్కుమన్నారన్నమాటే!

సీ : యేమో, సినిమాకి వెడదామనుకుని,...... తీరా......

సుం : పెద్దమనిషివన్నమాటేగాని, నీకు ప్రపంచజ్ఞానం సుతరామూ లేదు సీతాపతీ! సరే, యిప్పుడు నీతో వాదించే తీరిక నాకు లేదు—టీ తాగేసి, వెళ్లు గేటుకాపలాకి.

సీ : రిజర్వు టిక్కెట్లు తెప్పించాను.

సుం : ఆ టిక్కెట్లు గంగలో కలుపు. నేనుమాత్రం రాను.

సీ : (టీ చప్పరిస్తూ) ఈ ఆడవాళ్లు రామరామ! (అంటూ ప్లాట్‌ఫారంమీదికి వెళ్లిపోతాడు.)

మ : నువు కులాసాగావున్నావా, సుధా,

సు : ఆ! ఆ!

మ : ఏం మాట్లాడటానికీ తోచకుండా వుంది.

సు : ఫరవాలేదు లే!

మ : ఇవాళ, నా బండి తప్పిపోయి—నిన్ను బండి యెక్కించేటంతవరకూ ఉంటాను.

సు : వొద్దు. నీతోపాటు నీ ప్లాట్‌ఫారంమీదికి వస్తాను. నీ ప్రయాణంమటుకు ఆపుకోకు!

మ : సరే, అల్లాగే లే!

సు : అయితే, మనిద్దరం మళ్లా కల్సుకుంటామంటావా?

మ : యేమో, నాకు తెలీదు. (గాద్గదికంగా) యేమో, కొన్ని సంవత్సరాలవరకూ కుదరదేమో!

సు : పిల్లలు బాగా పెరిగి పెద్దవాళ్లవుతారు. యిక వాళ్లు కలుసుకు, తెలిసినట్లు తిరగటం ఎట్లా పొసగుతుంది?

మ : నీకు అప్పుడప్పుడూ ఉత్తరాలు రాస్తోంటాను.

సు : ఊహూ, వొద్దు. అట్లా వొద్దనుకున్నాంగా మనం.

మ : నువ్వు...నువు యుగాల తరబడి నాలోనే వుంటావని గుర్తుంచుకో. మనం అట్లా భవిష్యత్తులో తేలిపోదాం. నిన్ను చూడని వ్యథ అట్లా కాలానుగతికంగా తొలగిపోతుంది. కాని నీమీది ప్రేమ, నీ స్మృతీ నన్ను వొదలవు.

సు : అవును—అవును.

మ : నీకన్నా నాకిది తేలిక. నేనిది బాగా గుర్తిస్తున్నాను. ఏమంటే నేను కొత్త కొత్త పరిసరాల్లో తిరుగుతున్నాను. నీకుమాత్రం అవే, అవే, ఎన్నాళ్లయినా అదే ప్రపంచం. అవే పరిచిత సముదాయం. నిన్ను తల్చుకుంటే నాకు విచారంగా వుంది.

సు : కాదు, నేనూ బాధ తగ్గించుకొంటానులే.

మ : నువే నా ఆత్మ, నువే నా హృదయం, సుధా.

సు : ఈ పళంగా నాకు మరణం వస్తే బాగుణ్ను. అబ్బ, నేను చావగలిగితేనా!

మ : వొద్దు. నువు మరణించొద్దు. నువు నన్ను మర్చిపోవద్దు.

సు : అవును—

మ : ఇక సెలవు—సుధా.

సు : సెలవు, మధూ.

మ : యింకా టైముంది, సుధా.

సు : ఓ! ఆ— (పార్వతమ్మ హడావడిగా లోపలికొస్తుంది లావాంటి మనిషి. చేతుల్లో మూడు నాలుగు నిండు సంచులు. రాగానే సుధని గమనిస్తుంది—).

పా : ఓ! సుధా! నిన్నిక్కడ కల్సుకోటం చాలా తమాషాగావుందే!

సు : (ఆశ్చర్యపోతూ) ఓ! పార్వతమ్మగారు! రండి!

పా : అబ్బబ్బ! మార్కెట్టు వెళ్లివచ్చేటప్పటికి నాపనయింది కాళ్లు తడబడుతున్నై, గొంతు కెండిపోతోంది. బజారు హోటల్లో కాస్త టీ పుచ్చుకుందామనుకున్నాను కాని, తీరా రైలు వుడాయిస్తుందేమోనని భయమేసి, ఎల్లాగో ఉగ్గబట్టుకు యిక్కడికి చేరుకున్నాను...రైలు దాటిపోతే భోజనాని కాలస్యం. యింట్లో ఆయన గుసగుసలు! అబ్బ...యేం అవస్థ! (అంటూ పక్కనే కూచుంటుంది.)

సు : వీరు డాక్టర్ మధు—

మ : నమస్కారం.

పా : నమస్కారం. కాస్త నాకు కప్పు టీ తెచ్చిపెడుదురూ, పుణ్యం వుంటుంది. లేస్తేవొళ్లు తిరిగి పడిపోతాననిపిస్తుంది, ఆయనకు నాలుగు చాక్లెట్టుపొట్లాలు కూడా తీసుకుపోవాలి; యివిగో డబ్బులు-

మ : అక్కర్లేదులెండి (కౌంటర్ దగ్గరికెళ్ళి టీ తీసుకొచ్చి పార్వతమ్మముందు పెడతాడు)

పా : చాల మంచివారండి వీరు (టీ చప్పరించి) ఓ— పంచదార—

మ : అదిగో, చెంచాలో—

పా : చూచుకోలేదు,— సుధా, నువ్వివాళ వస్తావన్నట్లు నాకు తెలీదు సుమా, లేకపోతే యిద్దరం కలిసొచ్చి, భోంచేసి వచ్చేవారం.

ఖులాసాగా కబుర్లుచెప్పుకునేవాళ్లం. బజారు సరుకులు కలిసితెచ్చుకొనేవాళ్లం, (ప్లాట్ ఫారంమీద ఘంటానాదం.)

సు : అదిగో, నీరైలు

మ : అవును—

పా : యేం, మీరు మాతో రావటంలేదా?

మ : లేదు, నేనటువైపు పోతున్నాను.

పా : అలాగా! అన్నట్టు, మీరు యే డాక్టరు?- కన్నా - చెవా-

మ : అవేవీ కాదు, మామూలు డాక్టరుని, ఫామిలీ...

సు : డాక్టర్ మధు వచ్చేవారం విదేశం వెళుతున్నారు.

పా : ఓహో! చాలా సంతోషం. (రైలు వస్తోన్న చప్పుడు.)

మ : ఇక నేను వెళ్లాలి.

సు : (యేవీ తోచనట్టు) అవును, వెళ్లాలి...

మ : గుడ్ బై - వస్తాను!

సు : గుడ్ బై, (మధు దాదాపు పరిగెడుతూ వెళతాడు. సుధ కదలకండా కూచుంటుంది.)

పా : అతను పాపం పరిగెత్తితేకాని రైలందుకో లేడు, అవతలి ప్లాట్ ఫారానికి వెళ్లాలి. అతను నీకెట్లా తెలుసు సుధా?

సు : ఓ నాడు కంట్లో నలుసుపడింది దాన్నాయన తీశారు.

పా : ఆహా! యేమి ప్రేమ - యేమి ప్రేమ— నాకు రోజూ కంట్లో నలుసులు పడుతో వేవుంటై, నన్నుగురించి ఎవరూ పట్టించుకోరు. (రైలు కదిలే చప్పుడు క్రమక్రమంగా తగ్గుతుంది - తరవాత, ప్లాట్ ఫారంనుంచి ఘంటానాదం) (సుందరమ్మతో) - యిదేం రైలు?

సుం : ఎక్స్ప్రెస్.

పా : అలాగా? మన రైలు కాదు, ఎక్స్ప్రెస్ అన్ని స్టేషన్లలో ఆగదు కదూ? ఆయనకి ఎక్స్ప్రెస్ ఎక్కడ ఆగేది, ఎక్కణ్ణుంచి బయలుదేరేదీ, ఎంతెంతసేపు వెళ్ళేదీ-క్షుణ్ణంగా తెలుసు. ఓ! అన్నట్టు నేను చాక్లెట్లు పట్టికెళ్ళటం మర్చిపోనుకద! (లేచి కౌంటర్ దగ్గరికి వెడుతుంది. సుధ కదలదు)—నాకు చాక్లెట్లు కావాలి!

సం : పావా, అర పావా?

సుం : పాలవా, పుత్తినా?

పా : ఉత్తివిచాలు. అహా! పాలవయితే యింకా బావుంటై కావును, అవేయివ్వండి.

పా : పావు పౌను చాలు, ఊరికే నమలటానికే కద! (ఎక్స్ప్రెస్ వస్తోన్న చప్పుడు. సుధ తటాలున లేచి ప్లాట్ ఫారంమీదికి వెళుతుంది. పార్వతమ్మ చాక్లెట్లు తీసుకుని, డబ్బుచెల్లించి వెనక్కి తిరిగే టప్పటికి ఎక్స్ప్రెస్ప్లాట్ ఫారంమీదికి పూర్తిగా వచ్చేస్తుంది.

పా : ఓ—సుధ యేదీ—

సుం : నేనామె వెళ్ళటం చూశ్ళేదు. (పార్వతమ్మ బల్లదగ్గరికొస్తుంది, సుధ తిరిగి లోపలికొస్తుంది ముఖం పాలిపోయి అదోలా వుంటుంది)

పా : అబ్బ! నువెట్లో ఉడాయించావనుకున్నాను.

సు : ఎక్స్ప్రెస్ వెడుతూంటే, చూదామని లేచాను.

పా : యేమిటి కథ? అట్లా వున్నావేం? ఒంట్లో ఎలా వుందేం?

సు : కొద్దిగా బద్ధకంగా వుంది.

పా : కాస్త టీ తీసుకో హుషారుకలుగుతుంది.

సు : ఇప్పటికి నాలుగుసార్లయింది. ఎక్కువయితే, పైత్యం చేస్తుంది!

పా : అయినా ఫరవాలేదు. మరేం ముంచుకు పోదులే. (మళ్ళీ ప్లాట్ ఫారంమీద ఘంటానాదం ఇదుగో యీసారి మనరైలే పద, పద పోదాం పద. పార్వతమ్మ హడావడిగా తన సంచులు సర్దుకుంటూ పైకి లేస్తూ వుండగా రైలు వస్తున్న చప్పుడు)

[తెర వాలుతుంది]

# పెండ్లిచూపులకు శుభకాలము

## శ్రీ రాళ్లపల్లి గోపాలకృష్ణమాచార్యులు

శాస్త్ర విశ్వాసమో, సనాతన సంప్రదాయమో, మూఢభక్తియో, కారణ మేదైనా కానిండు, మనదేశములో వివాహమంగళములకు శుభముహూర్తమును నిర్ణయించుట సర్వసాధారణముగా వాడుకలో నున్న పద్ధతి. పల్లెటూళ్లలో నివసించుచు అనాగరకులుగా ఎంచబడువారు సయితము తాంబూల దక్షిణలతో ఏ పంచాంగ మయ్యగారినో ఆశ్రయించి ముహూర్తము పెట్టించుకొననిదే శుభకార్యములు జరుపరు. కాని, ముహూర్తముయొక్క ఫలము లగ్నము నాశ్రయించి యుండుననియు, లగ్నమనగా, స్థూలముగా చెప్పినచో, ఒక నిమిష కాలము మాత్రమే అనియు, తెలియకనో, తెలిసినా నిరాదరించియో, ఏ రెండుగంటల కాలమో శుభముహూర్తమని పంచాంగమయ్యవారు చెప్పగా, ఆ మధ్యకాలములో ఎప్పుడో తమ తీరికననుసరించి తాళికట్టించుట జరుగుచున్నది. వీరిమాట అట్లుండగా, నవనాగరకచక్రవర్తుల మనుకొను ఆధునిక విద్యాధికులలో అనేకులు 9 నుండి 11 గంటలలోగా, లేక 10 నుండి 12 గంటలలోగా, ముహూర్తమని అచ్చువేయించి లగ్నపత్రికలు పంపుట పరిపాటి అయినది. అతివైభవముతో జరుపు ఈ తరగతి వివాహములలో టిండి తీర్థముల ధోరణిపై, కాఫీ కషాయముల సమారాధనపై, సోడా సీసాల పంపకముపై, తంత్రీవాద్యముల సంరంభముపై, చూపు శ్రద్ధాభక్తులు ముహూర్తకాలముపైన చూపు వారుండరు. పురోహితమహాశయుని కెప్పుడు తీరికయై అనుగ్రహము వచ్చునో, అప్పుడే "తదేవ లగ్నము". అదే శుభకాలము. కంట్రాక్టు పద్ధతితో, ముట్టవలసిన సువర్ణ పుష్పదక్షిణలు మొత్తముగా ముట్టినతరువాత,- అనేకవివాహములలో ఇప్పుడిట్టిపద్ధతి వ్యాపించినది—, శుభకాల మెట్టిదైతే, పురోహితుని కేమి తీట ?

ఈ నవనాగరక వివాహముల కథ అట్లుంచుము. నికరముగా లగ్నకాలమును గంటలు నిమిషములలో నిర్ణయించుకొను సంప్రదాయము గలవారికి సహా, ఆచారములో కొన్ని చిక్కులున్నవి. నిర్ణయించిన శుభక్షణములో జరుపవలసిన ముఖ్యకార్య మేది, అను విషయమున సంప్రదాయములు బహువిధములుగా నున్నవి. వివాహమునకు కన్యాదానము ముఖ్యమగుటచే, శుభలగ్న కాలమున కన్యాదానము చేయవలయు ననువారు కొందరు కలరు. వివాహమనగా, పాణిగ్రహణముగనుక, దానానంతరము వరుడు వధువు హస్తమును స్వీకరించు క్షణమునకే లగ్నకాలము కావలెనని కొందరు అనుచున్నారు. కన్యక శిరస్సున వరుడు జీలకర్ర బెల్లమునుంచి ప్రమాణము చేయుకాలము ప్రధానము కారణమున ఆ కార్యమునకే శుభక్షణము కావలయునని వేరు కొందరిమతము. వివాహచిహ్నముగా వరుడు వధువు కంఠములో మంగళసూత్రమును కట్టు నిమిషమే లగ్నకాలముగా నుండవలయునను వారు పలువురు కలరు. సప్తపది కానిదే వివాహము సాంగము కానేరదు కనుక, సప్తపది శుభకాలములో జరుగవలయునని వాదించువారు మరికొందరున్నారు. ఇట్లగుటచే కొంత అవ్యవస్థ చూపట్టుచున్నది.

పై కార్యము లన్నియు వివాహమునకు అంగము లనుటకు సందేహము లేదు. కాని, ఇవి యన్నియు ఒకటే శుభక్షణమున జరుపగలుగుట కాని పని. వేరు వేరు శుభలగ్నములు వీనికి నిర్ణయించుట సయితము అసాధ్య కార్యము—కనుక, ఏ కార్యము ముఖ్యమో, వానినే శుభ క్షణమున జరుపుట అవశ్యకర్తవ్యము—కాని, ఏది ముఖ్యము అనునదే సమస్య.

శాస్త్రములలో పైన చెప్పిన కార్యములకు శుభ కాలము విధించబడలేదు. శాస్త్రకారుల దృష్టి వేరు. వివాహ ఫలము దాంపత్యము మూడువిధములైన సంయోగములవలన సిద్ధించుచున్నది. వానిలో మొదటిది తేజస్సంయోగము. కన్యావరులు పరస్పరము చూచుకొనగా కలుగు దృష్టిసమ్మేళనమువలన ఈ తేజస్సం

యోగము జరుగును. ఇది సమంత్రకముగా జరుగవలయునని గృహ్య సూత్రవిధి. హోమానంతరము సమంత్రకముగా వరుడు వధువుయొక్కయు తనయొక్కయు హృదయములను స్పృశించునపుడు హృదయసంయోగము సిద్ధించును. సహవేశనానంతరము నిషేక కాలమున దేహసంయోగము కలుగును. ఈ మూడింటిలో ముఖ్యమై, మిగిలిన రెండింటికిని, కారణభూతమైన తేజస్సంయోగమునకే శుభక్షణము కావలయుననుట శాస్త్ర మర్యాద.

(1) "శాస్త్రోక్తమార్గేణ సులగ్న కాలం
స్పష్టం సమానీయ జలాది యంత్రైః,
సంలక్ష్య తం మంగళ సూక్ష్మకాలం
సంలోకయే త్తత్ర మిథోద్వ్య దృష్టిః."
(వశిష్ఠః)

(2) "అన్యోన్య వీక్షణం సమ్యక్
సులగ్నే కారయేత్ సదా." (కాశ్యపః)

(3) "ఏవం సులగ్నే దంపత్యోః
కారయేత్ సమ్యగీక్షణం."
(జ్యోతిర్నిబంధనము)

ఈ మున్నగు శాస్త్రవాక్యములు గమనింపదగినవి.

మునుపటి కాలములో వివాహమునకు పూర్వమే కన్యావరులు పరస్పరము చూచుకొను సంప్రదాయము లేదు. ఇరుపక్షములవారి పెద్దలు ముందుగ సంప్రతించుకొని సంబంధమును నిర్ధారించిన తరువాత, దైవానుకూలముకల శుభకాలమున వివాహము నేర్పరచి, కన్యావరులకు నడుమ తెరపట్టి, తెర మరుగుననుండియే కన్యాదానము జరిగిన తరువాత, తెర తొలగించినపుడే వారొకరినొకరు ప్రప్రథమమున చూచుకొనుటయు, అన్యోన్యముగ వారికపుడు శుభకాలములో తేజస్సంయోగము కలుగుటయు సంభవించుచుండెడిది. ఈ కార్యమునకే శాస్త్రకారులు శుభకాలమును విధించియుండుట. కాని కాలవశమున పద్ధతులిపుడు తారుమారైనవి. ఇప్పటి పరిణయములలో అనేక సందర్భములయందు కన్యావరుల పరస్పర సందర్శన మహోత్సవము, సరససల్లాపాదులతో గూడ, వివాహమునకెంతో పూర్వమే ఎన్నిసారులో యథాసావకాశముగా, నిరాటంకముగా, జరిగియుండగలదు. ఇట్టి సంవిధానపు ఫలముగ అన్యోన్యముగ మనశ్చక్షువులకు సంప్రీతి కలిగినట్లు వారికి సంపూర్ణవిశ్వాసమో, అథవా భ్రమయో, వచ్చిననేతప్ప సామాన్యముగ వివాహములు జరుగవు. అనగా, మొదటి రెండు విధములైన సంయోగములు వివాహమునకు పూర్వమే జరిగి, మూడవదిమాత్రమే సాధారణముగ మిగిలియుండుననుట. దీనికి సహా శుభకాలమును నిర్ణయించు ఆచారము కొందరు చాదస్తపు పెద్దలలో మాపట్టుచున్నది. కాని, అవి నిరర్థకప్రయాసయే — వధూవరులు ఉత్కంఠితులైనచో, కాలమునకు వేచియుండలేరు. వారికి ఔదాసీన్యముండెనేని, ఈ నిర్ణయము వ్యర్థమే. ఇట్టి పరిస్థితులలో జరుగుచున్న ఇప్పటి ప్రౌఢవివాహములలో శుభకాలమునందు జరుగతగిన కార్యమేది? ఇది — వాస్తవముగ చిక్కు సమస్యయే.

పరస్పర సందర్శనము పూర్వమే జరిగియుండినా వివాహకాలములో సమంత్రకముగా దృష్టిసమ్మేళనము కలుగు క్షణమునకే శుభకాలము కావలయునని కొందరు భావించుచున్నారు. వేదమంత్రార్థముల ప్రభావముపై భక్తివిశ్వాసములుగలవారు ఆ పద్ధతి నవలంబించుట యుక్తమే. అది లేనిచోట ఏక్రియ వివాహమునకు ముఖ్యమనుభావము సంఘములో పాదుకొనియుండునో ఆ కార్యమునే శుభకాలములో జరుపుట శ్రేయస్సు. అనేక సందర్భములలో, మంగళసూత్రధారణమే వివాహప్రధానచిహ్నమను భావము జనులలో నిండియున్నదగుటచే, దానికే శుభకాలము నిచ్చుట తృప్తికరముగా నుండగలదు. ఉంగరముల నెప్పుడు మార్చుకొనినా, పుస్తకములో చేవ్రాళ్లు చేయు కాలమునకే కదా రిజిష్టరు వివాహములకు లగ్నము చూడవలసియుండును?

అది యట్లుండె. కన్యావరులు పరస్పరము చూచుకొను క్షణమునకు అంత గొప్ప ప్రాధాన్యమిచ్చుట అవసరమా? అని సందేహించువారుందురు.

"యదా గ్రహాణాం వైషమ్యం
సర్వారంభం పరిత్యజ
కార్య విఘ్నకరా హ్యేతే,
కృతమప్యత్ర నశ్యతి."

అను భరద్వాజవాక్యమును స్మరింతము.

గ్రహవైషమ్యముగల కాలములో పరస్పర సందర్శన కార్యము జరిగెనేని, ఉద్దిష్ట కార్యమునకు విఘ్నమైనా కావచ్చును. లేదా, కార్యము (అనగా

వివాహము) జరిగినచో, తరువాత అది నశించవచ్చును. కాని, అంత్య విఘ్నముకంటె, ఆదివిఘ్నమే ఎంతో నయము. వివాహము జరుగుటకు విఘ్నమైనచో, తాత్కాలిక స్వల్పవ్యయప్రయాసములతో పీడ తొలగును. అట్లుకాక, వివాహము జరిగి వైవాహిక జీవితమునకు భంగము కలిగెనేని, తీరరాని శాశ్వత క్లేశము ఫలమగును. అగుటచే వివాహావృష్టిలో జరుగు కన్యా వర సందర్శనము శుభకాలములో కానిచ్చుట అత్యంతావశ్యకము.

దృష్టాంతములు చూపనిచో ఈ సూత్రమును విశ్వసించుట కష్టము. కాని సామాన్యముగా ఇట్టి దృష్టాంతములు సమృద్ధిగా లభించుట దుస్తరము. ఇప్పటి కాలములో కన్యలు ప్రౌఢలు. వరులు ప్రౌఢతరులు. అనేక సందర్భములలో వీరి అన్యోన్య సందర్శనము ఏ క్లబ్బులలోనో, ఏ సినిమా ప్రదర్శనముల యందో ఏ స్నేహితుల గృహములలోని విందుల సన్నివేశముల మూలముగనో, యాదృచ్ఛికముగా సంభవించి క్రమముగా ఊడలుపాగునట్టివి. అవి ఏనాడు, ఏ కాలమున జరుగునో, గమనించువారే యుండరు. సాధారణముగా, ముంజేతిగడియారము లుండినా, వారికి అవి అలంకారముకొరకే. అప్పటి వారి భావోద్రిక్తస్థితిలో, వారి శివమెత్తిన ఉత్సాహములో, కాలమును గమనించుట కానిపని. ఇక కన్యా వర సందర్శనము పెద్దలే ఏర్పరచుపట్ల, ఏ భానువారము నాడో, ఏరజాదినమందో, వరుని సౌకర్యము ననుసరించి ఈ కార్యకలాపము నడచును. అంతేకాని, శుభదినముకాని, శుభకాలము కాని, కాకతాళీయ న్యాయముగా, సమకూడవలసినదే. లేనిచో, దాని ఇష్టము. అంతే! చేదస్తము గలవారెవరైనా కాలమును నిర్ణయించి వరుని పిలిపించినా, శుభకాలమునకు వరుడు సిద్ధపడుట అరుదు. పిలిచినా, కన్యక వేళకు వచ్చుటకు అలంకారము పూర్తికాదు. వీరు సిద్ధమగునప్పటికి భూగోళము కొన్ని వందలమైళ్లు తిరిగి యుండును. శుభకాలము కడచిపోయి, పుణ్యకాలము దాపురమగును. అగుటచే సందర్శనక్షణము నిష్కర్షగా తెలియగల సందర్భములు చాల తక్కువగా నుండునని పాఠక మహాశయులు సులభముగా ఊహించుకోగలరు. నికరముగా కాలము తెలిసినవానిలో నాల్గు దృష్టాంతములను ఇచట చూపుచున్నాను.

I. అనురూపులగు ఒకానొక కన్యావరుల పెండ్లిచూపులు 30-1-1949 నాడు 10-22 (A.M. IST) లో జరిగెను. అప్పటి గ్రహస్థితి ఇది.

| | | | |
|---|---|---|---|
| | I 11-15<br>రా 29-54 | | వ 27-0 (వ) |
| చ 22-9<br>కు 20.4<br>బు 16-32 వ<br>ర 10-0 | (సాయనము)<br>—<br>మాఘ కృష్ణపాడ్యమి<br>భానువారము ధనిష్ఠ | | |
| ల 21-8<br>గు 17-5<br>✕ 8-15 | | | కు.ము 17-27<br>(వ) |
| | | ఇ 15-7 (వ)<br>కే 29-54 | శ 4-32 (వ) |

దశమ భావములో గురుశుక్రులు, లాభ స్థానములో రవి, బుధ, కుజ, చంద్రులు, ఆరింట శని, కల యీ ముహూర్తము ఎంతో రమ్యముగా చూపట్టుచున్నది. లగ్నాధిపతి కుజుడు, సప్తమాధిపతి శుక్రుడు సహా అభివృద్ధి సూచక స్థానములలో నున్నమాట సత్యము. కాని వారిరువురికి ద్విద్వాదశ సంబంధము వలని ఔదాసీన్యమున్నది. పైగా, శుక్రునికి కుజుడు విపత్తారలో కుజునికి శుక్రుడు నైధనతారలో. అగుటచే వారికి సామరస్యము పూజ్యము. మరియు, చతుర్థ (గృహ) స్థానాధిపతి చంద్రుడు లగ్నాధిపతి కుజునినుండి విడివడి చతుర్థభావమందున్న విప్లవకారి వరుణుని మైత్రి నభిలషించుచున్నాడు. అవి చార పరతవలని క్లేశము, గృహములో (గృహస్థ ధర్మములో) ప్రబలమైన మార్పులు సూచితములు, కళత్రభావమునందు వక్రించి ప్రబలుడై కూర్చున్నవాడు మాయావి ఇంద్రుడు. ధర్మస్థానాధిపతియై నీచపడి రాజ్యస్థానమందున్న బృహస్పతికి ఆ ఇంద్రుని నుండి కేంద్రవేధ. స్వధర్మలోపము, దాంపత్యజీవితమునందు అవ్యవస్థాప్రసక్తి, దీనిఫలము. ఈ ముహూర్తములో జరిగిన కార్యము ఫలించినచో, అనగా, వీరికి వివాహమైనచో, ఫలితమెట్లుండగలదో, పై గ్రహయోగములు చాటుచున్నవి. లగ్నసప్తమాధి

పతులు అభివృద్ధిని సూచించుచున్నారే అనవచ్చును. గృహస్థాశ్రమధర్మమునకు భంగముకల్గుటయు, వైయక్తికముగా కన్యావరులు ఇతరవిధముగా బాధపడుటయు, సంభవించవచ్చును. శనిఫలము దానికే.

కన్యజాతకములో అష్టమభావమందున్న శనికి వరుని కేంద్రవేధ కలదు. ఆమెకు బృహస్పతి భర్తృభావాధిపతి. ఈ బృహస్పతి చారవశమున నీచుడై అష్టమభావములో చరించుచు జన్మశని స్థానమునకేవచ్చి జన్మవరుని వేధలో నున్న దినమందే ఈ వరసందర్శన మహోత్సవము! చతుర్థభావములో ఇంద్రబుధ సంయోగముకలది కన్య. 'భావాంబరవీధి విప్రతవిహారము'చే చొక్కి ఆనందించు లలితకళారాధకురాలామె. ఆ ఇంద్రబుధ సంయోగ స్థానమందే వరుని కళత్రాధిపతి శని యుండుట. ముగ్ధమధురమైన ఆమె కోమల మనోధర్మమును ఉపయోగించుకొని శని పట్టినాడు. శనిపట్టు మకరిపట్టు.

"పట్టుపట్టరాదు; పట్టివిడువరాదు." అనుట శని మహాశయుని నీతిసూత్రములలో ప్రధానమైనది. చారములో స్వస్థానమునకు (వరజాతకములో) వచ్చినపుడే శనిపట్టినాడు. ఇక, వదలుట ఎన్నటికో?

సప్తమరాశిలో శనికి ఉచ్చ; కళత్రభావములో శనికి పూర్ణదిగ్బలము; కళత్ర కారకుడగు శుక్రునితో శనికి నిసర్గమైత్రి, ఇట్టి శనిపట్టు వైవాహికజీవితమునకు అహితమెట్లు కాగలదు? అనవచ్చును. సరే. హితకరుడైనప్పుడు వైవాహిక జీవితమునకు శనిపట్టు స్పృహణీయమే కావచ్చు ననుకొందము. కాని, శని వైయక్తికముగా అహితచింతకుడైనచో, అప్పుడు వైవాహిక జీవితమున అతని ప్రభావమును భరించుటెట్లు? "దినగండము, దీర్ఘాయుస్సు." అను సామెతి యనుకదా? కౌగలింతల నొక్కులు కొంత కాలము సాగినా, రుచికరము కానోపును. కాని గొంతు నొక్కిపట్టినచో, ఎంతకాల మోర్వవచ్చును?

వీక్షణ కాలమున లగ్నము సాక్షాత్తుగా వరుని జన్మశుక్రస్థానమే. చూచినతోడనే ఆ లావణ్యవతికి వరుడు దివ్యసుందరుడుగా, అతనికి ఆ యువతి మోహినిగా, చూపట్టియుండుట వింతకాదు. ముహూర్తములో సప్తమభాగములో నున్న ఇంద్రునికి నిండుకోణ దృష్టిలో బుధుడున్నాడుకదా? బుద్ధికి ఇంద్రుడు మంత్రించి మచ్చుబూడిద చల్లినాడు. ఇంకేమి కావలయును?

కన్యావరులు సంబంధమునకు సమ్మతించినారు. తోడనే నిశ్చయము సహా జరిగినది. త్వరలో వివాహమునకై వారాత్రము చూపినారుకూడ. కాని, నెలకే ముహూర్తచంద్రుడు చలించి దశమకేంద్రమునకు అర్థకేంద్ర విషమదృష్టికిరాగా, వారి కోర్కెలకు అంతరాయము కలిగెను. వరుని జనకుడు ఇహలోకయాత్ర చాలించుకొన్నాడు. ఇట్టి సంఘటనకు 'దైవ ప్రాతికూల్య'మని పేరు.

"వాగ్దానానంతరం మాతా
పితా భ్రాతా విపద్యతే,
వివాహో నైవ కర్తవ్యః,
స్వయం స్వహిత మిచ్ఛతా."
(మాండవ్యుడు)

ఒక ఏడాదికాలము పరిణామము జరుగుటకు వీలుకాలేదు. తరువాత వివాహము యథావిధిగా నెరవేరినది. చలితచంద్రుడు శనినుండి సమసప్తక వేధను పొందినప్పుడే యీ వివాహము. వరునిను శని ఎట్లు పట్టినాడో, వేరుసాక్ష్యము కావలయునా?

వివాహానంతరము ఏమేమో ప్రతిబంధకములు ఏర్పడి, భర్తఇల్లు చేరుకొనుటకు భార్యకు సంవత్సరకాలముపట్టినది. చేరుకొన్న తరువాత అత్తవారింటిలో ఆమెకన్నియు అసౌకర్యములే. భర్తగారి ఉత్సాహము చల్లబడినది. అతని నిరుత్సాహము అనుక్షణము వ్యక్తమగుచు వచ్చెను. అతని కృష్ణలీలలు సహించుట ఆమెకు శక్తికి మీరినకార్యము. ఇక ఇంటివారి పోరు దుర్భరము కాజొచ్చెను. ఆమె గోడు వినువారే కానరాలేరు. సంవత్సర కాలమునకు పైగా భర్తదయకై కన్నులు కాయగట్టువట్లు కాచి కాచి, విసికి, వేసరి, అగతికయై ఆమె పుట్టినిల్లు చేరుకొన్నది. ఇతర విషయము లెట్లయినా, కడుపాత్రమయినా తీర్చుకోవలయు కదా? ఆలోచించి జీవనయాత్రకై ఆమె విద్యావ్యాసంగము చేయ నారంభించినది. చలిత లగ్నము ఇంద్రుని సమసప్తక వేధకు వచ్చునప్పటికి, అనగా, అయిదేండ్లలో, ఈ పెండ్లిచూపుల కథ ఈరీతిగా ముక్తాయమునకు వచ్చుట! ఫలము శూన్యమయినా, శనిపట్టు వదలలేదు. భవిష్యత్తు

దైవాధీనము. దాని చర్చ ప్రకృతసందర్భమునకు సంబంధించినది కాదు.

II. ఉన్నతవిద్యా సంపన్నులైన ఒకానొక వరమహాశయునితో విద్యావతియగు నొక తరుణికి 7-11-1950 వ తేదీ మధ్యాహ్నము 1-53 P.M.(IST) కాలములో పెండ్లి చూపులమహోత్సవము జరిగినది. ఆనాటి తిథివారములు ఇట్టి శుభకార్యములకు తగనివి. ఇట్టి స్వల్పకార్యమునకు శుభదినము కావలయునా యని ఇరుపక్షముల వారు సహా భావించియుందురు. చూపులు తృప్తికరముగ నైనచో, వివాహమునకు యోగ్యమను సుముహూర్తమును ఏర్పరచుకొనుట తప్పదు కదా? కాని, ఈ చూపుల ఫలముగా వివాహము జరుగునెడల ఈ ముహూర్తము నాటిన బీజములే ఆ దాంపత్యములో ఫలించుననుట వారు గమనించియుండరు. విత్తొకటి నాటినచో, చెట్టు వేరొకటి ఎట్లు మొలవగలదు? ఈ ముహూర్తపు మహిమ ఎట్టిదో, ఇంచుక గమనింతము.

అప్పటి ఖగోళమందలి గ్రహభావస్థితిని ఈ క్రింద చక్రము తెలుపగలదు:—

| | | | |
|---|---|---|---|
| I 4-0 | | | |
| గు 27-56 | [సాయనము] — ఆశ్వయుజ కృష్ణ ద్వాదశి, మంగళవారము, హస్త | | శ 9-16 (వ) |
| కు 0 49 | | | యము 19-49 |
| X 9-45 | శు 12-43<br>ర 14-22<br>బు 17-48 | చ 7-17<br>ల 10-6 | కే 25-40<br>రా 28-46 |

'ప్రథమ గ్రాసములో మక్షికాపాత' మను రీతిగ స్పష్టముగా అష్టమచంద్ర స్థితి చూపట్టుచుండుట చదువరులు గమనించియుందురు. ఇది మహాదోషములలో నొకటి. దీనికి,

"మృత్యుగతే మృతపతి కా,
మరణం సముపైతి వా త్రిభి ర్మాసైః"

అనుట శౌనకమహర్షి చెప్పిన ఫలము. ఈ చంద్రునికి ఇచట పంచమాధిపత్య మున్నది. ఇతరవిషయము లట్లుండగా, విషయసుఖము మృగ్యమనియు, సంతానస్థానము చెడుననియు సూచించు దుష్టయోగ మిది. లగ్నములో లగ్నాధిపతి గురు వున్నాడు. కాని, చంద్రాష్టమదోషములను పోగొట్టు శక్తి ఇతనికి లేదు. విద్యామాధవుని సూక్తి యిది.

"శుభగ్రహాణా మపియోస్తి నిత్యం,
నతావతా కర్మ శుభం విదధ్యాత్,
గ్రాహ్యో మహాదోషవివర్జితోయం;
ఇదం ముహూర్తస్య పరం రహస్యం."

లగ్న సప్తమాధిపతులగు గురు బుధులకు పరస్పర కేంద్రమేదే! ఇది స్పర్థలు తెచ్చి పెట్టగలదు. అందులో బుధుడు అరింటియందుని కేంద్రవేధకే పోవుచున్నాడు. అనారోగ్యమో, శత్రువులు కారణముగా భార్యాభర్తలకు సౌమనస్యము తగ్గునని దీనిసూచన. చాలదని సంక్రమించు శనియొక్క అర్ధకేంద్ర దృష్టినే అఫలించుమందుట! మనస్పర్థ, అనారోగ్యము, గిట్టనివారికుట్ర, సుఖనాశనము ఫలమైనచో మిగిలిన దేమి?

ఇంతటితో పోయెననుకొనరాదు. హస్తానక్షత్రపు విషనాడిలో (తులారాశిలో 7-50 నుండి 8-43 వరకు) ముహూర్తకాలపు చంద్రుడున్నాడు. అనగా, ప్రయాణపు వర్జ్యకాలములోనే వధూవరులు ఈ సుముహూర్తమును సాధించినారనుట! ఇక, లగ్నమో, శతభిషానక్షత్రపు విషనాడిలో (మీన రాశిలో 3-50 నుండి 4-43 వరకు) నుండినది. మొత్తముమీద ముహూర్తమంతా విషమయమైన దన్నచో, సత్యమునకు దూరముకాదు.

ఇట్టికాలములో ఏర్పడిన కన్యావరసందర్శనము వివాహమునకు అవకాశమీయక ప్రారంభములోనే విఘ్నకారి అగుట ఎంతో మేలు. దోషఫలము ప్రయాణక్లేశముతో, రైలు చార్జీల వ్యయముతో చెల్లిపోవును. అట్లుకాక, వివాహరూపముగా పరిణమించెనేని పర్యవసానము ఘోరముగా నుండక మానదు.

ఈ ముహూర్త చక్రమునకు కన్యావరుల జాతకములతో వచ్చు ఆకర్షణమునను సరించి ఫలము చూపట్ట వలసి యున్నది. కన్య జాతక కుజుడు(లగ్నాధిపతి)

చలిత కేతువుతో చేరియున్నస్థానమే ఈ ముహూర్తమున నికరముగా సప్తమకేంద్రమైనది. ఆమె భర్తను సంపాదించుకోవలసినదే. భర్తలో కేతు ధర్మము చూపట్టవలసియున్నది. కేతువు మోక్షకారకుడు గదా? ఏవోరీతిగా వధువున కితడు మోక్షమార్గమును సులభముగా చూపగలడనవచ్చును. కన్య బుధునికి ఆనాటి శని నికరముగా సమసప్తకము. బుద్ధికి శని పట్టినాడు. వరుని లగ్నాధిపతి శనియే! అతనిని చూచినంతనే ఆమె బుద్ధికి మాంద్యము గప్పియుండును. ఆనాడు బుధుడు ఆమె చలితలగ్నముపై నుండెను. వరుని చలిత శనిస్థానము నికరముగా అష్ట. బుద్ధికి మాంద్యము రాదామరి? పోతే, వరుని శనిమీద రవియున్న దినమిది. విశేషమేమందురా? కన్య జన్మరవికి నికరముగా కేంద్ర విషమదృష్టిస్థానమదే. ఇది చాలక, అతని వివాహ సహమమునకు, ఆమె వివాహ మోక్ష సహమమునకు, మధ్య బిందువు అదే. ఈ శుభదినమున చారవరుణుడు ఆమె పుణ్యసహముపైన తూర్పుంచి, ఆమె వివాహసహమమునకు ఎదురైనాడు. అతని చలితశుక్రుడామె వివాహ సహమముపైనున్నాడని గమనించితిమేని, అసాధారణమైన ఆకర్షణమున కతని హృదయము లోనైనదనుట వింతకాదు. ఇంకెన్ని శుభ లక్షణములు కావలయును?

వరునిచంద్రుడు ఆనాటి షష్ఠరాహువునకు, అష్టమకేతువునకు, నడుమ చిక్కినాడు. కాలక్రమమున ఈ రాహు కేతువులు అతని మనస్సులో విష బీజములు నాటకపోరు. ముహూర్త చంద్రుడు చలించి కేతువుతో అర్ధ కేంద్ర క్రూరదృష్టికి రాగా, విషబీజము ఫలించవలసినదేకదా? పోనిండు.

త్వరలోనే వరణమైనది. కొన్ని నెలలలోనే వైభవముతో వివాహము నయితియు జరుపబడినది. కాని, వధువు భర్త ఇల్లు చేరుకొనుటకు అనారోగ్యాది కారణములచే కొంతకాల మతిక్రమించెను. చలిత శుక్రుడు శనివేధను నికరముగా అందుకోగల్గినప్పుడే వధువు అత్తవారిల్లు చేరుకొనుట? ఇట్టి దుర్దశలో దాంపత్య జీవిత మారంభమగుట విషాదకరము. చలిత శుక్రుడు శుక్రస్థానము చేరి శని అర్ధకేంద్రదృష్టినందుకోగా, నిర్దయాత్ముడై భర్త భార్యను పరిత్యజించినాడు. భార్యాభర్తలిరువురు ఉన్నత విద్యావంతులు; దర్శనీయ విగ్రహులు; అనురూపులు, సమర్థులు. కాని, అన్యోన్యముగా సామంజస్యము సంపాదించుకొను నేర్పు వారి కలవడలేదు. ఇంట గల్పిరచ్చగల్పు విద్య కళాశాల వారికి నేర్పలేదు. వారి జీవితములల్లే గడచుచున్నవి, తేజస్సంయోగ ముహూర్తపు ఫలము వారి జీవితముల కిట్టి పరిణామము తెచ్చినది. అమేయశక్తిగల కాలమును ధిక్కరించి ఏమి సాధించగలము?

III కులము, శీలము, విద్య, లావణ్యము, సౌందర్యము కల ఒకానొక తరుణిని 11-5 1952 నాడు 11-15 A. M. (I S T)లో అందగాడను వరుడొక్కడు వచ్చి చూచినాడు. అప్పటి కుండలి ఇది:—

| | | | |
|---|---|---|---|
| | బు 25-27 | శు 2-47<br>గు 8 29<br>X 11<br>ర 20-30 | |
| రా 26-30 | (సాయనము)<br>—<br>వైశాఖ కృష్ణ<br>తృతీయ భానువారము<br>అనూరాధ | | వ 11-9 |
| | | | I 12<br>యమ 19-7<br>కే 26-30 |
| చ 8-51 | కు 6-55<br>(వ) | శ 8-57<br>(వ)<br>ఇ 19-32 | |

దినశుద్ధి బాగున్నది. తారమంచిది. త్యాజ్యాది దోషములు లేవు. దశమ కేంద్రములో శుభగ్రహములగు గురు శుక్రులున్నారు. అందులో శుక్రుని కది స్వక్షేత్రము. కన్య లగ్నాధిపతి శుక్రుడే. ముహూర్త లగ్నాధిపతి రవి రాజ్య స్థానములో వెలుగుచున్నాడు. అంతా రమ్యముగ నున్నది.

కన్యావరులు సమ్మతించినారు. తన పెద్దలతో సంప్రతించి తగువాతి కార్యక్రమమునుగురించి వ్రాతునని వాగ్దానము చేసి పోయిన వరుడు ఔదాసీన్యము చూపినాడు. కారణము తెలియదు. జాబులకు ప్రతి లేదు. ఇటి పరిస్థితి కోమలుల పేశల హృదయములను గోడ్డలి పెట్టుకదా? వితుణ లగ్నము సాక్షాత్తుగా ఆమె చలిత భర్తృస్థానాధిపతి (కుజుని) పై నుండెను.

ఆమె వరుణుని నిండు త్రికోణ దృష్టి ఆ కుజునికి కలదు. దైనిక లగ్నమో, పతికికొనిపోయినట్లు, ఆమె చలిత భర్తృసహమును పై నధిష్ఠించిన దినమది. వరుని ప్రవర్తనమువలన ఆ యువతి హృదయ మెంత ఆందోళనము పాలు కావచ్చునో, మనము ఊహించుకో గలము.

ముహూర్తము బాగున్నదే, ఫలమిదేనా? అన వచ్చును. వీక్షణము ఫలించినది. వివాహము సయితము కావచ్చును. కుజ వరుణుల దృష్టి ఆలస్యము నోర్వ లేదు. అంతే!

"కర్మకాల ఫలం శస్త్రం, దుష్టం స్యాత్ జన్మజం ఫలం,
కార్యం భూత్వాపి, తత్పశ్చాత్,
విఘ్నస్తత్ర ప్రజాయతే,"
[జ్యోతిష్ప్రకాశము]

దశ విషమముగా నుండి, ముహూర్తము బాగున్నచో, ముహూర్తము ఫలించినా, తరువాత క్లేశము కలుగునని అర్థము.

ఆ యువతికి చలితరవి జన్మ వరుణునిలో సార్థ కేంద్ర క్రూరదృష్టిలో నున్న కాలమది. రవి వరుణుల వేధకల వయస్సులో ఏర్పడిన సంబంధములు, బాంధవ్యములు, భాగస్వామ్యపు నియమములు సాధారణముగా ఫలించవు; ఫలించినా, క్షేమకరముగా నుండవు. కాని, ఈ సమయమునకే ఆమె భర్తృస్థానాధిపతి కుజుడు చలించి వరుణునితో మిత్ర దృష్టికిపోవగల్గుటచే, భర్తృ సంపాదనమునకై ఆమె తహతహలాడు చుండుట. వయస్సు అనుకూలించినది దశకు. కాని, ఆమె చలితచంద్రుడు రవి వేధలో నుండిన కాలము నందే వరసందర్శనము జరుగుట. వియోగకారకుడగు వరుణుడే ఈ సంవిధానమును కల్పించినాడు. ఆమె చలిత రవికి సమసప్తకస్థానములోనే, ఆమె వరుణునికి అర్థకేంద్రస్థానమందే, నికరముగా ఈ వరుని జన్మశుక్రుడుండుట. మంగళాక్షతలతో ఆహ్వానించి వరుణపాశయుతుడు పిలుచుకొనివచ్చిన వరుడితడు. వ్యామోహపాశము తగులుకొన్నది. సమ్మతించినాడు, మహాలక్ష్మివంటి కన్యను చూచి ఏల సమ్మతించడు? కాని, దురాశపట్టినది. ఔదాసీన్యము వహించినచో, లక్ష్మీకటాక్షము (అరణము) హెచ్చునని తలచినా డతడు.

కింకర్తవ్యతామూఢురాలై, ఆ వివేకవతి జ్యోతిశ్శాస్త్రమును శరణమాశ్రయించినది. రవివరుణ వేధ దాదాపు సంవత్సరకాలము వ్యాపించి యుండగల దనియు, ఆలోగా వివాహము జరుగుట అహితమనియు వేధాకాలములో దాపురమైన వరుడు దుష్టఫలము నే దాంపత్యజీవితమున అందిచ్చుననియు, ఆమె గ్రహించినది. వివేకవతి అగుటచే, సంకల్పశక్తితో కోర్కెలను నిగ్రహించి నెమ్మదిపడినది. కాని, వరుణుడు పంపిన వరు డూరకనుండువాడు కాడు. అతని దురాశకు ఆదరము లభించకపోగా, చల్లబడి తగ్గిపోయి ఏ అరణము కాని లేకయే పెండ్లియాడగలనని ఆశచూపి, ఎంతో ప్రయాసపడినాడు. అయిన నేమి, ఆమె నిశ్చయమును మార్చుకొనలేదు. ఋజుప్రవర్తనలేని స్వార్థపరుడగు ఆ వరుని వివాహమాడుటకు ఆమె నిరాకరించి, రవి వరుణవేధ కడచిపోవుదాక వివాహప్రశంస రానీయక వ్యాసంగముతో కాలక్షేపము చేయుచు, గండము గడచుకొన్నది. ఈ వేధాకాలములో ఆ వరునితో అతిసులభముగా వివాహము జరిగియుండును. ఇట్టి సన్నివేశములలో, ఆమెవలె మనోనిగ్రహమును చూపగలవారు తరుణులలో అరుదు. ఆమె వివేకమునకు ఫలమిది. దైవము దుష్టముగా నున్నప్పుడు, దాని ప్రభావమును ఆదివిఘ్నముగా ఆమె స్వీకరించెను.

IV. పై దృష్టాంతములోని కథానాయకురాలు వివాహమునకు శుభదశ వచ్చువరకు ఓపికతో వేచినది. చలితచంద్రునికి చలితశుక్రసంయోగము, సప్తమాధిపతియగు కుజునితో కోణదృష్టిసహా, ఏకకాలమందే వచ్చినవి. తలవనితలంపుగా, ఒక ఉత్తముడగు వరుడు వివాహార్థియై వచ్చి ఆమెను చూచినాడు. వారిపరస్పర సందర్శనము 16-8-1953 నాడు 10-15 A. M. (I. S. T.) లో జరిగినది. ఆ ముహూర్తపు చక్ర మిది :—

దినశుద్ధి చక్కగ నున్నది. ఆమె జన్మరవిమీద చంద్రుడున్న దినమది. వరుని జన్మచంద్రుడు ఇంద్రుని స్నేహ దృష్టితో అచటనే యుండుట. బుధుడు (వరుని లగ్నాధిపతి) ఆనాడు కన్యక సప్తమాధిపతిపై నుండెను. అతని మన్మథ సహముపై ఆనాటి శుక్రుడు నిలిచి ప్రోత్సహించుచున్నాడు. ముహూర్తపు లగ్నము నికరముగా కన్యక జన్మలగ్నభాగయే

<table>
<tr><td></td><td></td><td></td><td>గు 21-9</td></tr>
<tr><td>రా 2-3</td><td colspan="2" rowspan="2">(సాయనము)<br>—<br>శ్రావణ, శుక్ల,<br>సప్తమి- భాను<br>వారము, స్వాతి<br>—</td><td>శు 13-50<br>వ 20-52<br>X 28.45</td></tr>
<tr><td></td><td>కే 2-3<br>బు 4 37<br>కు 11-12<br>ర 23-0</td></tr>
<tr><td></td><td>చ 4-30</td><td>ఇ 21.38<br>శ 22-48<br>I 29-0</td><td></td></tr>
</table>

కుజునితో పరిపూర్ణ త్రికోణ శుభదృష్టిలో నుండు వరుని జన్మ శని స్థానము ఆ భాగయే. అతని వివాహ సహమము సాక్షాత్తుగా ఆ భాగయందే యున్నది. ఆమె జాతకములో బుధుడు ఆ భాగయందే యుండుట విశేషము. ఏమందురా ? బుధుడు వరుని లగ్నాధిపతి. ఈ ముహూర్తపు సప్తమ భావమందే ఆమె స్త్రీసహమమున్నది. సందర్శనము సఫల మగుటకు ఇంకెన్ని యోగములు కావలయును ?

లగ్నములో పాపగ్రహములనబడు ఇంద్ర శనులు ఉన్నారే. ఇది గుణమా ? అని శంకించవచ్చును. కన్య జాతకములో ఈ గ్రహములు అన్యోన్య శుభదృష్టితో ఉపచయ (వృద్ధి) స్థానములలో నున్నవి. ముహూర్త కాలములో వీరికి కర్మస్థానమందలి బృహస్పతినుండి శుభదృష్టికలదు. వరుని సప్తమాధిపతి బృహస్పతి. ఈ గ్రహములు అఘాతము చేయజాలవు. కర్మదృష్టి, నియమబద్ధత, దూరాలోచనము, జాగరూకత, మున్నగు గుణములనే ఈ గ్రహము లీయగలవు.

"సాంప్రత ఫలదః నూతౌ,
బలాధికో యో దశాధిపతిమిత్రం చ,
పాపోపి స శుభద స్స్యాత్."
అను వరాహమిహిర వాక్యము మరువరానిది.

ఎంత హితకాంక్షి అయినా, కుజ వర్గుణులవలె శని ఆత్రముతో పనులు చేయువాడు కాడు. అతడు మందగామి.

వరుడు తృప్తిపడి సమ్మతించినాడు. కన్యక తోడనే నిర్ధారణమునకు రాలేదు. ఇతర సుగుణము లెన్ని యుండినా, వరునియందు వన్నెలో ఆనురూప్యము ఆమె కంటికి కానరాలేదు. "కన్యావరయతే రూపం." అని చెప్పిన మహాశయు డెంత అనుభవశాలియోకదా ? కొన్ని దినములు నెమ్మదిగా ఆలోచించిన తరువాత, పూత మెరుగుల తళుక్కులకంటె గుణశీలములకే వెల హెచ్చని నిశ్చయించి, దృఢ చిత్తముతో తన సమ్మతి నొసంగి, కొన్నాళ్లలోనే ఆ వరుని పెండ్లిగూడినది. గౌరవ మర్యాదలతో, సత్సంతాన సౌభాగ్యముతో, ఆ గృహిణి ఇపుడు ఆనందించుచున్నది.

గుప్తదశలోని ప్రయత్నఫల మెట్టిదో, దైవానుకూల్యముకల కాలమున పురుషకారమునకు శుభఫలమెట్లు సులభముగా సిద్ధించునో, మనకీ దృష్టాంతము తెలుపుచున్నది. తులాలగ్నమునకు యోగకారకుడు శని. ముహూర్త కాలములో ఉచ్ఛస్థుడై లగ్నమునందే యున్నాడు, వరజాతకపు శని అచటనే యుండుట అగుటచే, ఆమెకు శని దూరాలోచన శక్తినిచ్చి, హితము బోధించి, జీవితమును సఫలము చేసెను. మంచికైనా, చెడుపునకైనా, శని పట్టు పటిష్ఠమైనది.

ఇప్పటికి ఈ దృష్టాంతములు చాలును. కన్యావర సందర్శనమునకు సుముహూర్తము కావలెనని మన ప్రాచీన మహర్షులేల శాసించిరో, మన మిపుడు కొంత అయినా ఊహించగలము. వారి హితబోధను నిరాదరించితిమేని, నష్టము మనదే. పెండ్లి చూపులకు సిద్ధపడు ప్రౌఢ కన్యావరులు, వారి పెద్దలు సహా, ఈ జ్యోతిశ్శాస్త్ర రహస్యములను గమనించెదరు గాక. దుష్కాలము నుపయోగించి, తరువాత దైవమును నిందించి లాభమేమి ?

"సుఖదుఃఖకరం కర్మ
శుభాశుభ ముహూర్తజం" —(సర్వసింధువు)

# కెరటాలు

**శ్రీ ఆర్. యం. చిదంబరం**

**వి. టి.** స్టేషన్‌లో పెద్ద గడియారం పది గంటలు చూపెడుతోంది. యాభైగజాల దూరంలో వున్న అమ్మాయి శారదేనన్న అనుమానం కలిగినా కొంత సూక్ష్మపరీక్ష చేసిన తరువాతి కాని శారదే నని నిర్ణయించలేకపోయాను. బహుశా నన్ను చూసే వుంటుంది. కాని నాతో ఎందుకు మాట్లాడుతుంది? నా కంటే గంట ముందు బయలుదేరినా ఇంతసేపటి వరకూ ఏంచేసిందో వూహించలేకపోయాను. బహుశా ఉమాపతిని కలుసుకోటానికి వెళ్ళిందేమో!

స్టేషన్ బయటకొచ్చి తలవంచుకుని నడిచి పోతున్నా.

'ఏవండోయ్!...నమస్కారం! కొంపతీసి నాకు డాష్ యివ్వరుకదా!' అన్నమాటలు చెవుల్లో గిలిగింతలు పెట్టాయి. తలెత్తి చూశాను. ఎదురుగా సరోజ నిలబడుంది. మన్మధుడు నృత్యం చేసే ఆ కళ్ళల్లో చీకటి కన్నె చేతులు వూగిస్తూ కనపడింది. ఏదో కారణం వుండే వుంటుంది. జుట్టు వెనక్కి దువ్వి ఎర్రరిబ్బనుతో బిగించింది. చెవులకు గుజరాతీల మాదిరిగా నడల్పాటి లోలకులు-సూర్యకాంతిలో తళుక్కుమన్నాయి.

'అంతటి ధైర్యం లేదు కాని పదీపదయిందికదా! ఆఫీసుకు రాకుండా ఏమిటిది?' అనడిగాను.

సరోజ తన చేతికున్న 'షేవర్‌లూబా' కేసి వోమాటు చూసి తలెత్తి నవ్వింది. ఎక్కడో సామ్రాజ్యం ఒక్కసారిగా తగలబడుతున్నట్టు - 'ఇవేళ సెలవు పెడుతున్నా-మనసు ఏం బాగా లేదండి-ఏదో విలువైన వస్తువు జారిపోయినట్టుంది. మీ కోసమే యిక్కడ ఇరవై నిమిషాలనుంచి తపస్సు చేస్తున్నా. ఉమాపతి గురించి మీకు కొత్తసంగతి ఏదైనా తెలుసా?'

ఆశ్చర్యంలో కనురెప్పలు కదిలాయి.

'తెలియదు - అతనితో నాకేం ప్రమేయం లేదు. మనసులు విరిగాక అతుక్కోడం అసంభవం.'

దూరంగా వినిపించిన జోళ్ళ టకటకలు నా దగ్గరకొచ్చి ఆగిపోయాయి.

'హలో!' అని విష్ చేసింది ఎలిజబెత్.

"హలో" అన్నాను, ఆమె వేసుకున్న కొత్త ఫ్రాకుకేసి కన్నార్పకుండా చూస్తూ. జోళ్ళ చప్పుడు దూరంగా కదిలిపోయింది. సరోజ దృక్పథంలో నేనొక శిఖరాన్నయితే ఆమెదృష్టి లోతునిర్ణయించరాని అగాధం.

'మీకోమాట చెప్పాలనే ఇక్కడ నిలబడ్డాను. అతన్నిగురించి వో విచారకరమైనవార్త చెప్పాలి. ఇప్పుడావిషయం వెల్లడి చేస్తే మీరు బాధపడతారు. అందుచేత సాయంత్రం చెపాతి వంకరండి. ఏమిటో-ప్రతిమనిషిలోనూ కొన్ని భావాలు పైకిరాకుండా అణగివుంటాయి. నొక్కివుంచి అనేక వేషాలు వేస్తాం. చివరకు మేక్-అప్ చేసుకుంటుంటే తెరకాస్తా ఫుటుక్కున తెగిపోతుంది.'

సరోజ ఇంత వేదాంతం మాట్లాడటం నేను ఎన్నడూ వినలేదు. ఆమె వేషభాషల్ని-మాటల తీరును బట్టి నేను చేసుకున్న నిర్ణయాలు పొరపాటేమో నని పించింది. గణితశాస్త్రజ్ఞుడు స్వయం సిద్ధాలమీద తన భవనాన్ని నిర్మిస్తున్నాడు. కాని పునాది ఇసకలో కడితే?

'శారదకూడా ఫోన్ చేయండి-ఆమె వుండటం అత్యవసరం' అని, నేను అనబోయే మాటలు చెవిని వేసుకోకుండా చకచకా నడిచి వెళ్ళిపోయింది.

అప్పుడే ఎలిజబెత్ యాభైగజాలు వెళ్లిపోయింది. ఆమె క్రాఫింగుహెయిర్ మీద వున్న నీలిరిబ్బను ఇంకా స్ఫుటంగా కనిపిస్తూనే వుంది.

ఆఫీసు చేరుకునే సరికి పదిన్నరైంది. వెళ్లగానే బాస్ సెలవుపెట్టాడని తెలిసింది. నిన్న బద్ధకంగా వదిలేసిన నాలుగు లెటర్సు టైపు చేయటం పూర్తిచేసి తీరిగ్గా కుర్చీకి జారబడ్డాను. నాకు నాలుగు గజాల దూరంలో ఫైల్సు మధ్య పడికొట్టుకుంటున్న కామత్ నెమ్మదిగా వచ్చి విష్ చేశాడు.

'మిస్టర్ కామత్! చిక్కిపోతున్నావయ్యా!' అన్నాను. 'కారణం మీరు గెస్ చేసే ప్రయత్నంలో వున్నారనుకుంటూ-అదిసరే కాని సరోజగారు లేరా?' అని ఆమె సీటుకేసి వేలు చూపెట్టాడు.

'ఆశాభంగం కలిగించినందుకు చింతిస్తున్నా. ఆమె వారం రోజులు సెలవు పెట్టింది.' అంటూ అతని ముఖకళవళికలు ఎట్లా మారుతున్నాయని చూశాను. హిమాలయం తలమీదపొడుగుపడినట్టు ఫీలయ్యాడేమో!

ఫోన్ చేద్దామని రిసీవరు అందుకున్నాను. ఛీ... శారదతో మళ్లీ మాట్లాడటమా? ఇంతరభస-సంఘర్షణ జరిగిన తరువాత! అయినా నేను రమ్మంటే వస్తుందా? నేనేదో పద్మవ్యూహం అల్లి సాలెపురుగులా ఆమెను బంధిస్తున్నట్టు వూహిస్తే నేనేం చేసేది? రిసీవరు యథాస్థానంలో వుంచి రెండడుగులు ముందుకు వేశాను. సరోజ మాటలు ప్రతిధ్వనించాయి. మళ్లీ రిసీవరు అందుకుని డయల్ చేశాను. కాల్ వచ్చింది. ఉన్న విషయం చెప్పాను. 'అవును-అయిదు నిమిషాల క్రితం సరోజకూడా ఫోన్ చేసింది. తప్పకుండా వొస్తాను.' అంది శారద.

కామత్ డిలక్స్ సిగరెట్ అందించాడు. ఆఫీసులో పనిలేదు. ఉమాపతి విషయం అలలురేగుతున్న సముద్రంలావుంది. ఆలోచనలు కళ్ళెం తెగిన గుర్రంలా తాడుతెగిన గాలిపటంలా పరుగెత్తాయి...

లిఫ్ట్‌కోసం క్యూలో నిలబడున్నా, కాలం వృథా చేయటం ఇష్టంలేక చేతివున్న తెలుగు వారపత్రికలో విట్సు చదువుతున్నా. నావెనక నిలబడివున్న వ్యక్తి 'ఏవండీ! థామస్ కుక్ అండ్ సన్స్ ఆఫీసు ఎక్కడండి?' అని స్వచ్ఛమైన గోదావరి తెలుగులో అడిగాడు.

'నాతో రండి' అన్నాను. ఇద్దరం మూడవ ఫ్లోరులో దిగాం.

'ఇదే మీరు అడిగిన ఆఫీసు. నేను పనిచేసేదీ ఈ ఆఫీసులోనే!' అన్నాను.

'అలాగా!...థాంక్స్! చూడండి! ఈ ఆఫీసులో స్టెనోగ్రాఫరు పోస్టు ఖాళీగావుందని విని వచ్చాను. నేను చాలా కష్టాల్లో వున్నాను. మాది కాకినాడ-అమ్మ-చెల్లెలు అందరూ అక్కడే వున్నారు. కుటుంబభారం అంతా నామీదనే వుంది.'

'దానికేం లెండి!...బాస్ లోపల వుంటాడు. అతన్తో మాట్లాడండి.' అన్నాను.

ఆ తరువాత ఉమాపతి టెస్టులో విజయం పొందడం వుద్యోగం సంపాదించడం జరిగాయి.

ఆ మర్నాటినుండి ఉమాపతి పూర్తిగా మారాడు. కళ్లల్లో మొదటిరోజు కనిపించిన దైన్యం చెల్లాచెదరైంది. పెదవులమీదికి చిరునవ్వు జారింది. ఇంటర్వ్యూకి వచ్చినప్పుడు వేసుకున్న సాదాసూట్లు-కొల్హాపూరు చెప్పులు అతన్ని వదలుకోవలసివచ్చింది. కొత్తకొత్త సూట్లు కుట్టించాడు. మొదట్నుంచీ నేనతన్ని జాగ్రత్తగా గమనిస్తూవచ్చాను. ఆఫీసులో సగంమంది యువతులు. వాళ్ళవిషయంలో అతని ప్రవర్తన ఎలావుంటుంది అనేది నా ప్రశ్న. దాన్నిబట్టి అతని శీలానికి హద్దులు నిర్ణయించి-దాన్ని గీటురాయిలా వుపయోగించడంకోసం వచ్చుననికాదు కాని అదొక ప్రధానాంశంగా కనపడింది. అయిదారు రోజులు పోయాక అతన్ని మా యింటికి రమ్మని ఆహ్వానించాను. అతను ఓ ఆదివారం నాడు వచ్చాడు.

నేనూ - శారదా స్వేచ్ఛగా మాట్లాడాం. అతనికి ఎకౌన్టెన్సీ తెలుసు-రేడియో ఇంజనీరింగ్ చాలెసవును. జీవనాధారం దొరకటమనేది అతని కెన్నడూ సమస్యకాదు. ఉదయం కాలేజీకి వెళ్లి బి. ఏ. దాకా చదవాలన్నాడు.

'మనిషికి పరిస్థితులు ఓ స్థిరమైన మనస్తత్వాన్ని ఇస్తాయా? — లేక స్థిరమైన దృక్పథం - అభిప్రాయాలు - భావాలు స్వతంత్రంగానే తమ స్థానాన్ని ఏర్పరచుకుంటాయా?' అన్న వాదంమాట ఎలావున్నా ఉమాపతిని పరిస్థితులే మార్చాయని నేననుకుంటాను. అతను తనకు జీవితం మీద కొన్ని అభిప్రాయాలు వున్నాయన్నాడు. అభిప్రాయాలు స్థిరంకావని వాదిద్దామనుకుని వూరుకున్నా-పెసిమిజం పాతుకుపోయింది. అతనికి చక్కటిభవిష్యత్తు వున్నా ఈ నిరాశావాదం ఎందుకో! పక్షులు సాయంత్రం కిలకిలాడుతూ ఇళ్ళకు తిరిగిపోతుంటే ఉమాపతి

అవన్నీ తిండిలేక కాలేకడుపులతో ఏడుస్తూ తిరిగివెడుతున్నాయంటాడు. మాయింట్లోవున్న హార్మోనియం మీద 'మ్రోయింపకోయ్' పలికించాడు. ఆష్లర్ సైకాలజీగురించి వుపన్యాసధోరణిలో మాట్లాడాడు. బ్రౌనింగ్ తత్వాన్ని ఖండించాడు. షేక్స్పియర్‌ని 'పెద్దకాపీయిస్ట్' అన్నాడు. ఏదిఏలావున్నా నేను రెండువిషయాలు గ్రహించాను. శారదకూ—అతనికీ మధ్య ఏకాభిప్రాయం కుదరగలఅంశాలు చాలా వున్నాయి. ఉమాపతి ఎదుటివ్యక్తిని చిటికెలో ఆకర్షించగలడు.

కామత్ చిత్రమైనవ్యక్తి. అతనువుద్యోగం చేయటం కేవలం కాలక్షేపంకోసం. అది యితరులు విశ్వసించకపోయినా నేనునమ్ముతాను. మెడచుట్టూ సిల్కు మఫ్లరుచుట్టుకుని హుషారుగా మాట్లాడుతాడు--రసికుల జాబితాలో వేయవచ్చు.

కామత్ తనమాటల్లో—చేతల్లో కొంతఅసహజత్వాన్ని ప్రదర్శిస్తాడు. చలోక్తులు విసురుతూ అందర్నీనవ్విస్తూ తనూనవ్వుతాడు. అతనికున్న అనేక 'పిచ్చుల్లో' అమ్మాయిలపిచ్చికూడా వుంది. అయితే ఎంతమంది అమ్మాయిలముందర ధైర్యంగా గుండెమీద చేయివేసుకుని తనవ్యక్తిత్వం ప్రదర్శించి విజయం సంపాదించాడన్నది అనుమానాస్పదం. అంతటి మనస్థైర్యం అతనికి లేదనే నా నమ్మకం. అయినా అతను దేశం నలుమూలలా తనకున్న అనుభవాల్ని వర్ణిస్తూ వచ్చాడు. అతను వోఅమ్మాయిచేత ఆకర్షింపబడిన పక్షంలో ఏదుంగాదీపువ్వో తీసుకొచ్చి ఆమెకు పది గజాలదూరంలో నిలబడి ఆపువ్వు ఆమెముందుకువిసిరి 'నిన్నుప్రేమిస్తున్నాను' అనేసి పారిపోయినా నేను ఆశ్చర్యపడను.

అతనికి సరోజఅంటే వో 'ఫాన్సీ' వున్నమాట నిజం...ఎలిజబెత్ విషయంలో అతని అభిప్రాయం కనుక్కోటానికి ఎన్నోమార్గాలు వుపయోగించి ప్రయత్నించి విఫలుణ్ణయ్యాను. పోనీ సరోజతెగించి 'ఆల్ రైట్ మిస్టర్ కామత్!...నీప్రేమ అంగీకరించాను. వివాహం ఎప్పుడుచేసుకుందాం?' అనడిగితే కామత్ వెంటనే రాజీనామాచేసి వెళ్ళిపోతాడు. ఆతరువాత సరోజ ఎక్కడైనా కనబడితే ఆమెకంటపడకుండా ఏపుస్తకమో—పేపరో మొహానికడ్డంపెట్టుకుని చల్లగా జారుకుంటాడు.

కాని సరోజ అంతటిమాట ఎన్నడూ అనదు.

ఆమెతత్వం—తీరు—అన్నీ ప్రకృతికి విరుద్ధంగా వుంటాయి. ముఖ్యంగా ఆమెకు వివాహం మీద నమ్మకం లేదు. వెనకటికి ఎవరో 'అయ్యో! నన్ను బ్రహ్మచారి అనకండి-అవివాహితుడనండి' అన్నట్టు-ప్రతిరోజూ భర్తను చూస్తుంటే భార్యకు విసుగెత్తి విడాకు లీయ బుద్ధి వేస్తుందట—ఏడాదికో శిశువును కనిపారేస్తూ భర్తకు యిష్టమైన కూరలతో రుచికరంగా వొండుతూ, అతని అడుగులకు మడుగు లొత్తుతూ—ఛీ—ఏం జీవితంయిది? పాతికేళ్ళ పడుచునుచూస్తుంటే నలభైయేళ్ళ అవ్వలా కనిపిస్తుందట! ఒమర్ ఖయ్యాం అన్నట్టు జీవితాన్ని అనుభవించాలంటుంది. దేన్నైనా వెనక్కి తేగలంకాని గడచిన ఒక్క సెకనును కూడా తీసుకురాలేం—అటువంటప్పుడు మానసిక బాధల్తో, కట్టుబాట్లతో—ఎదుటి వారికి గోతులుతీస్తూ—లోపల వొకటి వుంటే పైకి వొకటి నటిస్తూ చరిత్ర కాని, కొందరు వ్యక్తులు కాని నిర్ణయించిన హద్దుల మధ్య అణగిపోతూ ఎందుకు బతకాలి? జీవితంలో స్వయంగా అనుభవం గడించి మంచి చెడ్డలు నిర్ణయించుకోవాలి. అంతేకాని 'ఇలా—ఇలా' నడుచుకుంటే 'ఇలాంటి' పరిణామాలు కలుగుతాయని వాదించటం—సిద్ధాంతీకరించటం అసందర్భం — అన్యాయం — అని వాదిస్తుంది.

'అందరూ యీ విధంగా నడుచుకుంటే ప్రపంచం మాటేమిటి? కొంతకాలానికి జాతి నశింపుకాదా?' అని అడ్డు ప్రశ్న వేస్తే నిర్లక్ష్యంగా నవ్వేస్తుంది. కామత్ కూడా ఇలాంటి సందేహాలే లేవదీస్తాడు. బౌద్ధమత సూత్రాలను అందరూ తు. చ. తప్పకుండా ఆదరిస్తే, అందరూ గుండుచేసుకుని కాషాయవస్త్రాలు ధరించి 'భిక్షాందేహి' అని తిరగవలసిందేగా! ఎదురైనవ్యక్తుల్ని స్త్రీ పురుష విభేదంతో చూడనంతకాలం మానవజాతి మాటేమిటి? కాబట్టి ఇదంతా 'హంబగ్'—అందుకే ఎవరూ దాన్ని ఆదరించరు.' అంటాడు—ఇలాంటి వ్యక్తులతో వాదించి విసుగెత్తి వూరుకున్నా—

ఉమాపతివచ్చిన రెండు వారాలకు కామత్ 'మీతో కొంచెం రహస్యంగా మాట్లాడాలి—అలా రండి' అన్నాడు.

ఇద్దరం బాల్కనీకి వెళ్ళాం.

'ఉమాపతి ప్రవర్తన గమనిస్తున్నారా?' అనడిగాడు. అతని ప్రశ్న వెనకవుండే, భావం బోధపడక వూరుకున్నాను.

'సరోజ ఇది వరకటి మల్లే నాతో మాట్లాడటం లేదు. మీ మిత్రుడు ఘటికుడు. కాని నేను బాధ పడేది అందుక్కాదు. మన కళ్ల ఎదుట ఇలాంటి ఘోరం జరుగుతుంటే ఎలా సహించగలం?'

అతని కంఠంలో ఓటమి స్పష్టంగా కనిపిస్తోంది.

కామత్ ప్రవర్తనననుసరించి నిలదీసి అడగవచ్చు—కాని ప్రయోజనం వుండదు. అది కేవలం వ్యక్తిగత విషయంలో జోక్యం కలుగజేసుకోవట మవుతుంది. 'నీతి'ని అడ్డంపెట్టుకుని తన మనసులో వున్న మాటను మభ్యపెడుతున్నాడు. నిజానికి నేనూ బాధపడ్డాను. ఉమాపతి సరోజమూలంగా చెడిపోతాడేమోనని. ఆ తరువాత రెండుమూడునాళ్లు ఇద్దరూ కలిసి సినిమాకు వెడుతుంటేగా చూశాను.

బైకుల్లాదగ్గరవున్న నైట్‌స్కూల్లో ప్రవేశం పని కనుక్కోటానికి వెళ్ళి తిరిగివస్తూ విక్టోరియా గార్డెన్స్ ముందుగ సరోజను చూశాను. ఆమె చూపులు చుట్టూ తిరుగుతూ ఎవరికోసమో నిరీక్షిస్తున్నాయి. కూలింగ్ గ్లాసెస్‌లోంచి నన్ను చూసి విష్ చేసింది. రెండు జడలు వేసుకుని దాన్ని అర్ధచంద్రాకారంగా మెలితిప్పి ముఖ్య నల్లరిబ్బను వసులుగా వేలాడదీసింది. తెల్లటి పాదాలకున్న ఎర్రస్లిప్పర్లు చూస్తూ కొన్ని సెకనులు నిలబడిపోయాను. 'రామాచారి' చీర తెలుపు నీలిరంగు సుఖంబావపతి వింత శోభనుకలిగించింది. ఆవేళ సరోజను చూస్తుంటే ఫ్లాష్ లైటులో బల్బు వెలిగిన అనుభవం గలిగింది. సౌందర్యం వింతగా ఆవులించినట్టు—'ఏమిటి సంగతి? ఎవరికోసం ఈనిరీక్షణ?' అనడిగాను. 'ఉమాపతికోసమండి—అతను విక్టోరియా గార్డెన్సు చూడలేదన్నాడు. ఒంటరిగా చూడటమంటే వల్లమాలినభయం. అయినా చెప్పొద్దూ! అతను వట్టి అమాయకుడుసుమండి! ఎలా బతుకుతాడో ఏమో! ప్రతి చిన్నవిషయానికీ బాధపడతాడు. వట్టి పిచ్చివాడు. పెన్ను సరిగ్గా రాయక పోయినాసరే—ఎవరో తన్ను మీదపడిచంపుతున్నట్టు ఇదవుతాడు—' 'మట్టి ముద్దకొరికితే దానికి రూపం ప్రసాదించటం నీకు కొత్తకాదుగా!' అన్నమాటలు నాలుక చివరదాకావచ్చి ఆగిపోయాయి.

'నాలుగ్గంటలకు వస్తానన్నాడు—పావుతక్కువ అయిదైంది, ఇంక వుండలేను. నే వెడుతున్నాను. మీరు వస్తారా?'

'నేనో స్నేహితుణ్ణి కలుసుకోవలసి వుంది—సారీ—' అని చిన్న అబద్ధం ఆడాను—

సరోజ మౌనంగా వెళ్ళిపోయింది.

ఆమె నా దగ్గర్నుంచి దేన్నో దాచటానికి ప్రయత్నించిందని స్పష్టమైంది. నేను రాకపోతే వుమాపతి కోసం ఎంతసేపైనా సరే కాచుక్కూచునేదేమో: అంటే నన్ను చూసి భయపడివుండాలి—అనుమానపడి వుండాలి—పానకంలో పుడకలా నేను అడ్డం వచ్చి నందుకు కొంతబాధపడ్డాను—పదినిమిషాలు గడిచాక ఉమాపతి ప్రత్యక్షమయ్యాడు. 'నీకోసం చాలాసేపు చూసి సరోజ వెళ్లిపోయింది. మనం గార్డెన్సు చూద్దామా?' అనడిగాను. తరువాత నాకు స్ఫురించింది. సరోజనుగురించి ఏమీ ఎరగనట్టు నటించి అతని అభిప్రాయం తెలుసుకుంటే బాగుంటుందని. 'అబ్బే మరోనాడు చూసుకుందాం లెండి. ఇవేళ మీరెలాగూ దొరికారు కనక మా రూంకి రావాలి.' అన్నాడు. నేను ఏదో చెప్పబోతూంటే 'ఇలావస్తానని చాలా సార్లు చెప్పి నమ్మించారు. ఇప్పుడు ఎలాంటి సాకులూ పనికిరావు' అని బలవంతపెట్టాడు. సరేనని బయలు దేరాను.

ఉమాపతి ఓ. ఓ. దావర్‌లో వుంటున్నాడు. అతను వున్న వాటాలో ఓ ముసలావిడ ఆమె మనవరాలూ వున్నారు. ఆమె పేరు సంధ్య. వెళ్ళగానే గౌరవించి మాట్లాడారు. ఉమాపతి నన్ను తెగపొగిడేశాడు. సంధ్య కాఫీ తీసుకొచ్చి నా ముందువుంచింది.

'మాకు కాఫీకంటె టీ ఎక్కువ యిష్టం—అందుచేత మీకు కాఫీ రుచింపకపోవచ్చు. సరిగ్గా తయారుచేయటంకూడా నాకు చేతకాదు అంది, స్వచ్ఛమైన మరాఠీలో.

తరువాత తెలుసుకున్నాను. సంధ్య ఏదో చిన్న కంపెనీలో పనిచేస్తోంది. ఇంకా పెళ్ళికాలేదు. ముసలావిడ ఇంత ఆదరంతో అతన్ని చూసుకుంటోందంటే అతని 'మంచితనాన్ని' గుర్తించి వుండాలి. నేను ముందే చెప్పాను. ఉమాపతి ఎదుటివ్యక్తిని చిటికెలో నమ్మించి వశం చేసుకోగలడు. అతనికి దైవం ప్రసా

దించిన వరం. కామత్‌ను తీసుకొచ్చి వ్యాఖ్యానించమంటే ఏం చెప్తాడు?

"అబ్బే అదేం కాదండి! అసలు వుమాపతి ఆలోచనలు వేరు. పన్నాగం వేరు. ఎలాగోలాగ మసిలి దాని మెప్పుపొంది సంధ్యను మంచిచేసుకుని తన దాహం తీర్చుకుందామని—అమ్మో దైవాంతకుడతను. సరోజ విషయంలో తెలుస్తూనే వుందిగా" అంటాడు గామోలు!

ఉమాపతి అయిదు నిమిషాల నిశ్శబ్దాన్ని ఛేదిస్తూ అన్నాడు.

'మీతో కొద్ది రోజులుగా ఓ సంగతి చెప్పాలనుకుంటున్నా. అవకాశం చిక్కటం లేదు. మీమీద నాకున్న గౌరవభావం గురుతుల్యమైంది. అలాగా హీమ్ బీచ్ వైపు నడుద్దామా?' సరేనని సంధ్యకూ, మునిలావికకూ కృతజ్ఞత చెప్పి బయలుదేరాను.

బీచ్ చేరుకునే వరకూ అతను మౌనంగా వున్నాడు. చీకూ చింతా లేకుండా కలకల్లాడుతూ సాగిపోతున్న సంసారంలా చల్లగాలి వీచింది. ఇసకలో చతికిలబడ్డాం. ఉమాపతి అసందర్భంగా ఇసకలో పిచ్చిగీతలు గీస్తూ కూర్చున్నాడు.

'అసలీ వుద్యోగంలో ఎందుకు చేరానా అనిపిస్తోంది' అన్నాడు వున్నట్టుండి. అతనికేసి అర్థ పూరితంగా చూశాను.

'తప్పుగా అడిగితే క్షమించండి, సరోజ గురించి మీ అభిప్రాయం ఏమిటి?'

'సరోజ విషయం అలా వుంచి ఒక మనిషిని గురించి మరో మనిషి పూర్తిగా అర్థంచేసుకోగలడనుకోటం పొరపాటు. భర్త భార్య దగ్గిర్నుంచి కొంత దాస్తాడు. కొడుకు తండ్రికి తెలియకుండా కొన్ని పనులుచేస్తాడు. అలాగే ప్రతివ్యక్తీ తన రహస్య మందిరంలో ఇతరులకు తెలియకుండా కొన్ని దాచుకుంటాడు. నిజానికి అవే అతని ప్రవర్తనను—శీలాన్ని నిర్ణయించే గీటు రాళ్ళు కావచ్చును. దీనికొక్కారణం మనిషిని చూసి మనిషి జడుసుకోవటమేననుకుంటాను. అలా వుండగా సరోజగురించి ఇతమిద్ధమని ఎలా చెప్పను? ఆమెను ఆఫీసులో పదిగంటలకు చూస్తాను. తన పని తను చేసుకుపోతుంది. చలాకీగా వుంటుంది. ఆరు గంటలకు వెళ్ళిపోతుంది. దీన్ని బట్టి ఆమె వ్యక్తి గత జీవితంగురించి తెలుసుకునే ఆస్కారం నాకెక్కడ వుంది?'

ఓ నిమిషంపాటు నామాటల్ని త్రాసులోతూచి విలువకడుతున్న వాడిలా కనిపించాడు.

'ఇంకా ముసుగులో గుద్దులాట ఎందుకండీ! ఆమె నన్ను ప్రేమిస్తోంది. ఎందుకో ఆమెను గురించి ఆలోచించకుండా—ఆమెను చూడలేకుండా వుండలేకపోతున్నా—దీనికి అంతూ—దరీ కనపడదు—' అన్నాడు.

అతని మానసికబాధ కొద్దిగా అర్థమైంది. సరోజగురించి విపులంగా చెబుదామనుకున్నాను. కాని అది నాకనవసరం. అదీకాక ఆమెనుగురించి నాకు తెలిసిందెంత? అనంత భూగోళంలో ఇసక కణంలా—

'ఇంతకీ నువ్వు సరోజను ప్రేమించావా?'

అతను వెంటనే జవాబుచెప్పలేకపోయాడు. 'ప్రేమ' అన్న పదానికి అతను సృష్టించుకున్న నిర్వచనం ఎలాంటిదో! ఆమె విసిరిన సౌందర్యపు వలలో అతను చిక్కుకున్నాడు. దాని కతను దాస్యంచేయక తప్పదు. ఆమెను చూడగానే, బహుశా, అతని నరాలన్నీ స్వస్థలాల్ని వదులుకుని కదలిపోయి ఇంద్రియాలన్నీ పట్టు తప్పుతున్నాయేమో! ఒక వైపు అతని నైతిక జీవితం ఘోరసంగ్రామం జరుపుతూంటుంది. పెద్ద పెద్ద కొండల్లా అవన్నీ అడ్డుపడతాయి.

'ఇందులో సందేహపడవలసిన విషయమేమీ లేదు ఉమాపతీ! నువ్వు నిజంగా సరోజను ప్రేమించేపక్షంలో ఆమెను వొప్పించి తక్షణం పెళ్ళి చేసుకో—అందుకామెగతం అనవసరం—నీగతం గురించి ఆమెకేం తెలుసు కనక? ఇంక—ప్రేమకూ వాంఛకూ సంబంధం లేదని వాదించే వాళ్ళ మాటల్ని నేను విశ్వసించను—అవన్నీ సరైన పునాదిమీద నిలబడవు. దూర దూరంగా కూర్చుని మనసులో వూహలు సృష్టించుకుని ప్రేమను అనుభవించటం అసందర్భం—నా సలహా అంతే!' కొంతసేపు గడిచాక చీకటిపడిందంటూ ఎవరి దారిన వారు విడిపోయాం—ప్రస్తుతం ఉమాపతి వున్న స్థానంలో కామత్ వుంటే?

ఇది జరిగిన రెండు రోజులకు ఉమాపతి తన వుద్యోగానికి రాజీనామా యిచ్చి నా ముందు వచ్చి నిలబడ్డాడు.

'అయితే ఇకముందు ఏం చేయదల్చుకున్నట్టు?' అనడిగాను.

'కాకినాడ వెళతాను. అక్కడే బావుంటుంది' అన్నాడు. అమావాస్యనాటి చీకటంతా అతని ముఖంలో ప్రోగులుగా వేలాడుతూ కనిపించింది. ఆ తరువాత ఎందుకో సరోజ నన్ను అనుమానంగా చూడ సాగింది.

తరువాత వారం రోజుల వరకూ అతని జాడ లేదు. స్వస్థలం చేరుకునుంటాడనుకున్నాను. కాని అలా జరగలేదు. శారదపనిచేస్తున్న కంపెనీలో క్లర్కుగా చేరినట్టు ఆమె చెప్పింది. నేను ఆశ్చర్యపడకుండా వుండలేకపోయాను. అప్పుడప్పుడు శారద అతన్ని గురించి ఏదేనా చెబుతూవుండేది.

ఓనాడు ఉమాపతిని చూద్దామని అతని గదికి వెళ్ళాను. ఉదయం శారద సినిమాకంటూ వెళ్ళింది. తలుపు తట్టగానే తీశాడు. అక్కడ శారదకూడా కనపడింది. ముగ్గురం కొంతసేపు ఆశ్చర్యంలో మునిగి పోయాం.

'సినిమాకు వెళ్ళలేదా?' అనడిగాను.

'టిక్కెట్టు దొరకలేదు' అంది. ఆ కంఠంలో ఆమె మాటలు 'అబద్ధం' అన్నట్టు ధ్వనించాయి. ఆలోచనలు పరిపరి విధాల సాగిపోయాయి.

ఉమాపతి అదీయిదీ మాట్లాడాడు. అంతరూ మనసులో కుళ్ళు—రహస్యాలూ దాచుకుని పైకి మాటాడుతున్నట్టనిపించింది. సంభాషణ సాగలేదు. అదలించటానికి శారద చిన్నపిల్ల కాదు. ఏమని అడిగను?

'మీరు మనస్ఫూర్తిగా క్షమిస్తానంటే ఒక్క మాట చెప్పాలనుకుంటున్నా—ఇంతకాలం మనస్సంకోచంవలన ఆలస్యం చేస్తూ వచ్చాను' అన్నాడు. ఏమిటన్నట్టు చూశాను.

'శారద యీ విధంగా నాతో స్వేచ్ఛగా మాట్లాడటం—తిరగటం తప్పేననుకుంటారు కాని...కాని ...అంటూ ఆగిపోయాడు.

గుండె ఆగి మళ్లా తేరుకున్నట్టయింది.

'చెప్పు ఉమాపతీ! ఎందుకు సందేహం?'

'ఆమెను, మీరు అంగీకరిస్తే పెళ్ళిచేసుకుందామనుకుంటున్నా—' గాఢ నిద్రలోవున్న వ్యక్తిని హఠాత్తుగా ఐస్ టబ్ లో ముంచిన అనుభూతి కలిగింది.

'నా యిష్టాయిష్టాలతో ఏమిటికాని శారద అంగీకారం వుండాలి. అంతకంటె అనే హక్కు లేదు—శారదవంక చూశాను. తలవంచుకుని బయటికి పారిపోదామనుకుంటున్న చిరునవ్వును బలవంతాన పెదవుల మధ్య అణచివేసింది. ఉమాపతిమీద నాకున్న సదభిప్రాయం మార్చుకున్నాను. అతనికి స్థిరత్వం లేదు—అతని వ్యక్తిగత జీవితం కొద్దిగానైనా తెలియదు. ఇవేళ వుద్యోగంలో వున్నాడు—ఏమో! రేపు వేరుసెనగలు అమ్ముతూ తిరుగుతాడేమో!

నేను ఇంటికి బయలుదేరాను. శారదను రమ్మని అడగనూ లేదు — ఆమె రానూ లేదు — తోవలో మాటుంగా స్టేషన్‌లో నేనువున్న ఫస్టుక్లాస్ కంపార్టుమెంటులోకి సరోజ వచ్చింది—గుజరాతీల బాణీలో చీరకట్టి వుండటంవలన మొదట్లో ఆమెను గుర్తుపట్టలేకపోయాను. ఎందుకో ఆమెకీకట్టు కొత్త అందాన్నిచ్చింది. కాని దాన్ని ఆస్వాదించేపరిస్థితుల్లో లేను. మనసంతా అల్లకల్లోలంగా వుంది.

'ఇవేళ ఆముదం తాగారా?' అనడిగింది, పక్కన కూచుంటూ—జరిగినదంతా వివరించాను—సరోజమీద నాకు గౌరవంవుంది. ఆమెనుండి నేను ఏ విషయాన్నీ ఇంతవరకూ దాచలేదు—సరోజముఖం పూర్తిగా మారిపోయింది. వికసించి నవ్వుతున్న పువ్వు వున్నటుండి ముకుళించుకుని నేల జారినట్టుంది. 'నేను ఎప్పుడూ మీ శ్రేయోభిలాషి నన్నసంగతి మీకు బాగా తెలుసు. నిజానికి మీకంటె నేను బాగా జీవితాన్ని అర్థం చేసుకోగలను. ఉమాపతి నాకు బాగా తెలుసు. అతని మనస్తత్వం అభిప్రాయాలు—అన్నీ చీల్చి అణువులుగా మార్చి పరీక్షించి చూశాను. అతను శారదకు తగడు—శారదవంటి అమాయకురాల్ని అతని కంటగట్టకండి—అతను నీలోకంలో నే బతికవలసిన వాడుకాడు. మీ చెల్లాయిమీద మీకు కొంచెమైనా ప్రేమవుంటే దీనికి ఒప్పుకోకండి—చేతులు కాలాక ఆకులు పట్టుకుని లాభం లేదు. అతని తెరవెనక జీవితం నాకు తెలుసు!'

ఆ ఉద్రేకంలో ప్రతిధ్వనించిన నిర్మలత్వం నన్ను పూగించేసింది. కంపార్టుమెంటులోవున్న ప్రయాణీకులు మావంక విచిత్రంగా చూశారు. ఈ పెళ్ళి జరక్కపోతే సరోజకు కలిగే ప్రయోజనం ఏమీ లేదు.

'ఏమిటి మీ నిర్ణయం?' అనడిగింది.

'నీ అభిప్రాయం సరైనదనుకుంటాను'

ఇంతలో కుర్లా వచ్చింది—సరోజ మరోమాటు హెచ్చరించి దిగిపోయింది.

శారద రాత్రి ఎనిమిది గంటలకు ఇంటికివచ్చింది. ఆమెను యిష్టంవచ్చినట్టు నిందించాను. ఉమాపతిని

చేసుకుంటే ఆమె ఎలాంటి తుఫాన్లను ఎదుర్కోవలసి వుంటో వివరించాను.

'అన్నయ్యా! నువ్వు ఏమైనా చెప్పు — నా నిర్ణయం మార్చుకోను. నేను పసిపాపను కాను— నాజీవితం నన్ను నిర్ణయించుకోనీ' అంటూ ఏడవటం మొదలెట్టింది.

శారద కన్నీరు కార్చటం యిదే మొదటిసారి. అమ్మా—నాన్నా చిన్నప్పుడు పోయిన తరువాత నేను తిన్నగా బొంబాయివచ్చాను. అప్పట్నుంచీ శారద బాధ్యతకూడా నామీద పడింది. ఈనాటి వరకూ మాయిద్దరి మధ్యా ఎలాంటి అభిప్రాయభేదాలూ రాలేదు.

ఆమర్నాటినుంచి శారద నాతో ముభావంగా వుండసాగింది. అందుకు నేను బాధపడలేదు-ముందు ముందు ఆమె గోతిలో పడకుండా వుంటుందికదా అని తృప్తిపడ్డాను-తరువాత వారంరోజులవరకు ఉమాపతి ప్రస్తావనరాలేదు... చెయ్యి చురుక్కుమంది-కామత్ నవ్వుతూ మరోసిగరెట్ అందించాడు-వస్తున్నాను...

సాయంత్రం చౌపాటీకి వెళ్లేసరికి శారదా-సరోజా ఓమూల కూర్చున్నారు. నేనూ పక్కన కూచున్నాను-అలలు మాత్రం గలగలమంటూ కాళ్ళను తడిపేస్తున్నాయి.

'ఉమాపతిని ఇంక మీరు చూడలేరు' అంది సరోజ-ఆశ్చర్యంతో. ఆమెకేసి చూశాను. కళ్ళు రెండూ నీళ్లతో నిండివున్నాయి.

'ఏం?... కాశీకి వెళ్లిపోయాడా?'

'కాదు-ఆత్మహత్య చేసుకున్నాడు.'

నిజంగా భయంవేసింది. ఎప్పుడూ అనుకోని ముగింపు-శారద పిచ్చెత్తినదానికిమల్లే కూర్చుంది-

'ఇంతక్రితమే ఎలిజబెత్ ఈవార్తవిని కన్నీరు వదలింది' అంది శారద-నా కళ్లు తడిమిచూసుకున్నాను. పొడిగా వున్నాయి. అయితే నాకుమాత్రం కన్నీరు ఎందుకు రాదు?

'ఇంతకీ ఎందుకు బలవంతాన ప్రాణం తీసుకున్నట్టు?' అనడిగాను.

సరోజ సన్నగా ఏడ్చింది.

'కారణం అడక్కండి-నాకు తెలియదు-కాదు తెలుసు-ఏమో!...ఎందుకో! అతన్ని నాకు కాశీ వాడల్లో వున్నప్పుడే బాగా తెలుసు-అంతే-మీరందరూ తలో కారణం వూహించుకోండి.' తెగిన వీణమీది ధ్వనుల్లా వెలివడ్డాయి-సరోజ ముఖంకేసి చూశాను-నొత్తిమీద బొట్టులేదు-కొంపతీసి ఇద్దరూ విడాకులిచ్చేసుకున్న భార్యాభర్తలు కాదుకదా!...అసందర్భపు ఆలోచనలు అన్నీ-

అందరం మౌనంగా వున్నాం-

'మరో తమాషా మీకు తెలుసా?...అతను ఎలిజబెత్ ని కూడా ప్రేమించాడు.' అంది సరోజ-

ఇంతకీ ఉమాపతి దేన్ని చూసి జడుసుకున్నట్టు?

జీవితాన్నా?

ఎందుకు? ఉద్యోగం సంపాదించటం అతనికెన్నడూ సమస్యకాదని చెప్పాను. ఎక్కడికెళ్లినా-ఎలాంటి పరిస్థితుల్లోనైనా అతను బతగ్గలడు-అది కారణం కానేకాదు-పోనీ అమ్మాయిల్ని చూసి జడుసుకున్నాడా?

అమ్మో! ఆ విషయంగురించి ఆలోచించటానికే భయంగావుంది. సరోజ - శారద - సంధ్య - ఇప్పుడు ఎలిజబెత్ -ఇంకా ఎందరో! అందర్నీ ప్రేమించాడట-ఏమిటో గుప్పెటమూసి అందులో ఏం వున్నదో చెప్పుకోమన్నట్టుగా వుంది. ఇందర్నీ ఎలా ప్రేమిస్తానన్న దిగులు భరించలేక తన్నుతాను అంతం చేసుకున్నాడా?...

సరోజ చాలాసార్లంది. అతను ఎంతో బతకవలసిన వాడుకాదని—ఆమెకూడా నిజం చెప్పకుండా వూహించుకోమంటోంది!...నాకుతోచిన నిర్ణయం నేను చేసుకొన్నాను. జీవితాన్ని చూసి జడుసుకొని పారిపోయాడు—ఏది అనుభవించలేనప్పుడు బతికివున్నమాత్రం ఏం సుఖం పొందుకుంటాడు?....సరోజను బలవంతపెట్టిన ప్రయోజనం వుండదు—ఆమె నిజం చెప్పదు—ఇనపకోటలో ఏముందో తొంగిచూసే ఆస్కారంకూడా లేదు—

ముగ్గురం ఇళ్ళకు బయలుదేరాం—

'అన్నయ్యా! నీ మనసు కష్టపెట్టాను— క్షమించు' అంది శారద— నడుస్తూంటే పెద్దపెద్ద భవనాలన్ని మీద కూలుతున్నట్టనిపించింది. 'మెరైన్ లైన్స్' స్టేషన్నుంచి సబర్బన్ ట్రెయిన్ బయలుదేరి ఆగిపోయింది—ఎవరో పొరపాటున చక్రాలకిందపడి పోయాడు—అతను జీవించాలనే అనుకున్నాడు— కాని మృత్యువతన్ని కౌగలించుకుంది—అతను అతి సామాన్యుడుగా వున్నాడు—కాని బతకవలసిన ఉమాపతి మృత్యువును కోరి ఆహ్వానించాడు—

కళ్లు తడిమి చూసుకున్నాను—

నీటిచుక్కలు కనుగొలకుల్లో నిలిచాయి.

అప్పుడు రావలసిన కన్నీరు యిప్పుడు వచ్చింది! 'సరోజ ముఖంలో ఇంక ఏనాటికైనా కళాకాంతులు తిరిగి వస్తాయా?' అనిపించింది.

ముగ్గురం ఒక్కసారి నిట్టూర్చాం—

# కాళిదాసకవిత : శీలచిత్రణము

## శ్రీ అరవిందులు

### : ఊర్వశి :

సూక్ష్మ సుకుమారమైన కాళిదాస నాటకీయ ప్రతిభ, స్త్రీపాత్రచిత్రణమునం దత్యంత సహజముగ పరిణతిఁ గాంచినట్లు ప్రత్యక్షమౌను. ఒక్కొక్క సమయమున కాళిదాసు, ప్రధానముగా నీస్త్రీపాత్రలకు ప్రత్యేకత నాపాదించుపట్ల నంత శ్రద్ధ వహింపక పోవచ్చును. కాని యతిసామాన్య స్త్రీ పాత్రలకుఁ గూడ సర్వసాధారణముగా నొకవిధమగు వైయక్తికత్వము నాతఁడు కల్పించును. నాయికలందే కాక, భిన్నభిన్న స్వభావములతో నీపాత్రలు పరస్పరము వేఱుపఱుచుటకు వీలుగానుండును. స్త్రీపాత్రల ప్రాధాన్యమును గుర్తించిన నాటక కళావిదుఁడైన వాఁడితఁడే, యీపాత్ర చిత్రణమునకుఁ గావలసిన వాస్తవికత కొఱవడియుండును. సామాన్యముగా [illegible] పరిశీలించినట్టిగాని, లేక లోకాతీతముగ గోచరించునట్టిగాని యుండును. [illegible]ములకుఁ జెందిన స్త్రీలనుబోలిన పాత్రల, నే రూపకకర్తయైనను దన రూపకమునఁ జిత్రించి సాఫల్యము నందవచ్చును. వీరి లోకాతీతపాత్రలను, దుష్టపాత్రలనియే భావింపవచ్చును. క్లైటెమ్నెస్ట్రాస్; షట్టోరియా కోరం బోనస్; బియాట్రిస్ జోన్నాస్ మున్నగువారీతరగతికిఁ జెందినవారే. వ్యాసుఁడు జిత్రించిన స్త్రీ పాత్రలు; సోఫకిల్సు స్త్రీపాత్రలు నొకశ్రేణికిఁ జెందినట్లు సామ్యములుగలవు. వీరొక్కొక్కరు నొక్కొక్క తరగతికిఁ బ్రాతినిధ్యము వహింతురు. ఈ పాత్రలన్నియు ప్రశాంతముగఁ గన్పట్టుచున్నను, పురుష స్వభావ ప్రాబల్యముతో నొప్పుచుండును. ఇది వీరి కాభిజాత్యముచే సంక్రమించిన గుణమై యుండును. తక్కిన కవు లేవో యొక స్త్రీ శీలమును జిత్రింప గల్గుదురే కాని, తక్కిన స్త్రీల నందఱను భిన్న భిన్న స్వభావములతోఁ జిత్రించగలవారు కారు. ఒక పాత్రను బోలియే, మఱియొకపాత్ర యుండును. ఒక వేళ ఎట్లో పరిశ్రమించి చిత్రించినను, నంత విజయవంతముగా నుండదు. అదియుఁ గాకున్న బాహ్యప్రపంచమునందలి స్త్రీలనే యున్నదున్నట్లు చిత్రింతురు. స్త్రీ సహజస్వభావ పరిశీలనా ధురంధరులైన కవీశ్వరులను వ్రేళ్లపై లెక్కింపవచ్చును. ఇట్టివారిలోఁ షేక్స్పియర్' మహాకవి యగ్రగణ్యుఁడు. నాటకకళానిర్వహణానుకూలమగు దివ్యవరములలో నిది యొకటి. ఏతత్ప్రతిభాపటుత యందీతఁడు వాల్మీకితో సదృశుఁడన నగును. కాని వాల్మీకి కున్నంత విస్తృతి లేదు. "రాసిన్" కవికి గూడా పరిమితముగా నీ ప్రతిభ కలదు. కాళిదాసునం దీప్రతిభ యనంతము. కాని యితర నాటక కళా లక్షణములందువలె నిందును, కాళిదాసుని ప్రతిభ షేక్స్పియర్ ప్రతిభను బోలి యతివేలమై వైవిధ్యముతో గూడినది కాదు. ఇంకను గొందఱు కవులు కలరు. వీరు సర్వసాధారణ స్త్రీ పాత్ర సృష్టిఁ గావించిన వారే. ఈ సృష్టి, కేవల పరిశీలనా జనితమే కాని, యవిచ్ఛిన్నమగు నాంతరంగిక ప్రేరణా ప్రాబల్యమున నేర్పడినదిగాదు. 'మాళవికాగ్ని మిత్రము,' స్త్రీపాత్రలు విశేషముగా గలరూపకము. అందు స్త్రీలసుద్ధాంతములు, రమ్యోద్యానములు, నలంకారముల గలగలలు; నవ్యక్త మనోహర కంఠ కిలకిలారావములు; కేశభారసంజనిత సుగంధ వాయువుల సౌరభములు నధికము.

'విక్రమోర్వశీయము'న సగము దృశ్యములు నాటకవీరునకే కావలసియుండెను. అందుచే స్త్రీపాత్ర చిత్రణము చాలావఱకు, నిందు సంకుచితి పఱచ వలసివచ్చినది. కాని యవకాశ మున్నంతవఱకును, కాళిదాసు, సుందరవదనారవిందలసమూహముతో

అనువాదం : శ్రీ బొడ్డుపల్లి పురుషోత్తము

ముంచెత్తెను. ఇందు ప్రతివనితయు సుస్పష్టముగా గుర్తింపఁ దగినది. వీరే యప్సరసలు, ఊర్వశియును ఇట్టి యీయచ్చరల కవిత్వప్రబోధములను గ్రహింప వలయునన్న వీరియుత్పత్తి ప్రయోజనములను సమీక్షించు టుచితమాను.

అది సృష్ట్యాదికాలము. అనంతకాలవాహిని యందు మానవజాతి యింకను మొలకెత్తలేదు. స్వర్గలోకములు సర్వము ఖగోళములు సమస్తము దివ్యకాంతివిభ్రాజమానులగు దేవతలచేతను; ఘోరరాక్షస సమూహము చేతను ఆక్రమింపఁబడియుండెను. వీరికార్య కలాపసంఘర్షణముచే నఖండవిశ్వమున కేదో యొక స్వరూపాకృతి యేర్పడుచుండెను. ఇట్లుండగాఁ బ్రతిపక్షసభ్యు లోకపర్యాయము విశ్రాంతిగొని, పాల సముద్రఁ తరంగములపైఁబడి మథింపమొదలిడిరి. కాని వీరలక్ష్యము సిద్ధింపలేదు. ఎప్పటికి నొక్క పక్షము గావించు కృషి ఫలితమునకు రాదు. మంచి, చెడుతోడను; నాపిర్ణము వాస్తవముతోడను; నాటక యింద్రియసమ్మిళిత శక్తితోడను; సద్గుణములు దుర్గుణములలోడను; స్వర్గము నరకముతోడను, గలిసి యొక యొక లక్ష్యముతోఁ గృషి సల్పినప్పుడుగాని యా కృషి సత్ఫలితముల నొసంగదు. ఈ లక్ష్య మసాధారణమైనది; మనోహర మాధుర్యభరితమైనది. అతిక్లిష్టసాధ్యమైనది. అది యజరామరణస్థితిని ప్రసాదించి శాశ్వతానంద లోకమున సుస్థిత మొనర్చునది. ఇట్టిస్థితి వాటిల్లుటకే యనంతరకాలమున మానవుఁడు తన యావచ్ఛక్తులను ధారపోసియు సంపాదింపలేకున్నాఁడు. ఇట్టి లక్ష్యసముపార్జనమునకై, దేవాసురులు కలశపాథోరాశితీరమునందు నిల్చి మందరపర్వతమును కవ్వముగాను, సర్పేంద్రుఁడగు వాసుకిని త్రాడుగను, గావించుకొని యాధ్యాత్మిక సాగరమో! భావనా సముద్రమో!! సకలాశా స్వరూపమో!! యనఁదగిన యా పాలసముద్రమును మథింప నారంభించిరి. శతాబ్దములు, సహస్రాబ్దములు, శతసహస్రాబ్దములు గతించినవి. వారి పరిశ్రమము ఫలించు సూచనలు కానరాలేదు. క్షీరాబ్ధియుల్లోల కల్లోలితమైనది. ప్రళయ సమయ పర్జన్య గర్జానురావము గావించినది. వాసుకి యలసి సొలసి పోయినది. నిర్భర హృదయవేదనచే నది వాడి వత్తియై, సముద్రతరంగ మాలికలపై నల్లిబిల్లిగా పడినది. వాసుకివిహ్వల జిహ్వామాలికాసంజాత ఘోరవిషానలము మందర మథన సంఘర్షణతరంగసంజాత ప్రళయానలము నేకమై, సకలలోకకల్లోలమును గల్గించినది. దేవత లందఱు, పరమశివుని చరణసన్నిధికి పరువులెత్తిరి. కైలాసశిఖరవాసుఁడు, గంగాతరంగిత జటాజూట ధరుఁడును దక్క, నన్యు లెవ్వరీ కాలకూటమహావిషానలమును ధరింప సమర్థులు? ఎవఁడు విభూతి భూషిత ధవళదేహాంతరితయోగిమానసుఁడో! పరమయోగీశ్వరేశ్వరుఁడో! సుఖదుఃఖాది ద్వంద్వాతీతుఁడయ్యు నెవఁడు సదా దుఃఖమును, నిరాశా నిస్పృహలను, సుస్మితితోను వరించునో! యెవఁడు భయాతీతుఁడో! యట్టి పరమేశ్వరుఁడు దక్క నన్యు లెవ్వరీ విషసమృద్ధిని ధరింపగలరు?

అనంతర మాపాలసముద్రమునుండి యపూర్వద్యుతివిషయము లుద్భవించినవి. అఖిల రోదసీ ప్రదేశమును నొక్కయంగలో నాక్రమింపఁగల ఉచ్చైశ్శ్రవము తన కేసర సౌందర్యచ్ఛటలతో కనులు మిఱుమిట్లు గొలుపుచు భువననిస్వనములు, దేవలోకమును గూడ నదరజేయుచుండ, వియత్తల వీథి కెగసెను. అనంతరము పరమేశుని పుత్రి వారుణి, శతపత్రముపై నిలువబడి, యానంద సౌభాగ్యయుక్తయై, యావిర్భవించెను. తదనంతరము, చేతినొక చషకమును ధరించి, సర్వరోగ బాధానివారణదేవతామూర్తి ధన్వంతరి సాక్షాత్కరించెను. ఏమ్మట పవిత్రకాంతిప్రభలచే భువన మోహన మొనర్చుచు, సర్వజగద్రక్షకుఁడును, లోకబాంధవుఁడును నగు విష్ణుమూర్తికి దివ్యాభరణమై, బాధాపరితప్తులకు ధ్రువతారయైన 'కౌస్తుభమణి' సంభవించెను.

ఈ సందర్భమున నే శ్రీకాకారు మెఱుఁగు మేనులు, పీనపయోధరములు, గ్రిస్సిన నడుములు, పిక్కటిలియున్న తుఱుములుఁ జక్కని జాపులును గల నప్సరోజనము జనించెను. ఇది యట్లుండ, ధర్మునకు దాక్షాయణియైన మూర్తివలన ప్రణుతగుణోత్తరులు, పరమపావనమూర్తులు, నరనారాయణు లుదయించిరి. వీరు బదరీవనమున నిరంతర తపోవృత్తి నిమగ్నులై యుండిరి. విబుధాధిపుఁడైన యింద్రుఁడీవిషయ మెఱిఁగి, నిజపదవీహాని కల్గునని చింతిచే, దివిజకాంతామణులను వారి తపోవిఘ్నము గావింపఁ బంపెను.

ఈ భావభవుని సేనావాహిని బదరికావనమును జేరినది. రూపవిభ్రమ కళాచాతుర్య సంపత్తిని బ్రదర్శించినది. నిరంతరధ్యానతపఃప్రభావనిరతులైన

# కాళిదాసకవిత : శీలచిత్రణము

ఈ ఋషిశ్వగులు క్రోధమువలన తమతపస్సునకు బాధ చేకూరునని, దివిజ భామలపై సత్త్వగుణ సంగతులై ప్రవర్తించిరి. అపుడు నారాయణుడు తన యూరువును జీరెను. అందుండి యూర్వశీ ప్రముఖ నారీజన కోటి యుద్భవించి, దివిజ నారీకోటి కాశ్చర్యము కల్గించెను. ఆశ్చర్యమే కాదు, వారిరూపవిలాస విహారముల కీయమరీజన మోహిపోయెను. అంతట వీరలు విఫలమనోరథులై యూర్వశిని తమకు ముఖ్యరాలిగా జేకొని వచ్చిన జాడనే మరలిరి.

ఊర్వశి యన నిట్టిది. సూర్య సమాన తేజః; ఉషో నవారుణరేఖ; అనంతసాగర నిర్మలాకాశకీర్తి సుధ; స్థిర సౌదామిని, సర్వ జగతీతలమున కందని సూర్యాశాఫలము: విభ్రమాశ్చర్య పరమావధి; రసనా దివ్యతపః ఫలము; మానవ సౌందర్యమును, మానవ జీవితమును మానవోద్రిక్తతను సముద్దపరచు నొక యద్భుతశక్తియే యూర్వశి. ఇదియునదియు ననేల? సమస్త కళలు నఖండకవిత్వము, సమస్త భావనా విజ్ఞానము నీనామమునందు పరిణద్ధమైన వదనము. కాళిదాసు బాహ్య సౌందర్యోత్కర్ష నంతగా బాటింపలేదు. అతడు ప్రదర్శింపదలచినది ప్రేమపాశ ప్రగాఢ బద్ధయగు దివ్యసుందరి యూర్వశిని. ఆమె నాకలోక నివాసమహిమ; సర్వలోకపరివ్యాప్త కాంతిగరిమ; స్వేచ్ఛానిశ్వాసలాఘవము మున్నగునవి యామె వాతావరణమును సూచించునవే కాని యామె జీవిత విభాగములు కావు. ఆమె సహజ స్వచ్ఛందాకర్షణ మహిమా స్వభావము అబలాజనోచితమగు భీతి; నారీ చాంచల్య స్వభావము; నపాయ రహితమగు క్షణిక కోపము అనంతముగ ప్రోద్బు ప్రమ్ముకోగల [illegible] స్వభావము; మఱుక్షణముననే గృహరాజ్యపాలనా దక్షతను ప్రదర్శించు ప్రశాంతస్థితి; అమాయికతతో గూడిన నిష్కలుష భావతీవ్రత; మాతృదేవి పరిపూర్ణ వాత్సల్యము; భగినీస్నేహభావప్రఫుల్లత; హృదయవినిర్గత విమలభాషణము; నొకవంక నాదర్శ కన్యాభావ సౌందర్యోత్కర్షగుణములు, నింకొక వైపున నాదర్శనారీగభీరతత్వము మున్నగుననేకాంశములతో గూడిన రమ్యచిత్రము ఊర్వశి. ఆమె రాజకేళి, గమ్యము కానిది. దివిజనారీదర్పము గాని, మానవాంతస్థు నతిక్రమించెడి వేషభాషలు కాని; సహజ హృదయభావానుభూతులను మఱుగుపఱుచు నట్టి యవనికగాని మన కిందు గోచరింపదు. ఆ నేత్రాంచలములయందు దోబూచులాడు నా చిఱునవ్వు దొంతరలు; యత్కించిద్భావోత్కర్షకైన జాలువారు నా కన్నీరు; ఆ ముఖమాధుర్యగరిమ; మాటిమాటికి విస్రస్తమగు నా కేసరకాంచీదామము; నిత్యనూతనోల్లాస విలసితావయవ భంగిమలు; సర్వము నవలోకనట్టివారినైన నాకర్షింపగలవు. ఈ దేవతాసుందరి యునికిచేతనే స్వర్గమునకును భూలోకమునకువలె సౌందర్య మలవడినది. హిరణ్యపురవాసి యగు 'కేశి' యను రక్కసుడు బలాత్కారముగ నపహరించి నపుడు ఊర్వశి భయభ్రాంత యగును. అప్పుడామె 'చిత్రలేఖావలంబితహస్తభయనిమీలితాక్షి'!! చిత్రలేఖ ఈమెను జక్కగా నోదార్చును. "ఒసే! మనస్సును నిబ్బరంచేసికొనవే! అచ్చరలాగ తోచకున్నావే!" అని సోదరీసహజప్రేమోత్కంఠతో హెచ్చరించును. ఈ హెచ్చరికను బురస్కరించుకొనియే యామెలో గల మానవత, మన హృదయముల నాకర్షించి తొలుదొల్తనే మన సానుభూతి కామెను బాత్రమగావించును. ఆమె ప్రేమలో సౌకుమార్యము కలదు. క్షణమాత్రములో నామె భయభ్రాంత యగుట, నీరసించుట మున్నగునవి మనల నాకర్షించు మానవలక్షణములే. ఆమె ప్రేమలో ననూయయున్న, నది తాత్కాలికము, బుద్బుదప్రాయమునైన యసూయయే కాని పాతుకపోయిన ద్వేషము కాదు. కేవలోద్రిక్త స్వభావముచేతనే యీమెకును బురూరవునకును వియోగము ప్రాప్తింపలేదు. ఈమె కాత్మసౌందర్య ప్రత్యయము లేదు. హృదయదౌర్బల్య మధికము. భయాకులచిత్త. అందువలననే పురూరవునకును నీమెకు వియోగ మేర్పడినది. కాళిదాసీమెలో గల ఈ లక్షణముల నెట్టివ్యాఖ్యానాపేక్ష లేకుండగనే స్పష్టీకరించెను. ఎప్పటికైన నేవిమర్శకుడైన విశేష పరిశోధనచే నీమెలో దివ్యలక్షణముల నాపాదించునేమో యని కాళిదాసిప్పట్ల ప్రత్యేకశ్రద్ధ వహించెను. ఊర్వశిలో నెట్టి దేవకాంతోచిత దర్పమును గాని, యాడంబరమును గాని, సమ్మోహ చిహ్నములను గాని కవీశ్వరుడు ప్రదర్శింపలేదు. ఆమె, నిరాడంబరము నిష్కపటము నైన పవిత్ర దేవతాత్మ కలది. ఇట్టి సహజ పవిత్రహృదయము నందే యామె ప్రవిమలప్రేమభావాంకురములు మొలకలెత్తి పెరిగినవి. తన్నుదా మఱుగుపరుచుకొనలేదు. తొందరపాటుతో బయటపడును.

వక్రసంభాషణ మెట్టిదో యెఱుఁగదు. అప్పుడప్పు డాటకాయితనముతోఁ బ్రవర్తించును. తానాసించిన దానిని సాధించుటలో సాహసము ప్రదర్శించును. తన శక్తిని తాను సులభముగ విశ్వసింపదు. ఇంతేకాదు. ఉదాత్తముగను, మధురాతిమధురముగను, ధీర గంభీరముగఁ గూడ సంచరింపఁగలశక్తి యీమెకుఁ గలదు. తృతీయాంకమందలి యీమె ప్రవర్తన మిట్టిదే!! చతుర్థాంకమునఁ బురూరవునితోఁ బునస్సమాగమము జరిగిన పద్ధతి; పంచమాంకమునఁ బురూరవుని యర్ధాంగిగను, నాయువుజననియైనను నీమె వర్తించిన విధానము విస్మరింపరానిది. ఆరంభదృశ్యమునందును, కన్యాభావ విసర్జన సమయమున, నీమె ప్రదర్శించిన యత్యుత్సాహము, హృదయాహ్లాదదాయకము: కొందఱతి సూక్ష్మవిమర్శకు లూర్వశియందు నాకవనితా ప్రకృతిలక్షణము లున్నవన్నారు. కాని నా దృష్టి కట్టివేమియును జూపట్టలేదు. నాటకావధులనుబట్టి, కాళిదాసు చిత్రించిన యూర్వశీ శీలమును నిశితముగఁ బరిశీలించిన, యూర్వశీ సౌజన్యము; సహాయికత; నిత్యానందోల్లాసము సుస్పష్టమగును. నిక్కముగ నామె ప్రేమ, శకుంతలా మాళవికల ప్రేమకన్న ఋజువైనది; ఉత్సాహభరితమైనది. అయినను నామె దేవవనిత. తత్సంబంధమగు నవకాశ మొసఁగక తప్పదు. ఆమె బాహ్యప్రవర్తనలో భయభావ మెక్కువ. జీవితాధిక్రమణమునందు సాహసమధికము. అది యభ్యుదయ కారక మాగాదని నిర్ణయింపరానిది. తాను తిరస్కరణీ ప్రభావమున నదృశ్యగానున్న సంగతి మఱచి యూర్వశి, పురూరవుని యెదుట తటాలున నిలువఁబడును. కాని పురూరవుఁడు గౌరవింపఁడు. అంత నామె "సఖీ!" నేను దరిసి యెదుర నిలిచినను, మహారాజుదాసీనుఁడుగా నున్నాఁడే!" యని చిత్రలేఖతో బల్కి విచారించుచుండును. ఈ ప్రేమరూపకమునందు హృదయమును స్పందింపఁజేయు కళాస్పర్శలలో నిది యొకటి! ఈ దృశ్యమునం దూర్వశి యుల్లాసస్వభావ మొకవంకను; తాను భర్తను కౌగిలించుకొనఁ బాగా నాతని యుదాసీనత కాశ్చర్య చకితయై, తన చర్యను తాను సమర్థించుకొను తీవ్రస్వభావము మఱియొక వంకను, నేకమై నిష్కళంక భావప్రవర్తనయు, వ్రీడాకళా దుర్బలయౌ నగు నూర్వశీశీలము సుస్పష్టముగా వ్యక్తీకరించుచున్నవి. కాళిదాసీయపాత్రచిత్రణ శిల్పమునకు సంబంధించినవై, వ్యక్తావ్యక్తముగ గోచరించు నీసామాన్యవిషయములందే యాతని యద్భుత కళాస్పర్శ యనుభవనీయము. చైతన్యవంతము పాత్రలయం దీరీతిగా కాళిదాసీయ నాగరక జీవితాభిరుచి మూర్తీభవించును. ఊర్వశిలోఁ గల విలక్షణలక్షణములు, ప్రవిమల భావోద్రేకము, ప్రేమ పరిపూర్ణత, బాహ్యాడంబర భావనాయుతయగు 'ఇలియడ్' పాత్రకు నూర్వశి కేవల వ్యతిరేకము. ఈమె నిరాడంబరత్వము; నిర్వక్ర భాషణము; సహజసులభప్రేమస్వభావము, నవాంగనకున సలక్షణగా గోచరించుచు, నాశ్చర్యము గొల్పును. మహారాజుస్వయముగా పొడచూపినను నెంచుకొని, బాలపాలు దువ్వుచు లాలించెడి బాలుని గాంచినప్పు డూర్వశి స్త్రీసహజమైన యుత్కంఠచేతనూ ప్రేమభావాతిశయముతో కౌతుకముతో "ఈ బాలుఁడెవఁడు"ని ప్రశ్నించును. అంతలోఁ గొంతసేపున్న సత్యవతిని గాంచి యామె యవగాహనఁ జేసికొనును. అయినను నామె యానందోత్సాహములతోఁ బొంగిపోదు.

"అహో! సత్యవతితోఁటి నా పుత్రకుఁడాయువు! పెద్దవాఁడయినాఁడు" నిమాత్రమే యూర్వశి పల్కును. ఇంతటి పరిమిత భాషణమే సముచితమైనది. ఆమె నిరాడంబరాలాపము లన్నింటియందును గొంతకాకర్షణ ముండును. నైర్మల్య ఋజుత్వములచే వానికీయాకర్షణత్వమబ్బినది. ఆదినుండి యంతమువరకును పురూరవుని పట్ల నీమెకు గల ప్రేమాతిశయ మకలంక మనోహరము. "అహో! దానవులు నాకు మహోపకారమే చేసినారు సుమా!" ఆ అహో! నా హృదయమునుండి శల్య ముద్ధృతమైనది! యను భరతవాక్యమువఱకును గల యీ ప్రేమరూపక మత్యంతానందదాయకమైనది. ఏ సందర్భమునందైనను, నీమె సంభాషణము, ఇతరాప్సరోగణముతోడి సంవాదము విస్మరింపరానివి. "సఖులారా! రండి! నన్ను గాఢముగా కౌగిలించుకొనుఁడు! మరల సఖులముఖము చూడఁగలనన్న యాశ నాకు లేకపోయినదిక దా!" యనువిలాపవాక్యములయందును; "చిత్రలేఖా! సఖీ! నన్ను విస్మరింపకుమీ!" యను నార్ద్ర హృదయావిష్కారకమై సఖీత్వప్రేమచిహ్నమగు వాక్యమునందును, నూర్వశి ప్రేమోజ్జ్వల దాక్షిణ్యస్వభావమే ప్రతిబింబించును. తాపసిని పీడొక్కను నప్పుడీమె పల్కు పల్కులు సూక్ష్మసుకుమార ప్రేమ

భావ ప్రపుల్లమైనవి. తనకుమారుని సమీపించు నప్పటి యామె యార్ద్రహృదయము, పిల్లుబికిన మాతృత్వము, పురూరవుని ప్రశంసకు పాత్రమైనది. ఊర్వశి, శకుంతల వలెను దాత్తమనోహరమయిన చిత్రణము కాకపోవచ్చును. కాని స్త్రీ స్వభావానుగుణ్యశీలనమును మఱిచేయితర సంస్కృత రూపక నాయికా పాత్రకును నీమె తీసిపోవని నిరాఘాటముగఁ జెప్పవచ్చును.

## : సామాన్యపాత్రలు :

నాటకకర్తకును, నాటక కర్తగా రాణింపవలయునని యాశించు కవికిని గల తారతమ్యమును, వారివారి సామాన్య పాత్ర-చిత్రణా విధానమును బట్టియే గ్రహింపవచ్చును. కళాకారుని కల్పనమే యుండును. నాయకపాత్రను విశాలపరిమితిలో నెంతటి శిల్పదృష్టితోఁ జిత్రించునో, యట్టి శిల్పసామర్థ్యముతోడనే, యాయా పరిమితులలో చిన్న చిన్న పాత్రలను దిద్దును. "షేక్స్పియర్" సామాన్యపాత్రలకుఁగూడ విపరీతముగ జీవము పోయును. ఆతనిలోఁగల యసామాన్య సృజనాశక్తియే యిందులకు గారణము. కాని కాళిదాసీయ నాటక శిల్ప మట్టిదికాదు. అది గంభీరపయఃపారావారము. ఎన్నటికిని నది చెలియలికట్ట నతిక్రమింపదు. ఈ యుదాత్త కళాదర్శము వాతని ప్రతి రూపకమందును గాంచనగును. 'విక్రమోర్వశీయము'న పురూరవుని దేవేరియగు 'ఔశీనరి' కాళిదాసుని లలిత కళాశిల్పమున కుదాత్త నిదర్శనము. ఈమెయే కాదు. ఎప్పుడో యొకప్పుడో గోచరించు నప్సరసలనుగూడ నీ మహాశిల్పి యత్యంతావధానముతో, వివేచనా నైశిత్యముతోఁ జిత్రించును. వారు పల్కు ప్రతిపల్కును భావభరితము గావించును. వారుపయోగించు కాకువు నందు, వారవలంబించు భావభంగిమయందు, పరిశీలింపఁదగిన కళాసంస్పర్శ యనుభవనీయము. ఒకేసన్నివేశమున నొకే ప్రయోజనము గల్గి, యొకే స్వభావముగల చంద్రబింబాననలు నాటకరంగముపై గుమిగూడెదరు. వారిని వేఱుపఱుచుటే బహుకష్టము. అయినను కాళిదాసు వారి వారి పలుకుబడులను, వ్యక్తిత్వములను వేఱువేఱుగా పోషించి, యొకరినుండి మఱియొకరిని గుర్తించుటకు వీలుకలిగించును. రంభ పిఱికిగుండె కలది. కాని ప్రేమమయురాలు. క్షణములో నీరసించి కలతఁ జెందును. తన యావేదనను వ్యక్త పఱుచును. మేనక యిట్టిది కాదు. కీలితో ప్రవర్తించును, సంభాషించును; ఆత్మవిశ్వాస మధికము. 'సహజన్య' గభీరహృదయ, సమానప్రవర్తన. కాని భావనాతిపుష్కల. రంభా మేనకల కన్న కార్యశూర. ఈమెయే పురూరవునకు దానవుఁ డేగిన మార్గమును జూపించినది. అప్పటినుండి మిన్నకుండును. ఇతరాప్సరస లెంత తహతహలాడినను నీమె కొంచెమైనను చలింపలేదు. పురూరవుఁడు పూర్తిగా నిష్క్రమించువరకు నామె వేచి పరిశీలించినది. పురూరవుని పునరాగమనవార్త నుద్ఘాటించిన దీమెయే. "ఓసి! ఊరడిల్లుండి, ఊరడిల్లుండి!! ఇదిగో చలించుచున్న లేడి జండాతోడి ఆ రాజర్షి రథము సోమదత్తము కనబడుచున్నది. అతఁడు పోయినపని సాధించక, మరలఁడుగదా!!" యనునీమె సంక్షిప్త వచనములు సారవంతమైనవి. ప్రయోజనకరములు. వీనిచే మనమానసములలో ననుకొనకుండగనే యొకవిధమగు సహాయభావము బల విశ్వాసములు పొడగట్టును. ఇట్లీమె, మనకొక సుపరిచితమగు వ్యక్తియగును. చతుర్థాంకారంభ మందలి యర్థోపక్షేపకములో నీమెను మఱల మనము గుర్తింతుము. ఇందీమె విధానము సుస్పష్టముగ దర్శింతుము. అసహాయస్థితిలో వ్యర్థవిచారమున కీమెయవకాశ మొసఁగదు. ఆ ప్రేమ మిథునమును విధి వేఱుపఱచినది. తిరిగి యావిధియే వారి నేక మొనర్చును. ఇట్టి సాంత్వన వాక్యములతో నీమె తన విధ్యుక్త కర్తవ్యనిర్వహణ కుద్యమించును.

ఇతరాప్సరసలకన్న చిత్రలేఖ మిక్కిలి యదృష్టవతి. మూడంకములయందు మనకీమె కంఠస్వరము వినిపించును. ఊర్వశికి హితురాలు; సన్నిహితసఖి; ఊర్వశీ సౌభాగ్యమునకు నాటకీయముగా నీమె బాధఁ జెందును. ఏలయన నీమె యూర్వశికన్న యతిక్రాంచి ద్విభిన్నురాలుగా మాత్రమే యుండితీరవలయును. అనఁగా నూర్వశి యాంతరంగిక స్నేహిత యీ చిత్రలేఖ. స్నేహితుల కంఠధ్వనులు నాయికా కంఠధ్వనికి ననగియుండుట నాటకధర్మము. లేనిచో నాయికయందు సమాహితమైన యవధానము చలించును. కావున నిట్టిపాత్రలలో విపరీతాడంబరముగాని, ప్రాముఖ్యముగాని, కూడదు. ఇట్టి నాటకావరోధము లెన్నియున్నను, కాళిదాసు చిత్రలేఖ కొక ప్రత్యేక

వ్యక్తిత్వము నాపాదించెను. ఆమె ప్రేమాతిశయము, ఆమె యౌదార్యోల్లాసములు; ఆమె ప్రేమోత్కంఠలు; ఆమె నిస్సంగమగు హితవాక్యములు; మందస్మితముతో నార్యపై మనోభావముల ననుకూలించుట; జ్యేష్ఠ సోదరిగా మాతృస్థానమునందుండి యుచితానుచితము లుద్బోధించుట; మున్నగు ననేక లక్షణములీపాత్రను నాకర్షణాదరముల సమకూర్చుచున్నవి. చిత్రలేఖ ప్రతిమాట, ప్రతినైదము, నప్సరోచిత దివ్యతేజఃపుంజమును, చాకచక్యమును, సౌచిత్యమును ప్రస్ఫుటించును.

అప్సరోగణమునందుచేరక, ప్రాముఖ్యము లేకపోయినను, దయాదాక్షిణ్యములతో; మమతాగంభీరమగు సంయమనస్వభావముతోడను, స్నేహమాతృత్వభావప్రఫుల్లతతోడను గౌరవభాజనమైనపాత్ర, తాపసి—'సత్యవతి' కాళిదాసరూపకములం దిన్నింటను, నానావిధవ్యస్వభావము; నైష్ఠికసౌందర్య పరివృత్తమగు సంయమిజనప్రభావము. పరిమళించుచుండును. కణ్వమహర్షి; సత్యవతి; 'మాళవికాగ్నిమిత్రము'లోని దురదృష్ట విద్యావతి, పరివ్రాజకయగు 'కౌశికి'యు నాయారూపకములం దట్టివాతావరణమును గల్పించినవారలై.

* * *

ఇక సామాన్యపురుషపాత్రలు కూడ నిర్దిష్టస్పష్టమైనవి. కాని యివి స్త్రీపాత్రలవలె విభిన్నవ్యక్తిత్వములతో విశేషశిల్పపరిపోషకములు గావు. ఇది కాళిదాసీయ పాత్రచిత్రణవిధానము. నాయకునకును, వేటకానికిని, విశేషతారతమ్య మగపడదు. వారరుదుగా, నల్పముగా మాట్లాడుదురు. నిరంతరము పురూరవుని సాహచర్యప్రభావ ముండుటచే వారి సంభాషణములందును యతిక్రాంచి చలంకారచ్ఛాయ పొడగట్టును. మాణవకునిగూర్చియు, ఆయువును గూర్చియు విశేషముగఁ జెప్పుకొన్న బాగుండునని పించును. కాని వారిస్థానములనుబట్టి కాక, వారిలో విశేష మేమియు లేదు. విదూషకునిపాత్రనుబట్టి కాళిదాసీయ కళాక్రమాభివృద్ధిని గ్రహింపవచ్చును. ఆయువుపాత్ర, కాళిదాస సుకుమారపాత్రీకరణ విధానమునకు, పరిమితత్వమునకు, చిహ్నము ఇందాతని కళాలోభత్వమే కాన్పించును. ఏపాత్ర కెంతవరకు నవకాశ మీయవలయునో, ఆకళా ప్రయోజన మెట్టిదో ఈపాత్రనుబట్టి యూహింపవచ్చును. విదూషకునిపాత్రకూడ నిందు ప్రశంసార్హమైనదే. అతని స్థిమిత విచారము; వార్ధకోచిత విశ్వాసభావము; శిథిల నిష్ప్రయోజక గౌరవము, పలితకేశుడుగా నొసంగు సలహాలు; సంప్రదాయిక పాత్రపోషణమునందును సార్థక్యమును గల్పించు చున్నవి, పురూరవుడు రాజ్యభారమును యువరాజుపై మోపి వానప్రస్థుడునై యడవుల కేగ నిశ్చయించుకొనినపుడు "అయ్యా! చిరాయుష్ట"మని యాతడు నిట్టూర్చుటలో నీతని వ్యక్తిత్వము స్ఫురించును. విలయున నిది యాతని కపటరి సౌభాగ్యము. పురూరవుడు యౌవనోత్సాహముతో ఘనతర కీర్తిశాలియై యుండుట నీముసలి బ్రాహ్మణు డెఱుగును. అతనికోరకే ఈతడీవార్ధక్యము నందును బరిచర్య సల్పుచుండెను. పురూరవుని జీవితముతో నీతని జీవితము ముడివడి యున్నది. అట్టి పురూరవుడు నిష్క్రమించి రేంక్రనూత్న యువకుడు రాజైనచో యాతనికేమి యుత్సాహ ముండును? ఈపాట్పుచే నీ ముసలి జీవితము ప్రయోజన రహితముగుచున్నది. కాని. యార్ద్ర విశ్వాసయుత విరక్తి భావముతో నీతడిట్లు పలుకులవాడు చెప్పనని మాట్లాడును.

బాల్య మత్యంత మనోహరమైనది. క్రీడాస్వభావ చిత్రీకరణము, నవక్ర హృదయసంపదయును నీవయస్సు కాణాచి. కాళిదాసు రమణీయభావము దీనిచే నాకర్షింపఁబడినది. అందుచే నీతఁడు నా రూపకమునందు బాలకుల స్వభావమును నవనవోన్మేషముగను, నవవికసిత కుసుమకోమలత్వముతోడను, సుప్రభాత పద్మదళ విగలిత తుషారబిందువుల వలెను దిద్దెను. ఇందు కన్వాస్వప్న విశిష్టుడు, సత్యాజోతియు, దర్శనీయము. సామాన్యకవులు బాలపాత్రలను బరిపోషించుటలోఁ దికమక పడుచుందురు. కాని కాళిదాస కవీంద్రుఁడెట్టి తొట్రుపాటును లేక బాలపాత్రలకుఁ జెందిన యొక సామాన్య సన్నివేశమునుగాని, సంభాషణనుగాని, భంగిమనుగాని, నటననుగాని యత్యద్భుతమగు నాటకీయశక్తి సామర్థ్యములతో సమకూర్చును.

షేక్స్పియర్ కవి తనకళానైపుణ్యము నంతయు వినియోగించి విశదముగ పోషించిన "ఆర్థరు" నిజమైన బాలుడు కానేకాడు. అతఁడు వాచాలుఁడు. అర్థరహిత లేనివాడు. భావభంగిమలను గుర్తించి ప్రసారించును.

బాలురకు నాట్యభంగిమ లుండవచ్చును. భావింపగల సామర్థ్యముగూడ నుండవచ్చును. అవి కేవలము విలాసతుల్యములుగా మాత్రమే యుండవలయును. వానిని గూర్చిన జ్ఞానమే వారి కుండదు. వారు తమ భావములను, భావభంగిమలను సత్య పరిజ్ఞానముతోడనే వ్యక్తీకరింతురు. అది తమకర్తవ్యమనియు వారు భావింతురు. వానిని సందర్శించుటకుగాని, గ్రహించుటకుఁగాని వారికట్టి ప్రేక్షక వర్గమును నవసరము లేదు. మేధావులైనవారికి కొన్ని యావను లేర్పడును. షేక్స్పియర్ విపరీత మేధ, యాతనిని రెండు స్వర్గధామములలో సంచరింపనీయకుండ నరికట్టినది. బాలహృదయము, మాతృహృదయము ననుయీ రెండు స్వర్గములు, షేక్స్పియర్ 'కాన్‌స్టెన్సు' అనునామెను 'ఆర్థరు'నకు కేవల మొక లాంఛనప్రాయమగు మాతృమూర్తినిగా మాత్రమే చేయగల్గెను. అప్పటి కప్పుడే వేషధారణము గావించుకొన్న కపటవ్యక్తిగ 'కాన్‌స్టెన్సు' గోచరించును. అద్భుతావహమగు నాటకసృష్టిఁ గావించిన యీ మహాకవి, మాతృహృదయ మావిష్కరింపఁగల యొక్క స్త్రీపాత్రను సృజింపఁజాలకపోయెను. మాతృదేవీ పవిత్ర సౌందర్య స్వాంతనిఁ గల్గించు కతిపయ శబ్దజాలము నుండిన యుండవచ్చును. కాని యంతమాత్రమునకు సహృదయులు రంజింపరు. 'షేక్స్పియర్' నుండి వారెంతయో యాశింతురు. స్వార్థరహితమై, కాంతిసముజ్జ్వలమై, ప్రేమవాహిని వలె సీమలు నెల్లవలె ప్రవహించు మాతృదేవి నాతఁడు చిత్రించి ప్రసాదింపవలయునని మనసు కాంక్షించును. అట్టి ప్రముఖమైన షేక్స్పియరునందు గోచరింపకుండుట శోచనీయము. భారతీయ కవీశ్వరుఁడీ విషయమునందు గాఢ ప్రేమానుభూతుల ననుభవించుటచే భారతీయ హృదయ సంస్కారము పవిత్రమై, కవులయందు వారి సందర్భములు, రసరూపమున నావిష్కృతమైనవి. కాళిదాసు తన యాంగ్ల సహాధ్యాయుని సందర్భమున నతిక్రమించెననుట సత్యము

కాళిదాసుకూడ షేక్స్పియర్ వలె మాతృప్రేమ భావముకన్న, పితృప్రేమార్ద్రతి నధికముగ ననుభవించినట్లు తెలియును. కాళిదాస కావ్యములందును, రూపకములందును పితృ—పుత్రీప్రేమద్యోతక మగు నావేశ భావప్రకటనా దృశ్యము లున్నంతగా, మాతృ—పుత్ర ప్రేమావిష్కారక దృశ్యములు మృగ్యములు. వాల్మీకి సృజించిన కౌసల్యకు సదృశమగుపాత్ర కాళిదాసు చిత్రింపలేదు. అయినను మాతృత్వ మధుర మనోహర సత్యసముద్దీపిత భావోల్బణము నీతఁడు నిరూపింపక పోలేదు.

ఆయువును, నూర్వశియు, నీ రూపకమునందు పుత్రమాతృప్రేమ ప్రదర్శించుట కుద్దేశింపఁబడలేదు. ఊర్వశి తనపుత్రుని సత్యవతి కర్పించి పెంచమని కోరినది. ఆయువునకు తల్లిదండ్రు లెవరో తెలియదు. ఇట్టి సన్నివేశకల్పనము నిజమునకు కఠినము, బాధాజనకమును. కానియిట తన నాటకీయచాతుర్యముచే కవీశ్వరుఁడీ కల్పనకు మృదుత్వమును, పవిత్రతను జేకూర్చినాఁడు. ఎట్లైనను పరిస్థితు లూర్వశిపట్ల నొక విసుగుకును భావమునే కల్గించునుగాని, యామె కృత్యమును సమర్థింపవు. దురంత దుస్థితిలో నూర్వశి తన వివేకము నుపయోగించి, రెండనర్థముల నొడిగట్టుకొనక, తక్కువ దానినే భరింప సాహసించినది. ఏలయన నాయువును దనకడనే పెంచిన, ఆమె యాయువునే కాక పురూరవుని గూడ విడిచి పుచ్చవలసి వచ్చెడిది. ఆయువును మృదులహస్తయు, వివేకవతియు, సాధుజీవనయునగు సత్యవతి కప్పగించుటచే నూర్వశి యాతని యోగక్షేమములను భద్ర మొనర్చినది. ఈ త్యాగ మెప్పటికైనను జరుగవలసినదే. అల్లారు ముద్దుగ గన్న సంతానమును గురుకులమునకు బంపి, విద్యావినయవివేకములను సముపార్జింపఁజేసి, వారిని సాంఘికాదర్శములుగాఁ దీర్చిదిద్దుట యానాటి జననీ జనకుల బాధ్యత. ఆ బాధ్యత నొకింతయుం దే యూర్వశి వహించినది. అంతేకాని తనలోని మాతృత్వమును రూపుమాపుకొనునంతటి మూర్ఖురాలు కాదూర్వశి. సత్యవతీ ప్రేమాంకిత మృదులహస్తములయందు తన కుమారుడు కుశలముగ నున్నాడని గుర్తెఱింగియే యుపశమితయై. యామె భర్తృవాల్లభ్యమును జూరఁగొన్నది. ఆయువు యూర్వశి కడకుఁ గొనిరాఁబడెను. ఊర్వశి యంతరంగమున నద్భుత భావార్ణవము ఘూర్ణిల్లుచున్నది. కాని యామె యెట్టి వికారమును జెందలేదు. ఆమె నిరాడంబర మృదుల స్వభావ. మౌన ముద్రతో నామె కుమారుని సమీపించును. కాని యామె చేలావృతమైన హృదయమునుండి మధుర స్తన్యము బుకును. ఆతని సందర్శనానందముచే నామె యనివార్యమగు వియోగమును గూడ విస్మరించినది.

చిరకాలముగా నామె పుత్రసందర్శన సౌభాగ్య సంజాతానందమునకు దూరమైనది. ఇప్పుడది ద్విగుణీకృతముగ పెల్లుబికినది. ఈపరిస్థితి ప్రవర్తనచేతనే, యామెలోని మాతృత్వమును కవీశ్వరుఁడు మూర్తీభవింపజేసెను. మాటలకుఁగూడ నతీతస్థితియిది. ఊర్వశి ముఖతః యెట్టిమాటలను బల్కించలేరు. అది యామె స్వభావమునకు విరుద్ధము. ఇప్పట్టి యూర్వశి స్థితిని పురూరవుఁడు గాంచెను. సులభ కవితోద్రిక్తుఁడగు నీతఁడు వెంటనే యాస్థితి నీరీతిగా వర్ణించెను.

కం|| చనుదంచెను గౌతుకమున| నినుఁగని కనుఁబంకం
బొందె నీ జనని, సుతా
అనురక్తమెయిం జేసెన! చనుగవపాలకుఁ దడిసిన
చనువలిపెముతోన||

ఒక్క చూపునందె పరిమితభాషణమునందె యూర్వశి తనయనుభూతి సర్వస్వమును వ్యక్తపఱచ నేర్చినది. ఆమె మౌనముద్రలో నిహితమైయున్న యనుభూతి సాంద్రత నవగత మొనర్చుకొనుట కామె నిత్యజీవితముతో నివసింపవలయును

* * *

ఆయువు పాత్రకూడా ప్రశంసార్హమైన యొక కళాఖండమనదగును. ఇట్టిపాత్రను పోషించుటకుఁ గొంత క్లిష్టతకలదు. అది పెరిగెడి వయస్సు. ఒకవంక బాల్యచాపల్యము, వేరొకవంక తెలిసీతెలియని స్వభావము. అన్ని మానసిక పరిణామము, నీదశను నిరూపించుట మిక్కిలి క్లిష్టము. ఇదియొక సంధికాల పరిణామావస్థ, నాటకమునం దిట్టిపాత్రను పోషించుట కెంతో నైపుణ్య మవసరము. లేకున్న నది యతుకుల బొంతగా సిద్ధమగును. కాళిదా సిట్టి శిల్పమునను సిద్ధహస్తుఁడు. ఈతని భాషణమునందు సమయోచిత నైపుణ్యము, నవాంతర భేదములును గలవు. అదియు మిక్కిలి పరిమితముగను, నతిసామాన్యముగను నుండును. అట్లుండుటయే విపత్త్రిర కోపాయము కూడా. ఎట్టిశ్రమయు లేకుండనే సర్వసామగ్రియు సమకూడినది. ఆయువు తపోవనమునుండి యొక్కమారుగా వైభవోద్దీపితమగు నొకానొక రాజసభాంగణమున నడుగిడును. ఆతఁడితః పూర్వ మెఱుగని తల్లిదండ్రుల సముఖమున నడుగిడును. ఇది యెంతటి క్లిష్ట సన్నివేశమో యూహించుట గూడ కష్టము! అతనిలో నాత్మచైతన్య మావిర్భవించెను. అనేక సందేహములు పొడమినవి. తన సహజపరిసరములకు వైదొలఁగుటాతనికి సహింపరాకుండెను. అతఁడు తన దౌర్బల్యమును గప్పిపుచ్చుకొనుటకై విపరీతమగు హుందాతనము నవలంబించెను. తెలిసీతెలియక పెద్దమనుష్యునివలె వర్తింపనెంచెను. అకాలభావపచేళిమ సూచన గూడా మనకీ పాత్రయందు గొంచెముగా గోచరించును. అపరిచితులగు వ్యక్తులు, తన్ను, తమ వారిని సమీపమునకుఁ దీసికొనుచుండిరి. వారికిని తనకును నేదో బాంధవ్య మున్నట్లాతని ప్రాచీనానుభవము ప్రబోధించుచున్నది. అతని స్వభావగతమగు పిఱికితనము కొంత పెత్తనము వహించినది. కాని యతని యథార్థ మానసికస్థితి యర్థము గావించుకొనుటకై యదృష్టవశమున, నాతనిని పెంచినదాది, తపోవన ప్రతినిధిగా, నాతనివెంట వచ్చినది. తల్లి చెంత బిడ్డ కెంత చనువో, ఆమెచెంత నీతనికిని అంత చనువు. అతఁడామెవంకకు మరలినపుడు గాని, యామెతో సంభాషించినపుడు గాని, యతి సహజముగా మాటలాడను, చేష్టయందును, తపోవనమున నామె కొంగుపట్టుకొని సంచరించిన నాటి బాలుఁడయిపోవును. బాలునివలె సంభాషించును; ప్రవర్తించును; విధేయతలో నామె యాజ్ఞను శిరసావహించును. ఏమి ఈ మనోహర కళాజీవనములోని మాధుర్యభరిత స్వాభావికత్వము. ప్రకృతి కెంతటివిశ్వాసపాత్రమగు ననుసరణ మిది!!

* * *

'మాళవికాగ్నిమిత్రము' లో ... ఒక పాత్రక 'వసులక్ష్మి' నాటకరంగముపై కొనరాదు. అయినను నగ్నిమిత్రుఁడు చిత్రఫలకమును సందర్శించి, దేవికి దగ్గరగా వ్రాయఁబడిన యపూర్వాంగయయిన యామె పేరేమియని కుతుకముతో ధారిణినిఁ బ్రశ్నించినపుడు దేవి యా ప్రశ్నకు బదులుచెప్పక యనాదరమును జూపును. రాజు పేరును గుచ్చిగుచ్చి యడుగును. అపుడు బాల్యావస్థకుఁ దిగినట్టి వసులక్ష్మి "ఆర్యా! ఈమె మాళవిక" యని బల్కిన ముచ్చటయిన మూడు మాటలు భావికంతకును గమనమును గల్గించును. అప్పటి నుండి ధారణి మాళవికను గంటపడనీక జాగ్రత్తవహించును. 'శాకుంతల' రూపకమునందు సింహకిశోరముతో భరత బాలుఁ డాడుకొనుదృశ్య మెంత సౌందర్య సముద్దీపితమైనది! నూటికి తొంబది తొమ్మిదిమంది కవుల కిట్టి కల్పనఁ జేయఁగల సామర్థ్యముండదు. కాని కాళిదాసు మధురహస్తములలో నీ కల్పన మనల్పశిల్ప

గరిమతో జీవకళారమ్యతతో నొప్పారుచున్నది. ఆ భరతుఁడు పిల్లిపిల్లలతో నాడుకొనుచున్నంత సహజ శోభను మనము సందర్శించి, యానందింతుము. పరిగత కథా ప్రాభవమన్న నిట్టిది!!

* * *

ఇక విదూషకుఁడు మాణవకుఁ డొక దుర్బలవ్యక్తి. సంప్రదాయానుకూలముగ సిద్ధించిన విదూషక పాత్ర కాళిదాస రూపకక్రమాభివృద్ధితోఁబాటు వృద్ధి జెందక పోవుట శోచనీయము. "మాళవికము"లోని విదూషకుఁడు "గౌతముఁడు" జీవకళతో సమగ్రముగ నొప్పారు నొక వ్యక్తి. కథా సంవిధానమునం దీతనికిని ప్రాధాన్యము కలదు. సామాన్య విదూషకులవలె నితఁడును హాస్యప్రియుఁడు, అసత్యవాది, బాల్యతా రహితుఁడు, తుంటరియే. కాని యీ లక్షణముల నతికరించి, ఈతని వలన నాటక కార్యమునకు కొంత ప్రయోజనము సమకూరుచున్నది. కాని "ఊర్వశి" రూపక కథా సంవిధానమున విదూషకున కిట్టి ప్రాముఖ్యము నొసంగిన దాని యాభ్యున్నత సౌందర్యస్థాయికి భంగము కల్గును. అది మహాదోషమే యగును. అందుచే విదూషకుని పాత్ర యొక్క సాధారణ సంభాషకుని స్థాయికిఁ దగ్గింపఁబడెను. పురూరవునకు విశ్వాసపాత్రుఁడైన యొకవ్యక్తి, సంభాషణార్థము కావలయును. అందులకే ఈ విదూషపాత్ర నిర్మింపఁబడినది. కానిచో, రూపకమునందతని వలనఁ గల్గిన యేకైక ప్రయోజనము—తన తెలివితక్కువతనముచేత స్వయముగ పురూరవుఁడే ఔశీనరితో రహస్యమును భేదించినాఁడను నెపుడొక మాట నమ్మి, తానే యసలు విషయమును బైటపెట్టెను. అయినను రూపకమున నీతని పాత్ర యొక్క వైవిధ్యవిలసితమైన శోభ నాపాదింపఁ జేయుచునే యున్నది. ఈతఁడు మాళవిక, శాకుంతల రూపకములలోని విదూషకుల కన్న విభిన్నుఁడు. గౌతమునికున్న శక్తిసామర్థ్యములు కాని, యుక్తిమతిత్వజ్ఞత గాని ఈతనికి లేదు. అతనికన్న కఠినముగను, మొరటుగను సంచరించును. విదూషకునకు సర్వసామాన్యముగా నుండు విపరీత భోజనప్రియత్వము, వసహ్యచేష్టాదికము, భీరుత్వము లతోఁబాటు సమయానుకూల పరుషహాస్యము, దైవఘటితమగు ప్రపంచ పరిజ్ఞానము, విలక్షణమగు కార్యదక్షత మున్నగు ననేకగుణము లీతనికి కలవు. ఇఁక పురూరవుని సాహచర్య ప్రభావమున నలవడిన యాలంకారిక భాషాప్రయోగము విషయమై వేఱుగాఁ జెప్పఁబనిలేదు. ఇన్ని గుణము లుండియు, నాతని మానస మున్నతస్థితి నందుకొనలేదు. తనయంతరము నందే యితరపాత్రల యుదాత్తత నూహించును. ఈతనిలో నెన్నదగిన మఱియొక సుగుణము కపటవేషములు వేయఁడు; తా నపహాస్యముపాలగుటకు సర్వదా సంసిద్ధుఁడు. కొంత తఱిగి పర్వసముగ వర్తించు నీపాత్ర పురూరవుని గానమనోహరాదర్శ హృదయమును, కాంతాదర్శ విలసితమగు నూర్వశిని, వైదగ్ధ్యముతో నుండియు పట్టమహిషి శీలితో నొప్పు ఔశీనరిని సర్వవిధముల రంజింపఁజేయగల సామర్థ్యము గలదనక తప్పదు. విదూషకుఁడుగా రూపకమునం దీతనికిఁగల స్థానమునుబట్టియే కాని, యొకవ్యక్తిగా నెట్టి ప్రాముఖ్యము నీతనికి లేదు. ఈతఁడు పెద్దగా నాకర్షింపజాలక పోవచ్చును. కాని నీరసమునుమాత్రము కల్గింపఁడు. ఏదెట్లున్నను మాణవకుఁ డొక సజీవపాత్రయని నిర్ణయింప వచ్చును.

* * *

నాయికా నాయకులను పరివేష్టించిన ఈ సామాన్య పాత్రలలోనే, దూరముగా నిలువఁబడి యుదాత్త ప్రతిపాదనలతో స్వాతంత్ర్య శీల ప్రతిపత్తితో నొప్పువ్యక్తి 'యౌశీనరి,' మనదృష్టిని బలవంతముగ నాకర్షించును. ఔశీనరీదేవికి, పదవిని బట్టి గొంత ప్రాముఖ్య మున్నను, నాటకచర్యయం దంత ప్రాముఖ్యము లేదు. ఈమె యసూయ నాటకచర్య కెట్టి యవరోధమును కల్గింపదు. ఆమె త్యాగము పురూరవుని ప్రేమను బవిత్ర మొనర్చును. నాటక కథా నిర్మాణమున నీమెకు స్థానమే కనుపించదు. కాళిదాస నాటకశిల్పమునందీ పాత్రను బోలిన పాత్రయే పాడ గట్టను. ఈమెను ప్రవేశపెట్టుటచే పాతకథ కూడ ప్రవేశపెట్టఁబడినది. కాని యందులకై వినియోగింపఁ బడిన సమయ మత్యల్పము. భార్యకు సామాన్యముగా నుండు నీర్ష్యాభావ ప్రదర్శనమునకే ఈమె మనకు కనుపించును. ఇది సాంప్రదాయికముగా నున్న విషయమే కాని యసత్యము కాదు. వికసించిన గులాబి పుష్పమునకును, వికసించుచున్న గులాబిమొగ్గకు నుగల స్పర్థయే యీ స్పర్థ. కాని "మాళవికము" నం దిదే విషయము రూపకమున కంతకును ప్రాతిపదిక. ఇక్కడ మాత్రము దీని ప్రస్తావన యత్యల్పము. కేవల కథాగమనగతము. ప్రారంభాంకములలోని పాత్రలకన్నను, మాళవికము

లోని 'ధారణి' కన్నను కూడ పురూరవుని పట్టమహిషి సారసుకుమార భావాన్వితయన నొప్పును. కాశీదేశపు యువరాణి ఉశీనరుని పుత్రిక, ఔశీనరిని గూర్చి యామె ప్రత్యర్థిని యగు నూర్వశి "ఈమె దేవీ శబ్దముచేత నుపచారమునందుట యుక్తమే. తేజమునం దీమె శచీదేవి కేమాత్రము తీసిపోదు" అను ప్రశంసావాక్యములను బల్కుట పరికించితిమేని, యట్టి యీమె తన భర్త పురూరవుఁడు, తన్ను పర్యవసానము చేసి, స్వర్గనిర్గత యగు నొక యప్సరసను ప్రేమించి, యందే విలీనమై తన సౌందర్యమున కాఘాతమును, విషాదమును గల్గించుచుండ ప్రతిఘటించుట సమంజసమేయని మనము సానుభూతితో భావింపక మానము. 'మాళవికను' నందలి ప్రేమమాత్సర్యము లింతగ బలితములు కావు. ఇరావతీ యౌవనోద్రిక్త ప్రేమకన్న, ఔశీనరి ప్రశాంతప్రణయభావమే గాఢమైనది. ధారణి, దాక్షిణ్య స్వభావోచితమైన బుద్ధిపూర్వకమగు త్యాగము కన్న, ఔశీనరి యుదాత్తవిషాదమును, నాత్మత్యాగ నిరతియు నెక్కువ శక్తిమంతములై, మన హృదయములను గదిలించును. ఈమె శీలచిత్రణమునందు నైశిత్యము, సంయమనము, యుదాత్తకళానిరూపణము ప్రస్ఫుటము. ఇరావతిలో నుప్పొంగిన యసూయోద్రేకము ఔశీనరిలో నుప్పొంగలేదు. కాని ఈమె యసూయా స్వభావమంతకన్న తీక్ష్ణము, ప్రచండమునైనది. అది యామె యాంతరంగిక ప్రౌఢప్రేమకు ప్రచ్ఛన్నాకృతి. ఆమె తన ప్రేమభావతీవ్రత నిట్లు నర్మగర్భముగా, నాత్మనిందాపూర్వకముగ ప్రకటించినది.

"నీయందపరాధము లేదు. నేనే యిందులో అపరాధిని. నేను ప్రతికూలదర్శనయై, నీయెదుట నిలుచున్నాను. నేనిటనుండి వెళ్తాను."

ఇంతటి తీవ్రసముచిత నిరసనను ప్రకటించినను, తన్మూలమునఁ దనకుఁ గల్గబోయెడి పశ్చాత్తాపము నామె స్మరింపకపోలేదు. అందుచేతనే "నిర్దాక్షిణ్యము వహించినందుకు కలిగే పశ్చాత్తాపతీవ్రతకు వెరుస్తాను." అని యాత్మగతముగా నీమె తలంచును. క్రోధము తాత్కాలికముగా నామె నాప్రదేశమును వీడఁజేయును. కాని తరువాతి యంకమున నామె పశ్చాత్తప్తయైనట్లు సందర్శింతుము. ఆగ్రహమునందును నామెకు బలీయమగు నిగ్రహముకలదు. సంయమన మధురహృదయగభీరతా సంజనిత మగుటచేతనే యామె త్యాగనిరతికి, కవితాముద్ర చిక్కగాఁ బడినది. విదూషకుఁడు తన సహజ పరిహాసవిధానముతో దెప్పుచూ మాటాడినపుడు, ఔశీనరి ప్రేమపరిత్యాగభావోద్రేకము హఠాత్తుగా నిట్లు పెల్లుబుకును.

"మూర్ఖా! నేను నాసుఖమును జంపుకొని ఆర్యపుత్రుని సుఖితశరీరుని చేయఁగోరుచున్నాను. దీనిని బట్టియే ఆయన నాకుఁ బ్రియుఁడో! కాఁడో!! గ్రహించుకో!!"

పురూరవుని సత్యాసత్య ప్రేమాసక్తప్రతివాదనలను, దుఃఖితయయ్యు, మృదులముగా త్రోసిపుచ్చి, ఔశీనరి రూపకమునుండి నిష్క్రమించును. కాని స్నాతకుకూలయుగ్మము ధరించి, మంగళ సూత్రభూషణము, పరిమిత పుష్పాలంకృతయునై, నవతృణ వితానమాత్ర కచాళితో నా ప్రవిమలోదాత్తభక్తి ప్రవృత్తి త్యాగశీలిని మనప్రక్కనే నిలువబడి త్యాగ సౌందర్యప్రసూన సౌరభముల వెదజల్లుచున్నట్లు మనకు గోచరించుచునే యుండును. తిరిగి యామె మనకు రంగముపై కనుపించు నవకాశమే లేదు. కాని పునర్లబ్ధుఁడైన యాయువునకు యౌవరాజ్యాభిషేకము పూర్తియైన పిమ్మట, ఊర్వశి, పురూరవుని యనియోగముచే వెళ్లు నానందోత్కట సమయమున. "వత్సా!! రా!! మీ పెద్దమ్మకు నమస్కారము చేయు"మని పెద్దబుద్ధిలోఁ గోరునప్పుడు మాత్రమే ఈమె పేరు నాటకరంగమున కడసారి వినిపించును. ఔశీనరి పవిత్రనామము నిట్లూర్వశిచేఁ దుట్టతుదను స్మరింపఁజేయుటనుబట్టి, యూర్వశి హృదయము నౌశీనరీత్యాగశీల సంబంధ పరిపూర్ణ విశ్వాస భరితమైయున్నట్లును; భగవానుఁడగు చంద్రుఁడు రోహిణితో గూడి యధికముగా శోభించు తరుణమున ఔశీనరి, తానై కైకొన్న పవిత్ర వ్రతము ప్రత్యక్షరముగాఁ బాటించి పరిపక్వమైనట్లును, నా విషయ మూర్వశిగూడ గుర్తించి, యాత్యాగవ్రతికు లోలోన నంజలించుకొనుచున్నట్లును; మాటలచేఁగాక, క్రియాత్మకమగు ధ్వని మార్గమున నిరూపించిన కాళిదాసు కళావైదగ్ధ్యము సాన్యతోదర్శనీయముకదా!!

నీతి నియమయుత పవిత్రభావప్రఫుల్లత; యార్ద్ర హృదయశక్తి సముత్సుకత; సుకుమార భావోద్రిక్తతా సంయమనయుతమైన ఈ మహాకవీశ్వరుని

శిల చిత్రణశిల్పమునందు, మానవకోటికి మహిమాన్విత మగు నభ్యుదయపథము సాక్షాత్కరించును. ప్రకృతి కాంతి మాధుర్యము, సత్య జీవిత ప్రవృత్తి; సుకుమారోత్ఫుల్ల కళాకౌశలము; పూర్వపు కాళిదాసునందున్నను; విక్రమోర్వశీయమునం దింతకన్న పచేళిమమైన కళాప్రతిభావిన్యాసము, బహుముఖములుగా పరివ్యాప్తమైనది. ఇందుండియే యీ కవికులసార్వభౌముఁ డెట్టి యున్నత కళా శిఖరముల నధిష్ఠింప నున్నాఁడంచు ననవచ్చును.

## : అప్సరసలు :

మానవ స్వభావ సౌందర్య మాధుర్యముల సుసంకలించుటే కాళిదాసు కవిత్వమునఁ గల యాకర్షణవిభూతి. అతఁడే విషయమును జేఁబట్టినను, నది యత్యుజ్జ్వలకళా ప్రపంచ సంబంధియై రసజగతి సౌందర్యశోభల నవఘటింపఁజేయును. దివ్యకవితావరప్రసాదుఁడగు నీ కవి మధురహస్తమునందు కవిత్వము పరుసము నధిష్ఠించినది. అయినను నది సహజశోభా విలసితము; మానవ హృదయసన్నిహితము; మానవత్వ జీవనపరిపోషకమును గాకపోలేదు. 'షెల్లీ' కవి విరచిత "విచ్ ఆఫ్ అట్లాస్" "కీట్సు' కవి విరచితమగు 'సినథియా" కావ్యములు కూడ సుందరమైన కళాసృష్టులే. కాని యందులో జీవకళ యల్పము. అందలి దృశ్యము లస్పష్టములు; అస్థిరములు. కవులు కలలలోఁ గాంచినట్లుగా నుండును గాని సుస్పష్టములు దార్శనిక శక్తి యందు మృగ్యము, అవి మన భావన కొకింత ప్రీతిఁ గొల్పునే కాని, మన హృదయములను గదలింపవు. అవి మతి ప్రతిపాదకము లగు భావనల కొలనాలమై దురవగాహముగా నుండును. అవి ప్రపంచేతర విషయభరితములు. హైందవుఁడు కూడా నొక స్వాప్నిక జీవిగను, తత్త్వచింతనారతుఁడుగను నిందింపఁబడును. ఈ యారోపణమునందు సత్యము కలదు. కాని కేవల మదే సత్యమనరాదు. ఒక విధముగాఁ జూచిన హైందవమానసము వాస్తవిక జీవిత సంబంధమైనది. మఱియొకవిధముగాఁ జూచిన ప్రపంచవిముక్తికి హైందవుఁడు సదా యన్వేషించుచున్నట్లుండును. భావము పాతుకొను దాక నాలెని మానసము విశ్రమించదు. వాస్తవిక దృక్పథమును తులనాత్మకముగా జూచిన చాల సులభము. సూర్యుఁడు, జలము, వాయువు, భూమ్యేతరపదార్థము లన్నియు భౌతికవస్తురహస్యములం దత్యుత్తమముగ నిమిడియున్నవనియు తెలిసికొనుట సులభము. కాని హైందవుఁడీ పరిజ్ఞానముతో తనియఁడు. అతని దృష్టి యాంతరంగికమైనది. ఆంతరంగిక పరిజ్ఞానసంపాదన మతని లక్ష్యము. అనంతము, నదృష్టము, తాత్త్వికము నగు జ్ఞానసంపాదనమున కాతఁడు సదా తహతహలాడును. ఏతత్సంపాదనలోఁ గనే యాతఁడు తృప్తిఁజెందక, యా యనంతమును పరిమిత మొనర్చుటకు; నదృష్టమును దృష్టమొనర్చుటకు; తత్త్వమునకు రూప మొసఁగుటకు సదా యత్నించుచుండును. 'కెల్టు' జాతి యనంతమును గూర్చి తన భావనను ప్రసరింపఁజేయును. సుందరమగు చిత్రములను జిత్రించును. తత్సంబంధమగు దురవగాహమైన కవిత్వము గూడ నల్లును. హైందవుఁడు తన హృదయమును, మేధను, కడకు తన సర్వస్వమును ఏవంవిధ భావనామార్గమున ధారవోసి, తన ఈ తపస్సునకు ఫలితముగా భగవంతుని దర్శించి, సృష్టిముఖమున వ్యాఖ్యానించును. ఇట్టి హైందవ ద్వంద్వస్వభావము నందే హైందవ జీవిత, మత, వాఙ్మయ, నాగరికతా రహస్య మిమిడియున్నది. మహోన్నతాధ్యాత్మికత్వము విపరీతభౌతికత్వముతో సామరస్యపూర్వకముగా కృషి సల్పవలయునని జయప్రదముగ యత్నించుచున్నది. ఒక వైపునుండి మనము సమస్త భౌతిక ప్రపంచమును నాధ్యాత్మిక దివ్యదృష్టితో తిలకింతుము. ఈ ప్రపంచము బుద్బుదప్రాయమని, మాయ యని భావింతుము. మఱియొకవైపునుండి యాధ్యాత్మిక దివ్య తత్త్వమును సత్యసౌందర్యసముద్దీపిత రూపములుగా నిర్మించుకొని యానందరతుల మగుదుము. ఇది మహోదాత్త వేదాంత రహస్యము. ఇది యందఱకును నవగతమగు విషయము గాదు. దీని గ్రహించుట కొక విధము సంస్కారబల ముండవలయును. అట్టి సంస్కార ప్రాబల్య విరహితుఁడగు యూరోపియనునకు నిది యంతయు నొకగందరగోళముగ నుండును. ఇంకను, హైందవ సృజనాశక్తికి నిదర్శనమగు విగ్రహారాధనము, కతిపయ గ్రాంథిక సూత్రములను జిలుకవలె పఠించు క్రైస్తవునకు వికారమనిపించును. సామూహిక స్వభావముగల మఱియొక జాతిపట్ల నీమానసిక విభాగము విభిన్న వ్యతిరేక ద్వంద్వశక్తులుగా నుండి సామరస్యమునకు యత్నించుచు, క్రియాప్రతిక్రియలతోఁ గూడి యొక గొప్పభావచరిత్రగా సిద్ధమయ్యెడిది. బహుముఖీనములగు

మనఃప్రవృత్తిగల వాఁడును; ఒకేఒక మూర్తివిధానమునకు లొంగని హైందవుని మానసమిట్లు వింగడింపఁబడలేదు. తొలుదొల్త విభిన్నముగఁ గన్పించినను, కాలపరిణామమున నొక సమైక్యభావము సమకూడును. విలక్షణము, సర్వోత్తమము నగు హిందూభావమునందలి భేదము లన్నియు సృష్టివైచిత్రిని సుస్పష్టముగను, సునిశితముగ నవగాహన మొనర్చుకొనుట కత్యంతావసరమే యని భావించును. ఇవి యన్నియు నొకే యొక సత్యము యొక్క భిన్నముఖములనియు, పరిపూర్ణ సత్యజ్యోతిని సందర్శింపవలయునన్న, నీవిభిన్నముఖ పరిజ్ఞాన మవసరమనియు సహృదయుఁడైన హైందవుఁడు భావించును. కావున హిందూమతమునందలి యవాంతర భేదములను సహనసద్భావముతో సమాదరించుటే మానవునిలోఁ గల స్వేచ్ఛాతత్త్వమునకు ప్రముఖ నిదర్శనము. ఇందలి వివిధదృక్పథములు కూడ, హిందూమానసమధిరోహింపనెంచిన పరమ జ్ఞానశిఖరమునకు సోపాన పరంపరయే కాని యన్యము కాదు.

జాతీయ మేధాప్రవృత్తియే తజ్జాతీయ కవిత్వము నందు గాఢముగ భావముద్రను వేయును. సంస్కృత భాషలో శృంగారాధ్యాత్మికమగు ద్వివిధ మనః ప్రవృత్తులయందు నిష్ణాతుఁడైన కవిపుంగవుఁడు కానరాడు. అతని పాదద్వయము భూమిపై పాతుకొనక పూర్వమే యాతని దివ్యదృష్టి వినీలవిహాయసవీధి యందు లగ్నము కావలయును. హైందవ భావాంబరమున సామాన్య విహంగములే కాక, రాజహంసలు కూడ సమానస్వేచ్ఛతో విహరించును. అందుచే విమర్శకులకు సంస్కృతవాఙ్మయమున తత్త్వగర్భితమగు కవిత్వము విశేషముగా కానరాదు. ఆంగ్లవాఙ్మయానుకరణమున వెలసిన నవీన వ్యంగకవిత్వ మిట్టిది. ప్రాచీన సంస్కృత కవిత్వము భావ, వస్తురచనాకళల త్రివేణీ సంగమము. ఇది తత్త్వమునకు వ్యతిరిక్తమైనది. ప్రపంచము మిథ్య యని ప్రకటించు నుపనిషత్తులు కూడ నొక నిశితాచరణ విధానము ననుసరించి, యనంతము నొక పరిమితి యందును, రూపరాహిత్యమును రూపమునందును ప్రతిపాదించుటకుఁ బరిశ్రమించినవి.

కాని మన కవీశ్వరు లందరిలో నొక్క కాళిదాసునకు మాత్రమే యిట్టి వివిధములగు హైందవ మనఃప్రవృత్తి నత్యుత్తమ కళాసౌందర్య సమైక్యతతో సముద్దీపింపఁజేయు సామర్థ్యము కలదు. బహుముఖీనము లగు శాస్త్రపాండిత్యముగల హైందవకవులలో నగ్రతస్సగుఁడగు నీకవికులసార్వభౌముఁడు, మన సంప్రదాయములను, భావములను, దివ్యగాథలను నైతిహ్యములను, ఇవి, యవి యన నేల? యల్పము, ననల్పము, నుదాత్తము, ననుదాత్తమునగు ననేక విషయములను తన మంత్రదండమును బోలిన లేఖినితో, తన కవిత్వ స్వభావమునకు ప్రతి గల్పించుకొని వర్ణించున ట్లాదేశించును. అతని యత్యంచిత మధుర లేఖినీ సంస్పర్శమునకే యెట్టి ప్రాకృత విషయమును, ధీరగంభీర శృంగార రసముగ పరివర్తించును; అత్యల్ప విషయమును జిత్ర శోభలు తెగజిమ్మును; దివ్య విషయములు ప్రాపంచిక విభూతి మాధుర్యములను సముపార్జించుకొనును. కేవల శృంగార రాంశములు శక్తిమంతములై కాంతులీనును. అతని కావ్యములు నిక్కముగ వినూత్న కాంతి పుంజము తెగజిమ్ము దివ్యశ్లోకములు. ఆ శ్లోకములు, భూ, జల, విభాగముల కపూర్వములైనవి కావు. నిత్యము మనము సందర్శించు సుపరిచిత కాంతి పూరములే; సౌందర్య పరివర్తనమున విరాజిల్లును. ఈ పరివర్తనము కేవలము పరివర్తనమే కాదు. సూర్యకిరణనిహిత దివ్యకాంతియే ఇది. అదియు మానవ సంబంధము గల మహిత కాంతియే; మనకు మిక్కిలి సుపరిచితమే కాని కవీశ్వరుఁడు గమనించి స్పష్టపరచినప్పుడు మనము తెలిసికొని యానందింతుము. మానవ హృదయ నిహిత విజ్ఞాన పరంజ్యోతియే భాస్కర ప్రకాశ రూపమున సంవర్తితమగును. అదియే హైందవ భావనాస్వర్గ ధామము. అది ప్రతి హైందవ కావ్యమును నిట్టి దివ్య నికేతనముగాఁ జేసికొని విరాజిల్లుచుండును. క్రూరమృగరాజము సరసనే యమాయిక కురంగరాజమునకుఁగూడ కునుకుపట్టించు స్వర్లోక మొక్క హైందవకవిత్వమునందే కాంచనగును.

కాళిదాసు కావ్యగత వ్యక్తులు విశేషముగా దేవతలో, దేవతాతుల్యులో, ఖేచరులో!! కాని వీరు దివ్య గాంభీర్య లక్షణోపేతులుగ వర్తించుచునే, మానవానుభవస్థాయికి గొనిరాబడుదురు. వారి భాషణము, వారి యాలోచన, వారియుద్రేకము మానవ సంబంధములే కాని యన్యములు కావు. ఇట్టి కారణముచేతనే, కవియు, నంతర్దృష్టిగల విమర్శకుఁడును నగు "బంకిం చంద్రఛటర్జీ" "కుమారసంభవ" మహాకావ్యమును, "పేరడైజ్ లాస్టు" మహాకావ్యము కన్న మిన్నయని

నాఁడు. ఈ రెండు మహాకావ్యములు నొకే సారస్వత ప్రక్రియకుఁ జేరినవనియు, నుదాత్త విషయాన్వితమై, చక్కని ప్రణాళిక కల్గి, భావపరిపక్వమైన కవితా శైలితో నొప్పారుచున్నవని యాతని నిశ్చయమే. కాని ఈ హైందవ కవిత్వమున, హృదయ ద్రవీకరణ శక్తి యత్కించిత్ న్యూనమైనను, మానవనిరాడంబర జీవిత మాధుర్యానుభవము లత్యల్పములుగా నిందుఁ బరిపోషితములు. "పెరడైజ్ లాస్టు" వంటి పరిపోషణలను తులనాత్మకముగా జూచిన తక్కువయే యగునను, నేనిప్పుడు ప్రసంగించు నీ మానవత్వము, 'హోమరు' కవీశ్వరుడు నిరూపించిన స్వభావవాదము కాదు. హోమరు ప్రదర్శించిన దేవతావ్యక్తులలో సుదాత్తతగాని వికారాత్మతగాని మృగ్యము. వ్యక్తులందుకన్న, నాయా పరిసరములయందును, సన్నివేశములయందును నీ రెండు లక్షణములను మిన్నగా గన్పడును. కాని కాళిదాసుని దేవతావ్యక్తులు తత్తుల్యులైనవారు మానవ స్థాయికి దిగింపబడినను, వారి వారి దివ్యలక్షణములను గోల్పోవలేదు. ఇందుల కత్యుత్తమ నిదర్శనము 'మేఘ సందేశము' ఈ రెండు సంస్కృత కావ్యములందలి వ్యక్తుల వంటి వ్యక్తులను 'షెల్లీ' కూడ కల్పించవచ్చును. వారిరువురు ప్రేమికులు. వారిది నదీపర్వత జలధర దేవతా పరివృతమగు స్వర్గధామము కావచ్చును. కాని మేఘదూతమందలి లక్ష్యము, శివజటాజూటస్థిత చంద్ర చంద్రికాస్నాతమై, మహేంద్రపర్వత నివాస ప్రమోదగిరి పరివృతమై, ద్యోతితమయముగా గోచరించు నలకాపట్టణమునకుఁ జేరుట. మేఘారూఢమైన విహంగావలోకనమునందువలె సమస్త ప్రకృతియు నిందు సమీక్షింపబడును. షెల్లీకవికూడ నిట్లే వర్ణించెను. కాని మేఘసందేశ వర్ణనలలోని సుస్పష్టత యిందు శూన్యము. అంతేకాక మన మానసమును ప్రేరేచి, తను రీతి తృప్తిపఱుపక గందరగోళపఱుచును. 'క్వీన్ మాబ్' 'ప్రొమిథియస్ అన్ బౌండ్' 'విచ్ ఆఫ్ అట్లాస్' మున్నగు 'షెల్లీ' కృతులలోని వ్యక్తులు, దృశ్యములును నీ శ్రేణికి జెందినవి. కాని కాళిదాసు చిత్రించిన పురము తుషారావృతమై దృశ్యాదృశ్యముగ నుండునది కాదు. అలకాపట్టణ మాతని సౌందర్య వైభవోపేతమగు నుజ్జయినీనగరముయొక్క యాదర్శీకరణమే. అందలి మర్త్యవిషయములు పరిహరింపబడినవి. హైందవునకు సహజమగురీతిని, కాళిదాసు ఆదర్శమును సుపరిచిత, భౌతిక ప్రపంచస్థాయికిఁ బరివర్తించెను. తన పుణ్య ఫలమొకింత కొఱవడగా, నమరులు భూమి కరుదెంచు నపుడు, శేషపుణ్యమున నొకింతయుక, స్వర్గమును తమ వెంట దెచ్చిరా యనునట్లుగా నలక యొప్పుచుండును. సారసమదకలకూజితసాంద్ర సమాకర్షణమై, సుఖాతిశయకారణమై యలక యుండెను. చాటూక్తులతో నూరించు వయస్యనివలె, సుమనస్సులలో శీతలసమీరము, సురతాంత తాంతి నపనయించుచు వీచును. ఆపుర మందలి హర్మ్యములు, లలనాపదరాగాంకితమై, సుమగంధముల నెగజిమ్మును. ఏవంవిధవర్ణన లెంత హృదయంగమములు! ఎంత మానవ సన్నిహితములు!! ఎంత సాధారణములు!! ఇట్టి వర్ణనలు పఠించునపుడు మనయొక్క సౌందర్యధామమునకు సన్నిహితముగా నున్నట్లు, లేదా తాదాత్మ్యమును బొందినట్లుండును. ఇందలి వివిధ జీవజాలము మన భావనకు క్రీడావస్తువుల వంటివి కావు. ఇవి నీరస నిత్యనైమిత్తిక ప్రపంచము నుండి మనల నొక యానంద ప్రపంచమునకు తరలించును. కాళిదాసుపట్ల భారతీయుల కానందోత్సాహము లిప్పటికిని తఱుగకుండుటకు కారణ మాతని కవిత్వములోఁగల ఈ యాకర్షణమే. ఆతని శ్లోక మొక్కటి పఠించినంతనే; మన పరిసరములు, జీవితము, మనల ననుసరించెడి మానవ పశుసంబంధమగు భూతజాలమే కాక, మనము మాచెడి యచేతనములు సైతము, హఠాత్తుగా సౌందర్యసముజ్జ్వలములై, యపూర్వముకన్న నాత్మీయముగా కనిపించును. మన హృదయప్రవృత్తి మృగశకుంతసంతానములను గూర్చి ప్రసరించును. పాదపములు, తమ శాఖాభుజముల హస్తములతో సమీపమున కాహ్వానించును. నిరర్థకములగు మేఘములు, జ్ఞానహీనములగు పర్వతములు నారీతిగా కాక, స్నేహభావయుత వార్తావాహులుగా నుండి, మన హృదయములను పలకరించును. మన సామాన్య భావములు, ననుభూతులు, భావోద్రేకములు గణనీయములై సౌందర్యభరితములగును. అనంతర మిట్టి యానందోత్సాహాతిశయములతోడను, జీవిత ప్రేమ పరిజ్ఞానముతోడను; నీ సకలసౌందర్య సముద్దీపిత వస్తుసమూహమునందు నిహితమైన యనంతతత్త్వము సుగ్రాహ్య మొనర్చుకొందుము. అంతే కాదు, ఇఁకనుండి యవి కేవలవిషయములుగా నుండక, యాంతరంగిక ప్రియాస్వరూపములుగా మారును. వాని విరహము నొకింతేని సహింప జాలనిస్థితి యేర్పడును. ఈ భౌతిక ప్రపంచమును దృణీక

రించి, మనమూ రసజగత్తునందే సదా వసింప నాకాంక్షింతుము. ఈరీతిగా సామాన్యదృష్టికి విపరీతముగా గోచరించుచున్నను; హిందూ స్వభావము దిమిచిన ఈయలౌకిక సౌందర్య మార్గమున నింద్రియ సాహాయ్యముతో పయనించి, సచ్చిదానందమూర్తి దివ్యసన్నిధికి జేరగల్గుచున్నాము. మన పూర్వులు యమనియమ విధి నిషేధక్రతు శాసితమైన బుద్ధి మార్గమున శ్రమించి సాధించిన లక్ష్యము నలవోకగా నీ మార్గము మనకు జేకూర్చుచున్నది. హిందూ మానసము రుచిభేదముల ననుసరించి యనేక మార్గముల నన్వేషించినది. అన్నియు నా నిఖిలరసామృతమూర్తి యగు శౌరుని పాదపద్మ సన్నిధానమునకు జేరునవియే. భారత జాతి మానసమును, పురాణ ప్రవచనముల విధానమునందెంత శక్తిమంతముగా కాళిదాసు కవిత్వము మరలింప గల్గినదో! విజ్ఞానప్రపంచమునకు సువిదితము. ఆమహా కవిత్వము భారత జాతిని మాతృదేవ పూజా ధురంధరుల గావించినది. ఏతత్కారణమును బురస్కరించుకొనియే, వాల్మీకి—వ్యాసుల సరసన కాళిదాసుకూడ మనజాతీయ కవిపుంగవుడుగా గౌరవింపబడు నఖ్యాతి నాతడు సంపాదించుకొనెను. అతి క్లిష్ట పరిస్థితియందీ కవీశ్వరుడు, తన దివ్యకవితాశక్తిచే భారత జాతీయ మానసమును పతనోన్ముఖము గానీయక, యవిచ్ఛిన్న సాంప్రదాయిక విజ్ఞానపరిస్తుత మహాప్రస్థానమును గావింపజేసెను.

ఈమార్గమునే కాళిదాసు తన కవితాకళా సౌందర్య గరిమతో జయప్రదముగా 'ఊర్వశి' రూపకమున రూపొందించెను. అప్సరస లత్యద్భుత సౌందర్యభాములని, స్వర్గలోకవాసులని హైందవ పురాణము లుద్ఘాటించును. పాలసముద్రమునుండి ప్రభవించిన దేవతలుగా వీరు జ్యోతిర్మయాంబరముల ధరించి, దివ్యాభరణాలంకారములఁ దాల్చి, సహస్రాధికముగ కిన్నెరలనుండి నాదసుధాలహరులఁ బ్రవహింప జేసిరి. వారి సౌందర్యదీప్తి సకలలోకములను కళకళలాడించినవి. సూర్యకిరణజాలమునందు వారు గుమిగూడిరి. స్వర్గసీమలో సౌదామినులతో వారును ప్రకాశించిరి. వినీల విహాయస వీధులలో హాయిగా వారు విహరించిరి. సూర్యోదయ సూర్యాస్తమయములకు వారరుణారుణ సందీప్తిని ప్రసాదించిరి. ఆటవిక మనోహర గానమునందు వారు శ్రుతిగల్పిరి. జీవితాంతరంగమున వారు నివసించిరి. కవులకు, శిల్పులకు, చిత్రకారులకును వారాదర్శప్రాయులైరి. వారి యాలింగన సౌఖ్యానుభూతి, భగవదనుభవానందసిద్ధిని గూడ పతితకొనవర్చినది. ఆనంద జీవితము, సౌందర్య సమృద్ధి, యింద్రియలోలుపత ముఖ్యమగు లక్షణములను ఆధ్యాత్మిక, ఆధిభౌతిక స్వభావము గల హైందవు లప్సరసలలో నారోపించిరి. ఈపద మపయోగింపఁబడి నపుడెల్ల యీ యర్థము స్ఫురించుచుండును. ప్రాచీన పురాణగాథలయందీ యప్సరసల విషయము వినిపించును. అందును బ్రాహ్మణములయందు, విష్ణుపురాణమునందును గల యాగ్నృతమగు పురూరవుని గాథలో నీ యప్సరసలపాత్ర యపూర్వమైనది.

తరువాతి కొంతకాలమునకు భౌతికప్రపంచమున సుప్రసిద్ధమగు పద మొకటి, శృంగార భావసూచకముగా కావలసి వచ్చినది. గణికలను నొకవర్గ మేర్పడినది.

గ్రీకు సంఘమునందువలె, హైందవ సంఘము నందును నీ గణికాశ్రేణికిఁగొంత ప్రాముఖ్య మేర్పడినది. గ్రీకు గణికలకు గ్రీకు సంఘముపైనున్నంత ప్రభావము, హైందవ గణికలకు హైందవులపై కానరాదు.

గ్రీకు గణికలవలె హిందూ గణికలుకూడ చక్కని విద్యాపాటవము గల్గిన నాగరకులే. కాని వీరికి, వారికివలె కుటుంబినులపై నెట్టి యాధిక్యతయును లేదు. ఎలయన మహమ్మదీయ యుగమునకుఁ బూర్వము గౌరవాస్పదులైన స్త్రీలందఱు, 'ఎథీనియన్' మహిళలవలె విద్యావిహీనలైన గృహిణులు కారు. పురుషులవలె ప్రత్యేకముగా విద్యాసంస్థలలో శిక్షణము నందుకొన్నను, భారతీయ మహిళలు, విద్యావతులనియే యొన్నబడుదురు. జననీ జనకులు వీరికి సాధారణ సంస్కృతి పరిజ్ఞానమును గఱపిరి. అట్లు వీలుపడనిచో విద్వాంసులను తమ గృహముల కాహ్వానించి, వీరు తమ దుహితలను సంగీత సాహిత్యములయందు; చిత్రలేఖన, శిల్ప, భరత నాట్యాదులయందును నిపుణలను గావించుచుండిరి. నీతిశాస్త్ర పరిజ్ఞానమును, శాస్త్రమర్యాదలును, వీరి కవశ్యము నేర్పఁబడెను. ఇందును నుత్తమ వంశ సంజాతులు, ధనాధిక్యతయున్నచో కన్యలుగానో, పూర్వ సువాసినులుగనో, వేదాంత వాసనాశోభితు లయ్యెడివారు. కాని బౌద్ధ యుగమునకుఁ బూర్వ మిట్టి యుదాహరణములు విశేషముగా గన్పించవు. సామాన్య హైందవులకు, నారీ ప్రపంచ

మంతయు గృహసీమయందే యిమిడి యున్నదని భావించును. భర్త జీవితమునందు తాదాత్మ్యమొందనిచో, భార్య జీవితము సమగ్రము గాదని యామె నిశ్చయము. ఎట్లయినను, కులవధూ శాస్త్ర కళోపాసనము పారము ముట్టలేదనవలయును. కాని గణికావర్గమొక వృత్తిగా సమస్త శాస్త్ర కళాభ్యాసమును గావించెను. అందుచే వారు తమ నిత్యకృత్యముగా దేవాలయములయందు నాట్యప్రదర్శనము గావించుచున్నను, పట్టాభిషేకాది విశేష సమయములయందును, పర్వదినములయందును వారు సభావేదికలపై తమ కళావైదుష్యము నంతయు సమగ్రముగ సాక్షాత్కరింపజేయుచుండిరి. అందుచే సున్నత వర్గమునకుఁ జెందిన రసికులు, ధనసంపన్నులు, నొకవంక వర్ధాంగులతోఁ గాపురము చేయుచునే, బాహాటముగా నీగణికలతో రంజిల్లుచు, ద్వంద్వజీవితములను నిర్వహించిరి. గణికావర్గమునకు సంఘమునందెట్టి హైన్యమును లేదు. వీరు నీతిహీనులగు దొమ్మరివారివంటివారు కారు. సాంఘిక నియమములు సడలినప్పుడీ గణికావర్గమునందును ననేకులు నీతిబాహ్యులై కాముక ప్రవృత్తితో సంచరించిన మాట వాస్తవము. కాని యిది సహజముగా నేర్పడిన పతనావస్థ. అయినను సున్నత వైజ్ఞానిక స్థాయియందున్న వారుకూడ వీరిలో నొకవంక లేకపోలేదు. తమ కామప్రవృత్తియందు స్వాతంత్ర్యము నభిలషించి నీచవారకాంతగా జీవించుట కిష్టపడని యట్టివారికి 'మృచ్ఛకటిక' రూపకమందలి 'వసంతసేన' ప్రాతినిధ్యము వహించును. ఈమెవంటి గణికలనేకులు తమకు సరియైన ప్రియులనెన్నుకొనుపట్ల పలువురను బరీక్షించియుందురు. కాని వారి మానసమొకసారి స్థిరపడెనేని, తాము వలచిన ప్రియుల భార్యల సమాధానమును బడసియే వీరు ధర్మపత్నీత్వమును స్వీకరింపఁగలరు. ఇట్టి వారకాంతలు, ఉన్నత నీచ స్థాయిలో నిన్నమొన్నటివఱకును వర్ధిల్లిరి. పాశ్చాత్య నాగరికతా ప్రాబల్యము బలసినకొలఁది, యీ వర్గము క్రమక్రమముగ నంతరింపసాగెను. వారి స్థానమున వ్యభిచారవృత్తిచే జీవించునొక నూత్నవర్గము తలయెత్తెను. కాలపరిణామమున నేర్పడిన ఈ దుస్థితిని సంఘసంస్కారకరవాలముచే ఖండింప జాలుటంత సమర్థము కాదు.

కావున నప్సరసలు స్వర్గలోక గణికా సమూహము. వీరు నాట్యవిద్యా ప్రవీణలు. సంగీత కళా నిపుణలు. రాక్షసుల విధ్వంసక చర్యలనుండి తమ్ము తాము కాపాడుకొను ప్రయత్నముచే విసిగి వేసారెడి దేవతాకోటి నీగణికాకోటి తమ నాట్యకళా సంపత్తిచే నానందపఱుచును. ఈ గణికలు తమ్ము చేపట్టువారెవరని సముద్రమునుండి యుద్భవించిరని వాల్మీకి కథనము. దేవతలుకాని, రాక్షసులుగాని వీరిని స్వీకరించుట కిచ్చగింపరైరి. అందుచే వీరందఱికిని జెందినవారైరఁట. అప్సరసయేల స్వర్గలోకపు గణికగా పరిగణింపబడెను? ఇంద్రియ వికార ప్రాబల్యమునకు, నాకర్షణకు నీ గణిక ప్రాతినిధ్యము వహించును. అవినీతి ప్రబలి, దైవచింత తఱిగినపుడు కామము తన యింద్రియ సైనిక సాహాయ్యముతో రాజ్యమేలును. అట్టి కామశక్తిని తృప్తిపరచుటకు స్వేచ్ఛ కావలయును.

కావున నింద్రియసౌఖ్యానుభూతికి ప్రపంచమున గణిక యెంత యవసరమో దీనినిబట్టి తెలియుచున్నది. ఏలయన, నప్సరస సౌందర్యాకర్షణము మానసవీధిని మసలుచున్నపు డది మఱింత ప్రబలమై సంచలనత్వమును గల్గించును. ఆ సంచలనత్వము సఫలమగువఱకు యితరాలోచనలు, కార్యములు కొనసాగవు. దీని నదుపులోనికి తెచ్చుట దుస్సాధ్యము. ఈ సౌందర్యాకర్షణము మనల నవినీతిపరులను జేయవలెనని యూహింపగు. కాని యెట్టి నైతిక పరీక్షల నిది యంగీకరింపదు. ఎట్టి ధర్మము నిది పాటించదు. ఆకాంక్షా సాఫల్యమే దానిపరమలక్ష్యము. గణికాతత్త్వమేయిది. నగ్నచిత్రము, నగ్నశిల్పము నీతి విరహితమైనవి కావు. సౌందర్య ప్రపంచము ముఖ్యముగా నగ్నముగనే యుండును. వస్త్రధారణ మప్పుడప్పు డుపయోగించు నొక యలంకరణము మాత్రమే. ఈ రెండును బరస్పర విరుద్ధములనఁ జాలవు కాని, ఈ రెంటికి నంత సన్నిహిత సంబంధముకూడ నున్నదని యూహింపరాదు. సమస్త కళలయాశయములు నప్సరసలో నిమిడియున్నవి. ఆమె యాటకత్తె. గాయని, చిత్రలేఖిని. సురాసురు లెవ్వరును వీరిని భార్యలుగా చేపట్టలేదు. అందుచే వీరందఱిని నానందపఱుచువారైరి. మానవునిలో గల నిర్మాణాత్మక శక్తులుగాని, విధ్వంసక శక్తులుగాని యింద్రియ సంబంధమగు నానందమును శాశ్వతముగా నవసరమని గుర్తింపలేదు. లేక యట్టియానందము తమ యాదర్శసాధన కంతరాయమని భావించి యుండెవచ్చును. అందుచే నా యానందము తాత్కాలికముగనే పరిగణింపఁబడెను. ఇట్లుండ కొందఱకు కేవలమీ విషయసౌఖ్యమే పరమావధియైనది. నిత్య జీవితాదర్శ సాధనమునందు నీరసులై, యీ యనుభూతియే యుత్తమమని యింక కొందరు భావించిరి. ఇట్లెందరు చాంచల్యమును బొందినను, ననేకులు, మానవ పరిణామ విధానమునఁ బ్రశంసనీయులై, యవికారము, నచంచలము, నవనవోన్మేషము నగు నాంతరంగిక శక్తితోఁ దమ యాదర్శముల సాధనమునందే సంతతము నిమగ్నులయిరి. అన్ని విధముల దేవలోకమందలి యప్సరసకుఁ బ్రతినిధిగా భూలోకమున గణిక గణింపఁ దగినది. ఇట్టి యప్సరసా ప్రతిరూపము

చేర్పఱుచుకొని హైందవవేష తిరిగి, యింకొక్క మారు తన యతిలోక సృజనాశక్తిని ప్రదర్శించినది. ఈ విషయమున గ్రీకులు చూపిన దోషరహితము, ప్రశంసార్హమునైన నైపుణ్యమును, చాతుర్యమును హైందవులు మరింత విశిష్టముగ చూపగల్గిరి.

ఊర్వశి సృష్టినిగూర్చి కొంత సమ్ముటించుకొందుము. బ్రహ్మజ్ఞాన ప్రతిష్ఠితమైన మానస మెప్పుడైన లేని దివ్యశక్తి ప్రభావముచే నింద్రియాధీనమైన భౌతిక జీవితమును గూడ రసమయ మొనర్పవచ్చును. ఏలయన వేదాంతాదర్శములు తమ ప్రాభవమును కేవలము మేధపై మాత్రమే ప్రసరింపఁజేసి యూరకుండవు. అవి మానవుని లౌకిక జీవితముపైనను విస్తరించును. అవి మానవుని రసానంద దృక్పథము నేర్పఱుచును. అప్పుడా యింద్రియలోకము సౌందర్యభరితమైనను; దివ్యకాంతి సముజ్జ్వలమైనను; దివ్యాత్మభావ సముత్సుకతతో, మానవాదర్శములను, విస్తృత మనశ్చము, సర్వులను గాఢముగా నాకర్షించును. యమనియమ సాధనలచే కృశించిన మహర్షి యూరువులనుండి జనించిన యూర్వశియే పాలసముద్ర తరంగములనుండి ప్రభవించిన యప్సరసలకుఁ దలమానికమై, సౌందర్యసౌదామినియై యప్సరసలందఱియందును, తాపసులకు నుండెగాక యైనది.

* * *

నాటకనిర్మాణమునకును, సంస్కృతాంధ్రములకును నీయూర్వశీ గాథ యొకరమణీయమగు సృష్టి. ఇంతియెగాక యూర్వశీ దివ్యత్వము, ఆ దేవవనితలో నిహితమైయున్న నారీస్వభావము విశ్వవ్యాపితము కాలేదు. ప్రాచీన, పౌరాణిక గాథపట్ల నెట్టి నిపుణతతో మెలగవలయునో సమగ్రముగ నెఱిగిన నెఱజాణ కాళిదాసు. మనమీ యూర్వశినిగూర్చి విశేషపరిజ్ఞానమును బడయవలయు ననియు; ఆమె యతిలోకసౌందర్యాతిశయము రూపకమునందంతటను బరివ్యాప్తము కావలయుననియు, ఆమె సంభాషణలయందొక నూత్నవైభవము, ఆమె నాట్యభంగిమయందొకింత ఘనత, ఆమెను సామాన్యాప్సరసనుండి వేఱుపఱుచు దివ్యత్వము, అడుగడుగునం బొడగట్టవలయునని మనమాకాంక్షింతుము. కాని కాళిదాసు ఊర్వశీదివ్యత్వ ఘనతల నేమాత్రము కానలయునని పొడగట్టనీయలేదు. ఇది కాళిదాసు నిర్దుష్ట నిరుపమకళానైపుణ్యమని నా యభిప్రాయము. అతని నాటకీయ మనస్తత్వ పరిజ్ఞాన మట్టిది. ఊర్వశీ పురూరవులను సమానముగ, నాటకోచితముగ నీతఁడు తీర్చిదిద్దెను. ఇరువురును భావనయందును లక్ష్యమునందును సమానులు కారు. ఇరువురిని కవితాకళావైభవముతో నాడంబరముగాఁ బ్రదర్శించినచో నాటకాభిరుచియు, రసికతయు నిస్సారముగా నుండెడివి. ఆ వైభవము, నామనోహర సంభాషణము లతిమధురములై జగటుగొల్పెడివి. ఇఁక మానస తత్త్వము ననుసరించి పరికించిన ఊర్వశీ దివ్యత్వము, విశ్వజనీన సౌందర్యాకర్షణము, సంభాషణాడంబరత్వమునందును, దివ్యవైభవమునందును, నిరూపింప ప్రయత్నించినచో నవి శోభించెడివి కావు. సమగ్ర సౌందర్యమునకు ద్వైవిధ్యములు కలవు. గాని సహజసౌందర్య సంపద యొకటి. ఇతరులపై స్వకీయ సౌందర్య ముద్రణము వేయదది. మొదటిది నిరాడంబరమైనది. నిరలంకారమైనది. వ్యక్తిత్వ విరహితమైనది. నిరాడంబరము నొక చిత్రముకాని, శిల్పముకాని, సహజశైలీ విశిష్టమై, తత్త్వసమృద్ధిగల్గి, మానవుని కాదర్శప్రాయమై, యమూల్యానంద మాపాదించును. ఆడంబరాలంకరణములు, అంతరంగిక దివ్యతేజఃపుంజము నతిక్రమించును, అప్రతిహతము నమకారభావమును బ్రకటించును. అంతేకాక, సహజనిరాడంబరోద్యక్త మానసము; సౌందర్యముద్ర నస్పష్టతావహముల రీతిని స్వీకరించి, యందె నిమగ్నమై, నూత్నభావ ముద్రలను బొందును, నిత్యనూతనత్వ శక్తిగల్గి, ఎప్పటికప్పుడు క్రొత్తక్రొత్త భావసంపదల నేర్పరుచుచు, సజీవభావనా విలసితమై వర్తిల్లును. సారస్వత మారంభదశలో కన్యాభావ సౌందర్యముతో కళకళలాడును. అప్పుడప్పుడు వర్ధమానమగు కళా నానందమును బ్రసాదించు నిత్యయౌవనము స్ఫురింపఁ జేయును. సారస్వత చరమదశయందు నిత్యకాలసౌందర్య సంపద సమస్తము లీనమగుటచే, నస్పష్టతావహమగు భావసంపదతో, రసాతిశాయి, శబ్దాతిశాయి యైన కావ్యసృష్టి జరుగును. ఊర్వశీ పురూరవుల కలయిక యిట్టి సారస్వత నియమమునే సూచించుచున్నది. ఊర్వశి స్వచ్ఛంద సౌందర్యరాశి. సకల ప్రపంచాకర్షణశక్తి. సకలానంద ప్రదాయిని. ఆమె కామెయే సాటి. ఆమె కట్టె వాగాడంబరముకాని, మేధాసమగ్రతగాని యవసరములేదు. కాని యూర్వశి, తన సంపూర్ణ పవిత్రరూపమును, దివ్య సౌందర్యాంధకుఁడగు పురూరవుని ప్రఫుల్లమానసమందే విలీనమొనర్చి స్వకీయకాంతి మత్తతచే నాతనిని స్వాధీనపఱుచుకొనిఁ యాత్మీయవైభవ పరివేషమండలమునందే ప్రవర్తింపఁ జేసినది.

# పురపాలకులు

శ్రీ అంగర సూర్యారావు

* * పాత్రలు: గోపాలం, సముద్రం, పోలయ్యా, కంట్రాక్టరు చిన్నయ్యా, రౌడీ కొండయ్యా, నరసయ్యా, వెంకన్న.

స్థలం : మురికి పేటలోని ఖాళీ ప్రదేశం. సమయం : రాత్రి 7 గంటలు కుడి వైపున ఒక లాంతరు స్తంభం వుంది. దూరాన్నుంచి మైక్‌లో ఉపన్యాసం వినిపిస్తోంది. లాంతరు స్తంభం వెనుక నుంచి కంట్రాక్టరు చిన్నయ్యా, రౌడీ కొండయ్యా వస్తారు. చిన్నయ్య పొట్టిచేతుల చొక్కా, కాకీఫాంట్ వేసుకున్నాడు. కురచగా కత్తిరించిన మీసాలు. మనిషి కొంచెం పొట్టిగా వున్నాడు. వయస్సు 40 సంవత్సరాలు. కొండయ్య లావుగా, లావుకు తగిన పొడవుగా వున్నాడు. ముఖం గుండ్రంగా వుంది. నల్లటి మీసం పైకి మెలితిరిగి వుంది. తెల్ల లాల్చీ, గళ్లలుంగీ కట్టాడు. కోపం వచ్చినప్పుడు లాల్చీ చేతులు పైకి ఎత్తుతూవుండడంఅలవాటు. వయస్సు 30 సంవత్సరాలు. ఉపన్యాసం వింటూ మధ్య మధ్య "చూడు, వీడి పొగరు!" అన్నట్లు ఒకరి కేసి ఒకరు చూసుకుంటున్నారు. కొండయ్య కోపంతో చొక్కా చేతులు పైకి ఎత్తుతున్నాడు.

ఉపన్యాసం : ఇప్పటికి ఎంత కాలమయ్యింది? సుమారు పది సంవత్సరాలనుంచీ యీ పురపాలకులే మన పట్టణాన్ని పరిపాలిస్తున్నారు. నగర పారిశుధ్యంలో గాని, రోడ్ల అభివృద్ధిలో గాని ఏమంత మార్పుకూడా రాలేదు. ఇంక ఆహారపదార్థాల విషయం ఆలోచిద్దాం. మన పట్నంలో యీనాడు కల్తీలేని వస్తువు మచ్చుకైనా దొరుకుతున్నదా? పాలలో కల్తీ, పంచదారలో కల్తీ, గోధుమపిండిలో కల్తీ, నెయ్యిలో కల్తీ, నూనెలో కల్తీ—కల్తీ లేని వస్తువంటూ లేనే లేదు. దీనికి బాధ్యులెవరు? నెలకు వందలకొద్దీ జీతాలు తీసుకునే పట్టణ పారిశుధ్యశాఖవారు ఏమంటారు? ఈ కల్తీవిషయం, ఆహారపదార్థాలవిషయం వారు మాట్లాడరు. పైగా ఈగలు, దోమలు ప్రజాశత్రువులని ప్రచారంచేస్తారు నిజానికి ప్రజాశత్రువు లెవరు? ఈగలు, దోమలూ కంటే ప్రమాదకరమైన వాళ్లెవరు? ప్రజల ఆరోగ్యంమీద వ్యాపారం సాగించేవాళ్ళను ఏం చెయ్యాలో మీరే ఆలోచించండి. అధికార వ్యామోహం స్వార్థం కరడుగట్టిన పురపాలకులను వెంటనే గద్దెనుంచి దింపండి. నిస్వార్థపరులైనవాళ్ళను, ఉత్తములను పురపాలకులుగా ఎన్నుకోండి. నేటి పురపాలనలో పూర్తి మార్పు తీసుకురండి.

[కరతాళధ్వనులమధ్య ఉపన్యాసం ముగిసింది. కొండయ్య కోపం పట్టలేక పిడికిలి బిగించి ముందుకు వస్తాడు.]

కొండయ్య : (కళ్ళెర్రచేసి) సుద్దకు సంపేస్తాను.

చిన్నయ్య : విన్నావు కాదూ! ఆడెంత గొడవ చేస్తన్నాడో! నిన్నగాక మొన్న కళ్ళు తెరిచిన గుంట వెధవ!

కొండ : సిన్నయ్య బాబూ! యిక ఆలోసించకు. నాకు యేదో ఒక ఆర్డరిచ్చేయ్. ఆడిని బుర్రె చితకపొడవమంటావో, కాళ్ళే యిరగ్గొట్ట మంటావో, యేదో వొకటి సెప్పెయ్.

చిన్న : (విచారంతో) ఆడిని ఏంచేస్తే ఏంలాబంరా! యీ పేటలోవాళ్ళంతా ఆడికే సపోట్టు చేస్తున్నారు.

కొండ : అయితే యీ యీది పెద్దల్ని నలుగుర్ని పట్టుకుని యీ పుసాపు సెయ్యమని సెలవా?

చిన్న : అంతదాకా యెందుకులే. మంచిగా లొంగ దియ్యడానికి చూద్దాం. లొంగడు కాదూ? అప్పుడు మరో మార్గం ఉండనే వుంది. (కోపంతో) కంట్రాక్టర్ చిన్నయ్యంటే కొమ్ములుతిరిగినోళ్లకి కూడా హడల్!

కొండ : ఇప్పుడు యీ పోటీ సేస్తన్న కుర్రోడు ఏమన్నా డబ్బున్నవోడేనా?

చిన్న : ఆడి తలకాయ! ఆ గోపాలంగాడికి డబ్బూ లేదు. బూడిదీ లేదు. మా మామని పడగొడదామని చూస్తన్నాడు.

కొండ : (తేలిగ్గా) ఆఁ! అదెక్కడిమాటలే సిన్నయ్యా బాబూ! సేరమేను సుబ్బయ్యగారెక్కడ? బొడ్డూడని యీ కుర్రోడెక్కడ?

చిన్న : (రహస్యంగా) లేదురా కొండయ్యా! ఇప్పుడు యువహారం మారిపోయింది. యీ పేటలో వాళ్ళంతా మనకు యెదురుతిరిగేరు.

కొండ : (కోపంతో) ఉఁహుఁ! అలాగా? తిరగనియ్. ఏమాత్రం తిరుగుతారో సూస్తాను.

చిన్న : ఈ యెలక్షనులోగాని మా మావ వోడిపోతే నేనూ, నాతోపాటు నువ్వూ కూడా ఒకమూల కూచ్చోవలిసిందే.

కొండ : (బిగ్గరగా) ఒహో! అలాగా! మీ మావయ్యగారికి ఎవడైనా ఎదురుతిరిగేడో, ఆడి గుండెల్లో యీ కొండయ్యగాడు నిద్రపోయేడన్నమాటే! యీ పేటలో రక్తాలు యేరులు కట్టిస్తాను.

చిన్న : (దృఢ నిశ్చయంతో) ఆరు నూరైనా, నూరు ఆరైనా యీ ఎలక్షన్లో మా మావ గెలిసి తీరాలి.

[కుడివైపునుంచి పాట పాడుకుంటూ హుషారుగా పోలయ్య వస్తాడు. పంచెకట్టు, తలపాగా—మధ్య వయస్సులో వున్నాడు]

పోల : ఆడి పెళ్లాన్నాడు కొడితే—
యీడి కిందుకోయ్—అహ—
యీడికిందుకోయ్—ఒహో—

కొండ : ఏరోయ్ పోలిగే! ఏటి మావుసారుగా వుంది యవ్వారం? మర్బత్తు పట్టించే వేంటి?

పోల : (పరకాయించి చూసి) ఏరోయ్ కొండిగా! ఒహో! సిన్నయ్య బాబుకూడా వచ్చినాడే!

చిన్న : ఈమధ్య బొత్తిగా కనపడ్డమే మానేసేవేంరా పోలయ్యా?

పోల : మీ కంట్రాక్టు పనులులోకి మమ్మల్ని పిలిపించితే కాదూ కనపడ్డానికి—యీ సంకేళ యిలావచ్చినావేం సిన్నయ్య బాబూ?

చిన్న : ఆఁ! యేంలేదులే! యీ పేటకి సిమెంటు రోడ్డు సాంక్షను అయ్యింది. కొలతలు చూసుకుందామని వొచ్చాను.

పోల : సాలు సాల్లేవయ్యా సిన్నయ్యా! యిలాంటి మాయలమారి కబుర్లకి మోసపోయీవోడెవడూ యీ పల్లపు యీదిలో లేడు.

కొండ : ఏరోయ్ పోలిగే! తల తిరుగుతుందేంటి?

పోల : (కోపంతో) ఈ యీదోళ్లు తెలుసుకున్నారంటే నీలాంటి యెదవలికి మెళ్ళుకూడా తిరుగుతాయి.

కొండ : (కోపంతో లాల్చీచేతులు పైకిఎత్తి) ఒరేయ్, అదేదో నేనూ సూత్తానుగా! యీ యీదిలో...

చిన్న : (మధ్యలో అందుకొని) ఒరేయ్ కొండయ్యా వూరుకో (పోలయ్యతో) నిచ్చేపంగా రోడ్డేయిస్తామంటే 'మాయ' అంటావేరా పోలయ్యా?

పోల : (కోపంతో) పోయిన ఎలక్షన్లకి మీ పెద్ద మణుసులంతా ఏంజేసేరయ్యా? రోడ్డు

ఏయిస్తున్నాం అన్నారు. ఈ యీదిలో కంకరగుట్టలుకూడా పోయించినారు. ఎలక్షనయిన మరసటిరోజు కంకరగుట్ట కనపడితే వొట్టు. సివరికి మోకాలులోతు బురదలోద్దే మాకు గతయ్యింది. మరి దీన్ని మాయగాక పోతే యేమంటారయ్యా?

చిన్న : పోయినతపవ ఏదో పొరబాటు జరిగివుంటాదిలే. యీమాటు నేను బల్లగుద్ది సెప్తున్నాను. మీ యీదికి సిమెంటురోడ్డు పడిపోవలిసిందే. యింక యీ చిన్నయ్య మాటకు తిరుగు లేదు.

పోల : అదీ సూత్తాంగా! తొందం రెందుకూ?

చిన్న : (మంచిచేసుకునే ధోరణిలో) చూడు పోలయ్యా, యీ పేటలో సముద్రంగాడి మాటకి, నీమాటకి యెవడూ యెదురుచెప్పడు. రేపటి ఎలక్షనులో మీ పేటలోని వోట్లన్నీ సర్దార్ సుబ్బయ్యగారి కేయించాలి.

పోల : సుబ్బయ్యగారు పదేళ్లనుంచి సేరుమేనుగా వున్నారుగందా, ఆయన సేయించిన మంచి పని ఒకటి సెప్పండి. కితం యెలక్షన్లకి రావడమే రావడం. మళ్లా యీ పేట మొకం అయినా ఆయన సూసేరూ?

చిన్న : మంచిపనులు చెయ్యాలంటే కొత్త పన్నులెయ్యాలి. పన్నులేస్తే నువ్వూరుకుంటావా? ఆయన మీ పేట చూడ్డానికి రావడం లేదంటావా? ఆయనకి ఎన్నిపనులు? ఎన్ని యావహారాలు? తీరుబడి వుండొద్దూ! పాపం!

పోల : ఇంకమీదటనుంచి ఆయన కంతా తీరుబడే వుంటదిలెండి!

కొండ : (యింత వరకూ మీసం మెలితిప్పుతూ నుంచున్న వాడు ఒక్కసారిగా ముందుకు వచ్చి) ఏరోయ్! యవ్వారం యెటకారంగా వుంది. సుబ్బయ్యగారికి యెందుకు తీరుబడిగా వుంటాదో సెప్పు?

పోల : ఎలక్షన్లో వోడిపోయి యింట్లో కూకుంటే తీరుబాటుగా వుండక యేమౌతాదిరా కొండిగా!

చిన్న : (కోపంతో) ఏరోయ్ పోలయ్యా! మంచిగా మాటాడేకొద్దీ చెట్టెక్కుతున్నావ్? జాగర్త!

కొండ : (కోపంతో బిగ్గరగా) ఒరేయ్! యీ పేటలో యెవడన్నా సరే! సర్దార్ సుబ్బయ్యగారికి యెదురు తిరిగేడో ఆడితలకాయ తీసేసి సన్నమాటే! యీ పేటలో రక్తాలు కాలవలు కట్టించకపోతే (మీసం మీద చెయ్యేసి) యీడు కొండయ్యే కాడు.

[చిన్నయ్య కొండయ్యను చెయ్యి పట్టుకొని బలవంతంగా ఎడమవైపు తీసుకుపోతాడు— కుడివైపునుంచి తొందరగా వెంకన్న వస్తాడు అతని రెండు చేతులలోను రెండుపాలచెంబులు వున్నాయ్. ఆశ్చర్యంతో నోరు తెరచి చూస్తూవుంటాడు].

పోల : (వాళ్లిద్దరూ పోతున్న వైపుచూస్తూ) పెళ్లి చేసుకునేవోడికంటె పెట్టెలుమోసే వోళ్లకి సంద డెక్కువంట! కిరాయియెదవ!

వెంకన్న : ఏటిరా కొండిగాడు తెగమిడిసిపడతన్నాడు?

పోల : (వనక్కి తిరిగి) ఆఁ! యేంవుంది? మళ్ళి మన పేణానికి ఎలక్షన్లొచ్చినియ్ కాదూ!

వెంకన్న : అవుననుకో! ఎలక్షన్లొస్తే మన కొండిగాడికేం పోయేకాలం? దూడపోయిన ఆవులాగ తెగ అరుస్తున్నాడు.

పోల : మరి ఆడికి గాకపోతే యింకెవడికి? వూళ్లో పెళ్ళికి అడావిడంతా కుక్కలకే!

వెంకన్న : సుబ్బయ్యగారికి యీ మాటు గట్టిపోటే తగిలి నట్టుందే!

పోల : పోటేఅంటే పోటేయా? యీ దెబ్బతో సుబ్బయ్యగారు సిత్తయిపోవలిసిందే!

వెంకన్న : గోపాళంగారు గెలిస్తే మన నెత్తికేమయినా యెత్తుతాడా? సుబ్బయ్య యెత్తకపోతాడా? యెవళ్లయినా ఒకటేరా బాబా! ఎలక్షన్లో గెలిసేదాకా ఎన్ని కబుర్లన్నా సెబుతారు. తరవాత అందరూ ఒకటే!

[కుడివైపునుంచి గోపాలం, సముద్రం మాట్లాడుకుంటూ వస్తారు. గోపాలం వయుస్సు 28 సంవత్సరాలు సన్నంగా, పొడవుగా వున్నాడు. సముద్రం వయస్సు 35 సంవత్సరాలు. లావుగా పొడవుగా వున్నాడు.

లాండ్రో బనీను, పంచెకట్టు, దండలు మెలితిరిగి వున్నాయి.]

సము : పేట పేటంతా ఏకమైనప్పుడు యింక మీకు బయమేముంది గోపాలంబాబూ?

గోపా : నువు చెప్పింది నిజమే! కాని మన ప్రత్యర్థులున్నారే! వాళ్ళకు రకరకాల జిత్తులు తెలుసు. ఎలక్షన్లో గెలిచేందుకు ఎంతటి నీచమైన పనులను చెయ్యడానికైనా వాళ్లు వెనుకాడరు. పోయినసారి ఏం జరిగిందో జ్ఞాపకం చేసుకో! తెల్లవారితే నామినేషన్లు దాఖలు చేసే రోజు. ఆ రాత్రికి రాత్రి పోటీకి నిలబడుతున్న వ్యక్తిని ఎక్కడికో ఎత్తుకుపోయారు. ఫలితం? సుబ్బయ్యగారు పోటీ లేకుండా ఎన్నిక అయ్యారు.

పోల : (ముందుకు వచ్చి) గోపాలంబాబూ! మీరు సాలా జాగర్తగా వుండాలి.

సము : ఒరేయ్ పోలయ్యా! యీ సముద్రంగాడి బొందిలో వూపిరున్నంత కాలం గోపాలం బాబు మీద యీగ వాలదు.

వెంక : ఛ! మనుషుల్ని దాసెయ్యడం—దాగులు కాయడం — అలాంటి సేతిగాని పనులెందుకు?

పోల : ఇప్పుడే కొండిగాడు తెగ అరిసి యెళ్లేడు.

సము : యేం? యేమంటాడు?

పోల : యింకేం అంటాడు, సుబ్బయ్యగారికే వోటెయ్యమంటాడు. యెయ్యకపోతే రకరకాలు కొలువులు కట్టిస్తాడంట!

సము : (కోపంతో) యెదవ! సెణంలో తప్పిపోయేడు. ఆడి సంగతేటో నేను సూద్దును.

గోపా : ఏమోయ్ వెంకన్నా! నీ వోటు ఎవరికి?

వెంక : మా యాపారం సల్లగా సూసినోళ్ళకి యెవరికైనా సరే మా వోటేస్తాం.

సము : యేంటి యెంకన్నమామా! నువ్వు కూడా డొంక తిరుగుడుగా జవాబు చెబుతున్నావ్!

గోపా : నిజాయితీగా వ్యాపారం చేసినంతకాలం నిన్నెవ్వడూ ఏమీ చెయ్యలేడు వెంకన్నా!

పోల : (హేళనగా) మా యెంకన్నమామ దగ్గర నిజాయితీకేం లోటులేదండి. కాకపోతే సాలులో కొంచెం నీళ్లుమాత్రం కలుపుతాడండి.

వెంక : (కోపంతో) ప్రతివోడు పాలలో నీళ్ళు కలుపుతాడనేవోడే కాని యెందుకు కలుపుతున్నాడని ఆలోసించినోడొకడయినా వున్నాడా?

సము : పోనీ నువ్వే సెప్పు ఎందుకు కలుపుతున్నావో! యింటాం.

వెంక : ఒరేయి సముద్రం! పట్టూ, యిడుపూ వుంటే గాని యాపారం సెయ్యలేం. రోజూ యీ వాడు కానిస్టేబు ఇనస్పెక్టరుకి శేరు సెంబరు పాలివ్వాలి.

పోల : సెంబరు పాలేంటి యెంకన్న మామా?

గోపా : అంటే కస్తీ లేని పాలులే!

వెంక : (తన ప్రసంగాన్ని కొనసాగిస్తూ) ఆ శేరు పాలుకి వచ్చిన నష్టం నేనెాగ పూడ్చాలో మీరే చెప్పండి. పాలు కొనుక్కునే మారాజులంతా ఒకటే రేటు యిస్తున్నారయ్యా—అంటే అదీలేదు. ఒకరు శేరుకు రూపాయిస్తారు. మరో మారాజు ముప్పావలాకి పోసుకుంటారు. యింకో ఆసామి పదణాలే యిస్తాడు. శేరుకు రూపాయిచ్చిన మారాజుకు అవును ఆరి ఇంటికే తోలుకెళ్లి పాలు పితికిస్తాను. అందరికి ఒకటే రకం పాలిస్తే నేను నరకంలో పడిపోనూ? (చేతిలోని సెంబులను చూపిస్తూ) శేరు ముప్పావలా పాలు యీ సెంబులో వున్నాయి. శేరు పదణాలపాలు యీ సెంబులో వున్నాయి.

గోపా : (నవ్వుతూ) నీ తర్కం చాలా బాగుంది. కానీ ...ఖచ్చితంగా ఒకటే ధర నిర్ణయించి పాలు అందరికీ ఒకేరకంగా సరఫరా చెయ్యాలి.

వెంక : అలా అయితే నేనింక యాపారం మానేసి అడుక్కుతినాలి.

సము : నీళ్ళుకలిపినపాలు అమ్మకపోతే నీయాపారం యింక సాగదేంటి? డబ్బివ్వనోడికి నీళ్లపాలిచ్చి డబ్బు ఇచ్చినోడికి మంచి పాలిస్తావా?

వెంక : (కోపంతో) 'పాలులో నీళ్లు కలుపుతావ్ - నీళ్లు కలుపుతావ్' అనీ వోడే ప్రతివోడూను. కష్టం, సుకం యాపారం సేసే వోడికి తెలుస్తుంది గాని, కూచుని కబుర్లు సెప్పే వోడికేం

తెలుస్తాది? యింతకీ నేను పాలలో వాలుగు నీళ్లు సుక్కలు కలుపుతున్నానుగాని యిసం కలపటంలేదుగందా!

[కోపంతో బిరబిరా ఎవరుకైపు నిష్క్రమిస్తాడు.]

గోపా : (సముద్రాన్ని, పోలయ్యను ఉద్దేశించి) విన్నారు కదూ. యిదీ పరిస్థితి. శానిటరీ యిన్స్పెక్టరుకు యిచ్చిన పాలఖరీదు సంపాదించేందుకు వెంకన్న పాలలో నీరు కలుపుతున్నాడు. అధికారులకు ఇచ్చిన మామూలు బాపతు సొమ్ము తిరిగి రాబట్టుకునేందుకు కంట్రాక్టరు—మూడు రోజులకే చెడిపోయే రోడ్లు—తయారుచేస్తున్నాడు. ప్రతీ పనిలోను అవినీతి స్వార్థం కనిపిస్తాయి.

సము : మొన్న మార్కెట్టులో మునిసిపాల్టీ యిన్స్పెక్టరుగారు కల్తీ చేసిన నెయ్యి పట్టుకున్నారు. మేం అంతా దగ్గరే వున్నాం. పుస్తకాల్లో రాసుకున్నారు. మమ్మల్ని సాక్షికాలు వేసుకున్నారు. మరి ఆ తరవాత యేం జరిగిందో ఆభగమంతుడికే తెలియాలి. కోర్టుకీ యెల్లలేదు. కేసూలేదు. అసలా వూసేలేదు. ఆ మరసటి రోజునుంచీ ఆ కల్తీచేసిన నెయ్యే సావుకారు అందరికీ అమ్మేసుకున్నాడు.

గోపా : కల్తీ కాఫీ పొడెరు, కల్తీ పాలు పట్టుకోవటం నేను స్వయంగా చూశాను. కాని ఆ కేసులు కోర్టులకి వెళ్లవు. ఆ రాత్రికి రాత్రే కేసు మాఫీ అయిపోతుంది—కల్తీ సరుకుల్ని పట్టుకునే పారిశుధ్య శాఖవారు ప్రజల క్షేమాన్ని కోరి ఆ పనిచేస్తే మన అందరం సంతోషించవచ్చు. కాని అలాజరగడం లేదు. తమ స్వలాభం కోసమే సరుకుల్ని పట్టుకుంటున్నారు.

పోల : మరి మన వూళ్ళో యిన్ని అన్యాయాలు జరుగుతూంటె సేర్ మేను సుబ్బయ్యగారేం చేస్తున్నారు?

గోపా : ఆయనకు పదవి, అధికారం, గౌరవం—మూడూ నిలిస్తే చాలు. ఈ పట్టణ ప్రజలు గంగలో కలిసినా ఆయనకేమీ అభ్యంతరం వుండదు.

సము : (కోపంతో) యీ దెబ్బతో సుబ్బయ్యను రెక్క పట్టుకుని దించెయ్య వలసిందే.

గోపా : పట్టణ పారిశుధ్యానికి ప్రతిసంవత్సరం లక్షల కొద్దీ సొమ్ము కేటాయిస్తున్నారు. కాని ఏం ప్రయోజనం? రోజు రోజుకూ వూళ్లో మురికి పేరుకుపోతోంది.

పోల : పది రోజులకితం మంత్రిగోరొస్తున్నారని మా పేటంతా తెగ వూడిసిపోయినారు బాబూ. ఆ యేళ - నా సామిరంగా-మా యీదంతా అద్దంలాగ సేసేసినారు. మంత్రిగారొచ్చి సాలా బాగుందని సంతోసించి యెల్లిపోనారు. మళ్లా యీనాటిదాకా మా పేటకేసి కన్నెత్తిసూత్తే ఒట్టు.

గోపా : వూరినిండా మురికి, చెత్త, దుర్గంధం, దోమలు, ఈగలు-మన పౌరుల చుట్టూ యీ నాడు నరకాన్ని నిర్మిస్తున్నారు మన పురపాలకులు.

సము : మా రోజులు-ఆ కొన్నిరేర్లకి సీను కుట్టినట్టున్నా లేదు.

పోల : (కోపంతో) మళ్లీ సిగ్గులేకండా-ఎలక్సన్లొచ్చేసరికి-మీ వోటు మాకే అంటూ ముందుకు తోసుకొస్తారు.

గోపా : అధికార వ్యామోహం, స్వార్థం లేకపోతే ప్రతిసారీ ఆ కొన్నిలల్లె ఎలక్షన్లలో ఎందుకు నిలబడాలి? పట్టణాన్ని ఎందుకు తగల బెట్టాలి? స్వార్థంలేనివాళ్లకు—కేవలం వలంటీర్లుగా ప్రజాసేవచేసే కొత్తవాళ్లకు అవకాశం ఇవ్వమనండి.

సము : అల్లిచ్చేదెంటి గోపాళం బాబూ! అల్లని గప్‌చిప్‌గా ఇళ్లకు పంపించెయ్యడమే. (తెరలో పెద్ద నినాదాలు వినిపిస్తాయి, "స్వతంత్ర భారత్ కి జై!" — "సర్దార్ సుబ్బయ్య జిందాబాద్" — "మీ వోటెవరికి—సుబ్బయ్యకు" — "మనవూరు బాగుపడాలంటే మీవోటు-సుబ్బయ్యకే." స్లోగన్లు దూరంగా పోయి గాలిలో కలిసిపోతాయి.)

పోల : ఆకలేసేవోళ్లకి రోజుకి రెండురూపాయలు కూలిస్తున్నారు బాబూ! ఈ యవ్వారం

అంతా సిన్నయ్య కంట్రాక్టరే నూత్తున్నాడు.

సము : మీరేం అదయిర్యం పడొద్దు గోపాళం బాబూ! ఆకళలేసేవోళ్లి వోట్లు కూడా మనయ్యే!

[ఎడమవైపునుంచి ముందు నరసయ్యా వెనుక చిన్నయ్యా కొండయ్యావస్తారు. కొండయ్యను చూడగానే సముద్రం మీసంమీద చెయ్యి చేస్తాడు. నరసయ్యలావుగా, పొట్టిగా వున్నాడు. ఖరీదైన కోటు, జరీపంచె, తల పాగ షోగ్గా కత్తిరించిన మీసం, వేళ్లకు రివ్వల ఉంగరాలు- చూడగానే పెద్ద వర్తకుడని తెలుస్తుంది. చిన్నయ్యా, కొండయ్యా ఎడమ చివరనిలబడతారు]

నర : (గోపాలాన్ని సమీపించి) గోపాలంగారూ మీతో కొంచెం మాట్లాడాలి.

గోపా : (ఆశ్చర్యంతో) నాతోనా?

నర : అవునబ్బాయ్. నీతోనే.

చిన్న : (కొండయ్యతో) ఒరేయి కొండయ్యా! ఆ పుల్లలడితేలోంచి రెండు కుర్చీలు తెచ్చి యిక్కడెయ్యి.

[కొండయ్య ఎడమవైపు వెడతాడు]

నర : చాలా అవసరమైన విషయాలు మాట్లాడాలి.

గోపా : చెప్పండి.

(కొండయ్య ఒకదానితరవాత ఒకటి కుర్చీలు రెండు తీసుకువచ్చి వేస్తాడు.)

సము : ఏం నరసయ్యబాబూ! మొన్నటికేసు మాటేమయ్యింది?

నర : అహా! దానికేముందిరా, అలాంటి కేసులు వస్తూవుంటాయి. వచ్చినదారినే పోతాయి.

గోపా : మాలాంటి బీదోళ్ళం కొనుక్కునీ నూనిలో కల్తీకలపడం న్యాయమేనా నరసయ్యబాబూ?

నర : ఛ! ఛ! నీతోడు. మా కొట్టులో కల్తీఅన్న మాటే వుండదు.

సము : మరి యినస్పెక్టరుగారు ఎందుకు పట్టుకున్నారు?

నర : అతిగాడికి మనమీద కొంచెం సాతపగవుందిలే. లేనిపోని వంక పెట్టి కేసుపెట్టాడు. పెట్టినందుకు ఏం బావుకున్నాడులే. ఛైర్‌మెన్ దగ్గరనుంచి కౌన్సిలర్ చిన్నబ్బాయిదాకా అందరూ ఇనస్పెక్టర్ని 'ఛీ! ఛీ!' అన్నవాళ్ళే.

గోపా : అలా అనగానే ఆయన కేసు వదిలేశాడా?

నర : వుట్టినే వదిలేశాడా? క్షమాపణ చెప్పుకుని మరీ వొదిలేశాడు.

చిన్న : నరసయ్యగారూ! యింక మన పనికానియ్యండి.

నర : (గోపాలంతో) చూడు నాయనా! ఏదో పెద్దవాణ్ణి. నామాట తీసెయ్యవని, నాలుగు మాటలు చెప్పాలనీ వచ్చాను.

గోపా : దానికేముంది? మీరేం చెప్పదల్చుకున్నారో నిరభ్యంతరంగా చెప్పవచ్చు.

నర : చాలారహస్యం — మనలోమనమే మాట్లాడుకోవాలి.

చిన్న : (వెంటనే అందుకొని) ఒరేయి సముద్రం! అరేవో మాట్లాడుకుంటారంట! మీరు కొంచెందూరంగా యెళ్ళండి.

సము : (కోపంతో) మీరు యెలితే మేమూ యెళతాం.

కొండ : (కోపంతో) ఏరోయ్! సిన్నా పెద్దా కనపడ్డం లేదేంటి? మాటకిమాట సెపుతున్నావ్.

సము : పోరా కుక్కా!

కొండ : యేరోయ్! యీపు సగును సెయ్యాలేంటి?

సము : ఒరేయ్ కొండయ్యా! యీ సముద్రం గాడు తెలుసుకున్నావంటే గుండెఅయిపోతావు! జాగర్త! (మీదికి వెడతాడు.)

కొండ : అసేదో నేనూ సూత్తాను. (ముందుకు అడుగు వేస్తాడు.)

నర : (తొందరగా యిద్దరి మధ్యకూవచ్చి) ఒరేయ్ ఒరేయ్; మీరిద్దరూ కలబడ్డారంటే మన వ్యవహారం అంతా తగులడిపోతుంది.

గోపా : సముద్రం, నువ్వూ, పోలయ్యా ఒకక్షణం ఆ చెట్టుకింద కూర్చోండి. వారేదో చెబుతానన్నప్పుడు వినకపోవడం మర్యాదకాదు.

సము : అళ్లని దూరంగా యెళ్ళమనండి. మేమూ యెళతాం.

పోల : అంతేనండి, అంతే,

నర : (చిన్నయ్యతో) చిన్నయ్య తమ్ముడూ, యీ కొండయ్యగాణ్ణి ఒక నిముషం అలా దూరంగా తీసుకువెళ్లు.

చిన్న : (సముద్రంవైపు కోరచూపు చూస్తూ) రారా కొండయ్యా, ఆ కొట్టుదగ్గిర కొంచెం పర్బత్తు తాగొద్దాం.

[చిన్నయ్య, కొండయ్య, ఎడమవైపు నిష్క్రమిస్తారు. వాళ్లు వెళ్లిన తరవాత సముద్రం, పోలయ్య కుడివైపు నిష్క్రమిస్తారు. నరసయ్య, గోపాలం యిద్దరే మిగిలేరు.]

నర : నాయనా గోపాలం! నువ్వు పోటీకి నిలబడటం వాస్తవమేనా?—కూర్చో కొంచెం స్తిమితంగా మాట్లాడుకుందాం.

[ఇద్దరూ చెరో కుర్చీలోను కూర్చుంటారు.]

గోపా : నేను పదవికోసం, గౌరవంకోసం పోటీ చెయ్యటంలేదండి. జరుగుతున్న అన్యాయాలను చూడలేక పోటీచేస్తున్నాను.

నర : పట్టెకుర్రతనం, నీకింకా అనుభవం చాలదు. నువ్వొక్కడవు కౌన్సిలరవయినంత మాత్రాన్ని వూరు బాగుపడిపోతాదా?

గోపా : అలా అని ఒకమూల కళ్లుమూసుకు కూర్చోమంటారా? నేను రంగంలోకి దిగగానే స్వార్థంలేని మరికొందరు యువకులు కూడా నన్ను అనుసరించవచ్చు.

నర : అక్కడే పొరబాటు పడుతున్నావ్ అబ్బాయ్! మనం అనుకున్నట్టు యెప్పుడూ వ్యాపారం సాగదు. యిప్పుడున్న కౌన్సిలర్లందరికీ కావలసినంత డబ్బువుంది. పలుకుబడివుంది. బలగంవుంది. నువ్వనుకున్నంత తేలిగ్గా వాళ్లు ఓడిపోరు.

గోపా : యిప్పుడు జరుగుతున్న అన్యాయాలను ప్రజలు అర్థంచేసుకుంటే నేటి పురపాలకులలో ఒకరుకూడా తిరిగి గెలవరు.

నర : మన మనుషుల తత్వాలు నీకు తెలియవు అబ్బాయ్. 'అన్యాయాలు చేస్తున్నారు' 'ఘోరాలు చేస్తున్నారు' అని ఒప్పుకుంటారు. తీరా ఎలక్షన్లు వచ్చేసరికి మన మేనమామగారి స్నేహితుడనో, లేక మన కులంవాడనో తిరిగి అతనికే వోట్లు వేస్తారు.

గోపా : అలా అని నిరుత్సాహపడి జరుగుతున్న అన్యాయాలను సాగనివ్వమంటారా?

నర : సాగనివ్వకపోతే వాటికి అడ్డం పడతావటయ్యా?

గోపా : కొంతకాలం కృషిచెయ్యగా, చెయ్యగా ప్రజలే పరిస్థితి గ్రహిస్తారు. మన కులంవాడైనంత మాత్రాన్ని సన్మార్గుడు కాడని తెలుసుకుంటారు. కులంలోను డబ్బులోను ఏమీ లేదని మనిషిలో నీతి నిజాయితీలు ముఖ్యమని ప్రజలు గ్రహించే రోజులు రాకపోవు.

నర : నాకుమాత్రం అలాంటి నమ్మకం లేదబ్బాయ్. నలభైఏళ్లనుంచి చూస్తున్నాను. ఎప్పుడూ ఒకరకం కౌన్సిలర్లే వస్తున్నారు. ఇంక నాలాంటివాళ్లు వున్నారు చూడు. వాళ్లంతా 'ఎందుకు రా బాబూ! యీ బురదలో దిగటం?' అని దూరంగానే వుంటున్నారు.

గోపా : అయితే నన్ను పోటీనుంచి తప్పుకోమని చెప్పడానికి వచ్చారా మీరు?

నర : అంతేనయ్యా! నామాటవిను. యీ అలగా జనాన్ని నమ్మడానికి అసలు వీల్లేదు. వీళ్లు యిప్పుడు నీతో వున్నట్టు కనిపించినా చివరకు సుబ్బయ్యగారికి వోట్లు వేస్తారు. కొసకు నీకు ఆయనతో పేచీమాత్రమే మిగులుతుంది.

గోపా : గెలిచినా ఓడినా సరే! నేను పోటీనుంచి మాత్రం విరమించను.

నర : గెలవటం అన్నది వుట్టిమాటలే. ఎందుకంటావా? ఆయనకు యింట్లో కావలిసినంత డబ్బువుంది. వూళ్లోవున్న పలుకుబడికి అంతేలేదు. చేతిలో హేమాహేమీల లాంటి మనుషులున్నారు. తలుచుకున్నాడంటే ఏమైనా చెయ్యగల శక్తిమంతుడు సుబ్బయ్యగారు.

గోపా : (దృఢ నిశ్చయంతో) మీ రెన్ని చెప్పండి. నేను పోటీనుంచి విరమించను.

వర : ఇంత కాలంనుంచీ ఆయన పోటీలేకుండా ఎందుకు గెలుస్తున్నాడో నీకు తెలుసా? ఆయనంటే అందరికీ భయం. నిలబడితే ఏం కొంప మునిగిపోతుందో అని.

గోపా : నాకు అటువంటి భయం యేమీ లేదు.

వర : నామాటవిను. వృత్తినే చెడిపోవద్దు. యింతవరకూ ప్రచారం చేసుకున్నందుకు నీకు కొంతడబ్బు ఖర్చయివుంటుంది. ఆ నష్టం సుబ్బయ్యగారే భరిస్తారు. (జేబులోంచి రూపాయినోట్లు తీసి) నీకు ఎంతడబ్బు ఖర్చయ్యిందో తీసుకో.

గోపా : (కోపంతో లేచి) డబ్బుకు కక్కుర్తి పడేంతటి నీచుడననుకున్నారా? (ఎడమవైపునుంచి తొందరగా చిన్నయ్య, కొండయ్యవస్తారు.) ఏదో మర్యాదస్తులు కదా అని మాట్లాడ్డానికి అంగీకరించాను. యిక మర్యాదగా దయచెయ్యండి. సుబ్బయ్యగారిని యిలాంటి నీచమైన పనులకు దిగజారవద్దని చెప్పండి. తెగింపు శక్తి, పౌరుషం వుంటే ధైర్యంగా నిలబడి పోటీ చెయ్యమనండి.

[కొండయ్య చిన్నయ్యకేసి చూస్తాడు. చిన్నయ్య సైగ చేస్తాడు.]

కొండ : (గుఱుగుగా గోపాలంమీదకి వచ్చి అతని చొక్కాపట్టుకుని) ఏంటయ్యా? తెగ వాగుతున్నావేంటి? సుబ్బయ్యగారిని యేమైనా అంటే...(చెయ్యి పైకెత్తుతాడు.) వెంటనే కుడివైపునుంచి సముద్రం, పోలయ్య పొన్నుకర్ర చేత్తోపట్టుకొని "ఆగు, ఆగు" అని కేకలువేస్తూ కొండయ్య మీదికి వురుకుతారు. కొండయ్య బెదురుచూపులతో గోపాలాన్ని విడిచిపెట్టి ఎడమ చివరవున్న చిన్నయ్య ప్రక్కకు చేరుకుంటాడు.]

సము : (కర్ర నేల కేసి కొడుతూ) నీకు పౌరుషం వుంటే ముందుకు రారాయొదవా,

పోల : (ముందుకు అడుగు వేసి) యెనక్కిపోయే వేరా? రా ముందుకి!

కొండ : (కోపంతో) చిన్నయ్య బాబూ! నువ్వెంత చెప్పినా నేనింక వూరుకోను. యీ గాడిద కొడుకుల సంగతేంటో నేను తేల్చేస్తాను. (ముందుకు పోబోతాడు. చిన్నయ్య అతనిని చెయ్యిపట్టుకుని ఎడమవైపు తీసుకుపోతాడు!)

సము : (బిగ్గరగా) ఒరేయ్! పోతావేం! ఆగు! మొగతనం వుంటే నిలబడు. నా ప్రతిజ్ఞ యిను. కొండయ్యగాడు వచ్చి సముద్రంగాడిమీద పడినా, సముద్రంగాడు వచ్చి కొండయ్యగాడిమీద పడినా, కొండయ్యగాడు గుండ అయిపోయేననుకో!

పోల : (హేళనగా) యెక్కిరించ బోయి యెల్లకిలా పడ్డాడంట! అలాంటి పిరికి యెదవలతో మనకెందుకురా! ఉం పోదాం!

సము : (గోపాలంతో) గోపాలం బాబూ! మీరు యిలాంటి దుర్మార్గుల యెదుటలికి దూరంగా వుండాలి.

గోపా : నన్ను కొట్టించినంతమాత్రాన్ని సుబ్బయ్యగారు గెలుస్తారనుకోను. అటువంటి పనులు చేయించినందువల్ల ఆయనమీద అభిమానం వున్న వాళ్ళుకూడా ఆయనకు దూరమవుతారు.

వర : సుబ్బయ్యమన్న పెద్దమనిషిలే యిలాంటి పనులు చేసేది. ఆయనకు నేను చెబుతానులే కొండయ్యను కూకలెయ్యమని.

సము : (వరసయ్యకేసి తిరిగి) వరసయ్యగారూ! మా మంచిరాయబారం తెచ్చేరండి మీరు!

పోల : రాండి. గోపాలం బాబూ! అవతల యీ వోళ్లలో కూడా మాట్లాడదాం.

[గోపాలం, సముద్రం, పోలయ్య కుడివైపు నిష్క్రమిస్తారు. వరసయ్య తిరిగి కుర్చీలో కూర్చుని ఆలోచిస్తు వుంటాడు. ఎడమ వైపునుంచి ఖాళీ చెంబులతో వెంకన్న ప్రవేశిస్తాడు.]

వెంక : (పరకాయించి చూసి) ఏం వరసయ్యబాబూ. యిలా వచ్చినావు?

నర : సుబ్బయ్యగారు కొంచెం సాయంచేసి పెట్ట మని బ్రతిమాలితే యిలా వచ్చాను.—ఆఁ! ఏమిటి విశేషం? నీ వ్యాపారం ఎలా వుంది.?

వెంక : వ్యాపారానికేం గాని బాబూ! ఆ శానిట్రీ యినస్పెక్టరుకి గొంతుకు ముడిలేదు. యెంతి చ్చినా యింకా తెమ్మన్నమాటే! మొన్న ఆవు యీనితే 'శేరుచెంబు'తో చెంబుడు జున్ను పాలిచ్చాను. రోజూ యిచ్చేపాలు యివ్వనే యిస్తన్నాను. యింకా పాలు కావాలి సుట్టాలొచ్చినారని యింటికి కబురు సేస్తన్నాడు.

నర : శానిటరీ యినస్పెక్టరు సంగతి నేను సుబ్బయ్య గారికి చెబుతానులే, యీ ఎలక్షన్లలో నువ్వు కొంచెం సాయం సెయ్యాలి మరి.

వెంక : దానికేం నరసయ్య బాబూ! నాకు చేతనైన సాయం తప్పకుండా సేస్తాను. కాని యిలాం టప్పుడే మన పనులుకూడా సక్కపేటు కోవాలి. సూసెండి. ఆ యినస్పెక్టరుని మన వార్డునుంచి మార్చెయ్యమని సెబుదురూ! బాబ్బాబు!

నర : అదెంత పనిలే. అలాగే చేద్దాం. మరి నీ వోటుమాటేమిటి?

వెంక : నా వోటు సుబ్బయ్యగారికే యేస్తాను లెండి. యిదిగో నరసయ్యబాబూ — ఆ శానిట్రీ పేస్ట్రీ మల్లయ్యున్నాడు సూశేరూ! ఆడు నిజంగా నరాంతక జేవాంతకుడు.

నర : ఏం చేస్తున్నాడు?

వెంక : ఇనస్పెక్టరుగారి పేరు సెప్పుకొని మిగిలిన సగం ఆడు కొట్టేస్తన్నాడు. ఆడిని కూడా యీ ఎలక్షన్ రోజుల్లోనే వూరి కొసకి తోసేసేరంటే పీడ యిరగడై పోతాది.

నర : ఓ! నిముషాలమీద చేయించేద్దాం.—చూడు వెంకన్నా! మీ కులంవాళ్లంతా నీ మాట మీద నడుచుకుంటారు. నువ్వు బాగా ప్రయ త్నం చేసి మీ వాళ్ల వోట్లన్నీ సుబ్బయ్య గారికే పడేటట్లు చూడాలి.

వెంక : నీకాబయం అక్కర్లేదు నరసయ్యబాబూ! మా వోటుల్లో ఒకటే పాలుపోదు.

నర : (ఆలోచిస్తూ) పాపం! సుబ్బయ్యగారు నా మీద ఎంతో నమ్మకం పెట్టుకుని నన్ను రాయబారానికి పంపారు. పని జరిగేలా కన బడ్డంలేదు.

వెంక : అదేటి నరసయ్యబాబూ! అలాగంటావు! యీ యీదోళ్లంతా తెల్లారిలేస్తే నీకు కాణం దగ్గిరేవుంటారు. నువ్వొకట్టిగా తలుసుకుంటే నీమాట కాదనేవోడెవడు?

నర : అబ్బెబ్బే! విసేలాగ కనబడ్డంలేదు. వీళ్ళను గోపాలం బాగా రెచ్చగొడుతున్నాడు.

వెంక : గోపాలంలాంటోళ్ళు నేర్ మేసులయితే మన లాంటోళ్లమంతా నెత్తిమీద సెంగేసుకు పోవలసిందే!

నర : గోపాలంతో తిరిగే కుర్రోడొకడు ఏం చేశాడో నీకు తెలుసునా వెంకన్నా? వింటే ఆశ్చర్యపోతావు.

వెంక : ఆఁ ఆ! అలాగంటబాబూ! ఏంచేసినాడు?

నర : మాకొట్టుదగ్గిరికి వచ్చాడు. పావు కాఫీపొడుం కావాలన్నాడు. మాకుర్రోడు సిసలుగా తూచియిచ్చాడు.

వెంక : అబ్బెబ్బె! తమదగ్గర తూకంలో యెప్పుడూ తకరాలేదే!

నర : మూడురూపాయినోట్లు యిచ్చాడు. అర్థ రూపాయికొసు తిరిగియిచ్చేశాను. పట్టుకు పోయాడు. కాని మరొకగంటలో మళ్ళీ వచ్చాడమ్మోయ్.

వెంక : (ఉత్సాహంతో) అలాగంటండి! ఎందు కొచ్చాడు?

నర : ఒక్కడూ వచ్చాడనుకున్నావ్? లేదు... కూడా కొత్తగావచ్చిన కుర్రశానిటరీ యినస్పెక్టర్ని తీసుకొచ్చాడు.

వెంక : అమ్మమ్మ! ఎంతపనిజరిగింది? యీ కాలపు కుర్రగుంటలు యెంతకన్నా వున్నారండి.

నర : ఇద్దరూ కలిసి ఏంచేసేరనుకున్నావ్? శాంపిలుతీసుకున్నారు. సీల్లు వేసుకున్నారు. కాగితాలు రాసుకున్నారు. సాక్షిసంతకాలు పెట్టించుకున్నారు. కాఫీపొడిలో ఈత గింజలపొడికలిసిందని కేసుబనాయించేశారు.

వెంక : పోరి యిళ్ళని పాతెయ్య! ఎంతపని చేసేసినారు!

నర : వెనకటిరోజుల్లో అయితే యిలాంటికేసుల్ని లెక్క చేసేవాళ్ళంకాదు. పాతికో, ఏభయ్యో జుల్మానాకట్టేసి వూరుకునేవాళ్ళం.

వెంక : ఆరోజులు నిచ్చేపంలాంటి రోజులు!

నర : కాని యిప్పుడేంజరుగుతుందో తెలుసా? అన్నిధరలతోపాటు జుల్మానా ధరకూడా బాగా పెంచేశారు. పోనీకష్టపడి, కళ్ళుమూసుకొని ఐదువందలరూపాయిలజుల్మానాకట్టేశాం అనుకోవయ్యా! వెంటనేపత్రికలవాళ్లుఫలానా నరసయ్యకు కాఫీపొడిలో కల్తీ చేసినందుకు ఐదువందల జుల్మానా-అని పేపర్లలో రాసి పారేస్తున్నారు. ఆ దెబ్బతో డబ్బుతోపాటు మన పరువు కూడా పోయి వూరుకుంటున్నాది.

వెంక : ఒక మాటు నా పేరు కూడా పేపర్లలో పడిపోనాది బాబూ. మా గుంటడు సదివి యినిపించినాడు.

నర : అందులోను మనఊరి పత్రిక వుంది చూశావూ, దానిలో యిలాంటి వార్తలు తాటికాయలంత అక్షరాలతో పడతా వుంటాయి. శానిటరీ యినస్పెక్టరు కంటె, మెజిస్ట్రేట్, కచ్చేరీ కంటే, జుల్మానా కంటె నాకు అదంటేనే భయం. వెనకటి కొకసారి పేపర్లో వార్త పడితే బరంపురం నుంచి మా బంధు వొకడు వుత్తరం రాశాడు. ఎంత అప్రతిష్ట!

వెంక : నిజమే బాబూ! నిజమే! రోజులు బాగా లేవు.

నర : ఇలాంటి రోజుల్లో మన మునిసిపాలిటీ కళ్లు తెరవని కుర్రాళ్ల చేతుల్లోకి పోతే...

వెంక : ఇంకేముంది.— మనబోటిగాళ్ల పని గంగ పాలే!

నర : కనక మనం మన వూరుకోసం శాయశక్తులా పని చెయ్యాలి.

వెంక : నన్నేం సెయ్యమంటే అది సేస్తాను నరసయ్యబాబూ,

నర : గోపాలం లొంగుతాడేమోనని చూశాను. లొంగలేదు. యిక యీ పేటవాళ్లతో మాట్లాడాలి.

వెంక : రెండు పంచలు మనయి కావనుకుంటే యీ పేటోళ్లే కాదుగందా-ఆళ్లని పుట్టించినోళ్లు కూడా మనకేసి తిరిగిపోతారు.

నర : అయితే పద! ఆ ప్రయత్నం కూడా చేసి చూద్దాం.

[యిద్దరూ కుడివైపు వెళుతూ వుండగా ఎడమవైపునుంచి చిన్నయ్య, కొండయ్య వస్తారు. కొండయ్య చేతిలో కర్ర వుంది.]

చిన్న : నరసయ్యగారూ! వెళ్లిపోతున్నారేంటి?

నర : లేదు. లేదు. యిప్పుడే వస్తాను.

(నరసయ్య, వెంకన్న కుడివైపు నిష్క్రమిస్తారు.)

కొండ : సిన్నయ్యబాబూ! నువ్వు సెపితే నమ్ముతావో లేదో కాని—నా పొంటిమీద గొంగలిపురుగు పాకినట్టుంది. ఆ యెదవల్ని వెర్రి యేదో ఒకటి సేసెయ్యాలి. అప్పుడు నేను నిద్రపోవాలి.

చిన్న : ముందు మన పని అయ్యిపోవాలి. తరవాత కావేషాలు తీర్చుకోడానికి కావలసినంత టైముంది.

కొండ : అయితే యిప్పుడేం సెయ్యమని సెలవు?

చిన్న : నరసయ్యగారు అన్ని రకాలగా ప్రయత్నం చేసి చూసేరు. గోపాలంగాడు—ససేమిరా—దారికి రాలేదు. తెల్లారితే కాగితాలు దాఖలా చేసేస్తారు.

కొండ : రేపే?

చిన్న : అవున్రా బాబూ! రేపే!—లేకపోతే మనకీ తొందరెందుకు?

కొండ : మరి సప్పున సెప్పెయ్యండి, ఏం సెయ్యమంటారో?

చిన్న : నువ్వు యిప్పుడు తిన్నగా ముందు కెళ్ళిపో, దొంగలచింత (చెట్టు) పక్కని నక్కి కూర్చో. గోపాలం యిప్పుడా దారినే యింటికి పోతాడు. అడు వచ్చే సమయం

చూడు. కఱ్ఱ జాగర్తగా సాపు చేసుకో! (కొండయ్య కఱ్ఱకేసి ఒకసారి చూస్తాడు.) వెనకనే యెళ్ళి బుఱ్ఱ కడ్డంగా ఒక్కటే పెట్టు!

కొండ : పెట్టడంలో అలాగా యిలాగానా! హుం!

చిన్న : అసలే అరిపేదోడు. ఒక్కటికంటే ఎక్కువ కొట్టేవంటే సచ్చి వూరుకుంటాడు. సరిగ్గా ఒక్కటే కొట్టు.

కొండ : జాగర్తగా ఒక్కటే కొట్టమనా సెలవు?

చిన్న : అంతే! చాలు! ఎలక్షనులు అయ్యేపోయేదాకా ఆడిని ఆస్పత్రి పాలుచేసేస్తే చాలు! రేపటినుంచి సర్దార్ సుబ్బయ్యతో పోట్లాట చేసే ప్రతి యెదవకీ హాస్పటల్ పుట్టుకొస్తాది.

కొండ : మరి యింక నే వెళ్లొస్తాను సిన్నయ్యబాబూ!

చిన్న : చీకటి గావుంది. జాగర్త!

కొండ : (సగర్వంగా) యీ కొండయ్యగాడి కళ్లు యెలుతురులోకంటె సీకట్లోనే బాగా కనిపిస్తాయి సిన్నయ్యబాబూ! సిటికెలో పని సేసుకురాకపోతే సూడు.

[కుడివైపు నిష్క్రమిస్తాడు. చిన్నయ్య ఒక క్షణం కొండయ్య వెళుతున్న వైపు చూసి కుర్చీలో కూర్చుంటాడు. — నరసయ్య, వెంకన్న, సముద్రం, పోలయ్య కుడివైపు నుంచి మాట్లాడుకుంటూ వస్తారు.]

నర : నువ్వు నామాట కొట్టెయ్యవనే ధైర్యంతోనే వచ్చానురా సముద్రం.

వెంక : అబ్బెబ్బె! యెంతమాట! మీ మాట సముద్రం గాడెప్పుడూ కొట్టెయ్యడండి.

సము : ఎలక్సన్ల మాట తప్పించి నువ్వేం సెప్పినా యింటాను నరసయ్యబాబూ!

నర : మరీ అలా మొండిపట్టు పట్టుకు కూర్చుంటే ఎలాగరా అబ్బాయ్! మనిషయిన తరవాత పట్టూ, విడుపూ వుండాలి.

పోల : యీ ఎలక్సను రోజుల్లో మీలాంటి పెద్ద మారాజులకి మామీద యెక్కడలేని పేమా పుట్టుకొచ్చేస్తది!

చిన్న : ఒరేయి పోలిగా! ముందు ఆయన చెప్పిన మాట వినరా!

పోల : నువ్వా సిన్నయ్యబాబూ! కీనీడలో కూకున్నావేం?

నర : మీ వార్డులో యేమేమి కావాలో చెప్పండి.

సము : యెన్నేళ్లనుంచి మేం మొత్తుకున్నా యీ వాడలో ఒక కొళాయి అయినా పెట్టించారా?

నర : (తేలిగ్గా) ఓ! అదెంతపని! ఒక కొళాయి కదూ? నెలరోజుల్లో యీ వార్డులో కొళాయి వేయించే పూచీనాది.

పోల : అలాంటి కబుర్లు శానాయిన్నాం. ఎలక్సన్లయ్యిన తరవాత మళ్లా కంటికి కనబడితే ఒట్టు.

సము : (అకస్మాత్తుగా ఏదో స్ఫురణకు వచ్చినట్లు) ఒరేయి పోలయ్యా! మనం యిద్దరం యిక్కడెందుకు? గోపాళంబాబు పక్కయీదిలో మీటింగం పెట్టేడు. నువ్వా బాబుతోనే వుండు. రెండు మాటలు మాటాడేసి నేను కూడా వస్తాను.

[పోలయ్య కుడివైపు నిష్క్రమిస్తాడు.]

నర : (సముద్రంతో) నా మాటమీద నమ్మకం వుంచి చూడు. మీ వార్డుకు కొళాయి తప్పకుండా వేయించేలాగ చేస్తాను.

సము : మీలాంటి పెద్దలకి యేమాటాడినా సెల్లుతాది బాబూ!

వెంక : అందులోను నరసయ్య బాబున్నాడే—ఒకే సముద్రం—సెప్పొద్దూ—మాటంటే కరాకట్టి.

నర : యింకా మీ వార్డుకేం కావాలో యిప్పుడే చెప్పు.

సము : సేసేనాదుండాలిగాని సెప్పుకోడాని కెన్నయినా వున్నాయి.

వెంక : ఆ మారాజు అడుగుతున్నప్పుడు నీకేంటా? సెప్పుకో!

సము : యీ యీదికి రోడ్డు కావాలని యెన్నిసార్లు మొత్తుకున్నాం. యీ పదేళ్ళలోనూ ఒక్క మాటు అయినా రోడ్డువేసినారూ? వానాకాలంవొస్తే మోకాలులోతు బురద. దోమలు ముమ్మర్లి బతకనియ్యవు. పోయిన సాలుకి మసూచకం వచ్చి యీ పేటలోని పిల్లా

పాపల్ని సగంమందిని యెత్తుకుపోయింది. అలాటప్పుడు మాపేట కేసి కన్నెత్తి సూసిన మారాజున్నాడూ?

చిన్న : మీవాగ్దుకు సిమెంటురోడ్డు శాంక్షనయిపోయిందిరా సముద్రం. కాగితాలు తయారీ అయిపోగానే పని మొదలెడతాం.

వర : అదుగో! యికనేం! చిన్నయ్య కంట్రాక్టర్ చెబుతానే వున్నాడు. రోడ్డుకూడా వేసేసినట్లే లెక్క.

సము : యింక యీ పేటలో మురికి, సెత్తవారానికొక మాటైనా సుబ్రం సేయిస్తన్నారూ?

వర : ఆవిషయంలో మాత్రం సుబ్బయ్యగారిమీద నేరం పెడితే కళ్లుపోతాయి. శుభ్రం చెయ్యడానికి బోలెడంతమంది మనుషులున్నారు. నెలనెలా వాళ్ళకు రేవుకు ముడుపులు లాగ జీతాలు యిస్తున్నారు. మరివాళ్లు పనులు చెయ్యకపోతే సుబ్బయ్యగారేం చేస్తారు చెప్పు?

వెంక : పెతి సిన్నపనికీ సేరమేనుగారి మీద తప్పు పెడితే ఎలాగరా సముద్రం?

వర : మీరు సపోర్టు చేస్తున్న గోపాలంవున్నాడే, కుర్రవాడు. ఆలోచన తక్కువ. ఆవేశం ఎక్కువ. అలాంటివాళ్ళ ద్వారా పను లెప్పుడూ అవ్వవు. అందులోను యీ కుర్రాళ్లకి జాత్తిగా అనుభవం లేదు. అలాంటి వాళ్ళ చేతుల్లో మన పట్నాన్ని వుంచితే యింకేమైనా వుందీ!

చిన్న : మర్నాటికి గంగలో కలిసిందన్నమాటే!

సము : బాబూ! మీరెన్ని సెప్పండి. మావోట్లు మాత్రం మేం గోపాలం బాబుకే యేస్తాం. మాకు యిశ్వాసంవుంది బాబూ! ఆరుమాసాల కితం కలరా వొచ్చి యీ పేటోళ్ళు సచ్చిపోతావుంటే ఆ బాబు రాత్రనక పగలనక మాతోనే వున్నాడు. అలాంటి బాబుకి మేం యెప్పుడూ అన్నాయం సెయ్యం.

వర : అతగాడెప్పుడో చిన్న ఉపకారం చేసేడని సుబ్బయ్యగారివంటి అనుభవశాలిని ఓడించెయ్యడమేనా?

చిన్న : (ఆవేశంతో ముందుకువచ్చి) సుబ్బయ్యగారు ఓడిపోవడం అనేది యీ చిన్నయ్య బతికున్నంతకాలం జరగదు.

సము : ఎందుకు సిన్నయ్యబాబూ తొందరపడతావ్ నెలరోజులుపోతే అదే తెలుస్తాది.

చిన్న : అదీ చూద్దాంగాదూ!

వర : యిదిగో! సముద్రం! యిక ఆఖరుమాటచెప్పేస్తున్నాను విను. (మొలలోంచి సంచితీసి) యిదుగో డబ్బు! దీనితో మీ పేటలోవాళ్ళు గుడే కట్టించుకుంటారో, గోపురమే కట్టించుకుంటారో కట్టించుకోండి. మీవోట్లుమాత్రం చీలిపోకుండా సుబ్బయ్యగారికే వెయ్యండి.

సము : (కోపంతో) మేం కూటికి పేదోళ్లమయినా మాకు ఒకమాటా నీతీ వున్నాయి బాబూ! మేం డబ్బుకోసం గడ్డికరవం.

[కుడివైపు వెళుతూవుంటాడు.]

వర : నామాటవినరా సముద్రం. యిలాంటి లాభసాటిబేరం వదిలేసుకోకు.

వెంక : యిలాంటిదాన్ని మళ్లా కావాలంటే దొరకుతాదట్రా!

సము : నాకంటంలో వూపిరున్నంతకాలం అలాంటి పనిసెయ్యను. యీ పేటలో యెవడన్నా సేశాడో ఆడితల తీసేసేనన్నమాటే!

[సముద్రం కోపంతో కుడివైపు నిష్క్రమిస్తాడు]

వెంక : ఆరిగాడిదికొడుకు, ఎంతపనిసేసినాడు!

వర : యీఅలగా జనం రోజురోజుకీ మరీ తెలివి మీరిపోతున్నారు. మునుపటిరోజుల్లో ఆస్తి వున్నవాళ్ళకే వోట్లు వుండేవి. ఇప్పుడు ప్రతి వాడికీ వోటే. దూళ్ళను కాచుకునేవాడికీ వోటే! దొడ్లు తుడిచేవాడికీ వోటే!

చిన్న : అందుకే యీచిక్కంతా వచ్చిపడిపోయింది. పోనీ డబ్బు జల్లేద్దాంఅంటే ఒకడా ఇద్దరా? అష్టమైనోడికీ వోటే!

వెంక : యెనకటిరోజుల్లో మాపేటపెత్తానికి నన్ను కలుపుకుని నలుగురికి వోటుండేది. యిప్పుడేంటి? గొర్రెలుమందలాగున్నారు.

నర : చిన్నయ్య తమ్ముడూ, యీ పేట వాళ్ళని ఎన్ని రకాలుగా లొంగదీయాలో అన్ని రకాలగాను ప్రయత్నించాను. మన మర్యాద దక్కలేదు.

చిన్న : మంచికీ, మర్యాదకీ మనుషులు కారు వీళ్లు, దెబ్బకి దెయ్యం దిగొస్తాది.

[కుడివైపునుంచి తొందరగా కొండయ్య వస్తాడు. జుత్తు చిందరవందరగా ముఖం మీద పడుతోంది. వొళ్లంతా చెమటతో తడిసి పోయింది. చేతిలోని కర్రమీద రక్తం మరకలు కనిపిస్తున్నాయ్]

కొండ : (వస్తూనే) ఒక్క దెబ్బకు కుప్పలయి పోయాడు. కుర్ర యెదవ!

చిన్న : (ఆత్రుతగా అతనిని సమీపించి) అంతా అనుకున్నట్టు అయ్యిందా?

కొండ : (ఉత్సాహంతో) అవ్వాకంలోనూ—నా సామిరంగా—మోత!

నర : (భయంతో) ఒరేయి బాబూ కొండయ్యా! కొంపతీసి ఎవర్నీ ఖూనీ చెయ్యలేదు గదా! మమ్మల్ని సాక్ష్యం వేసుకున్నారంటే పచ్చి పూరుకుంటాం.

కొండ : (కోపంతో) ఖూనీ చేసేద్దును యెదవని! అంకుకు సిన్నయ్య బాబు ఆర్డరు లేదు. లేక పోతేనా?

చిన్న : నువ్వు చేసిందేదో టూకీగా గెంతుముక్కల్లో చెప్పెయ్.

కొండ : నా వొంటిమీద గొంగలి పురుగు పాకినట్టుంటని సెప్పేను కాదు సిన్నయ్య బాబూ! సిరాకుతో ముంగుకెళ్తన్నాను. గోర్రు వది లేసి సెట్ల యెనకనుంచి నడిసిపోతున్నాను. సీకటి అంధాకారం. యింకా దొంగలసింత సేరుకోనె లేదు నేను. ఇంతిలో గోపాళం గాడి మాటినిపించింది. కూడా యెవడో మగో యెదవ కొడుకున్నాడు. అను మాటాడితే పోల్చేద్దును గాని మాటాడ్డం లేదు. గోపాళం సెపుతున్న దానికి "ఆఁఊఁ" అంటున్నాడంతే మాటాలేదు. మంతీ లేదు. (ముఖం చిట్లించి, కర్ర గుప్పిటలో బిగించి పట్టుకొని) రానిచ్చాను. దగ్గిరికి రానిచ్చాను. కర్ర ఒక మాటు సాపుసేశాను. గిరా గిరా—గిర గిరా తిప్పేను. యెనక మార్నే యెల్లి గోపాళంగాడి నెత్తిమీద—ఒక్కటంటే ఒక్కటే—కొట్టేను.

నర } : రామ! రామ! ఎందుకురా అలాంటిపని చేశావు?

సం } : అరెరె! ఎంతపనిచేసినావురా కొండిగా!!

చిన్న : (సగర్వంగా తలపూపి) ఊఁ! తరవాత యేమయ్యింది?

కొండ : అంతే! కిక్కురుమంటే ఒట్టు! కూలబడి పోనాడు. నేను యెనక్కి తిరిగి సూడకండా పక్క దారినుంచి యిలాగొచ్చేశాను.

చిన్న : (ప్రశంసిస్తూ) ఒరేయి కొండయ్యా! ఎవరూ చెయ్యలేనిపని యియేళ నువుచేసి చూపించావు. పద! యింకయిక్కడుంటే ఆ యెదవలంతా మళ్ళీ వచ్చిపడతారు.

నర : ఎందుకలాంటి పాపపు పని చేయించావు చిన్నయ తమ్ముడూ?

చిన్న : మంచిగా యెంతచెప్పినా యిన్నాడూ? నడవరా కొండయ్యా. ఆలస్యంచేస్తే మంచిది కాదు. (కొండయ్యను చెయ్యి పట్టుకుని ఎడమవైపు తీసుకుపోతాడు.)

వెంక : యీ కొండిగాడున్నాడే నరసయ్య బాబూ! యీడు బుర్రలు కొట్టుకు బతికేయెదవ!

నర : పాపం! అసలే వూపిరి లేనట్టుంటాడు ఆ కుర్రాడు. బతుకుతాడో లేదో!

వెంక : యీ యెలక్షన్లు మనుషుల పేణాలు తియ్యడానికే వచ్చినియ్.

నర : గోపాలంలాంటి వాళ్లు ఎలక్షన్లలో గెలవడం ఎంతమాత్రం మంచిది కాదు. అది మనమూ ఒప్పుకుంటాం. — కాని గోరుతో పోయే దానికి గొడ్డలెందుకూ అంటాను?

వెంక : నరసయ్య బాబూ! నాకు తెలవక అడుగుతాను! యిప్పుడుమనం రాయబారంసేసినాం గందా. గోపాళంబాబుని కొట్టిన కేసులో మనల్ని యిద్దరినీ యిరికించేస్తే?

నర : (ఆలోచిస్తూ) చిక్కే! చిన్నయ్య చాలా పెద్దచిక్కే తెచ్చి పెట్టేడు. ఆ బుర్రలు బద్దలు కొట్టుకు నేదేదో మనరాయబారానికి ముందైనాచేస్తే మనమీద యెవరికీ అనుమానం లేకపోయేది. ప్రొద్దున్న లేచి ఎవరి ముఖం చూశామో యివేళ!

[కుడివైపునుంచి బిగ్గరగా కేకలు వేసుకుంటూ సముద్రం, పోలయ్య వస్తారు. పోలయ్య తలకు కట్టుకట్టినట్లు తువాలుచుట్టుకున్నాడు. తువాలునిండా రక్తం కనిపిస్తోంది. అతని ముఖంమీద బట్టలమీదకూడా రక్తపు మరకలు వున్నాయి. యిద్దరూ కోపావేశంతో వున్నారు.]

సము : (వస్తూనే బిగ్గరగా) ఏడీ? కొండిగాడెక్కడ?

పోల : సేతగాని యెదవ! ఎనకనుంచివచ్చి కొట్టేడు.

నర : (ఏమీ తెలియనట్టు ముందుకు వచ్చి) ఏమయ్యిందిరా సముద్రం?

సము : (కోపంతో) యేమయ్యిందా? మీ పెద్ద మనుషులు సేయించే పనులిలాగే వుంటాయి!

వెంక : రామ! రామ! అదేంమాటరా సముద్రం? నరసయ్యబాబు దేముడులాంటివాడు!

పోల : (కోపంతో) నువ్వో దేముడిలాంటి వాడివే!

సము : ముందు ఆ కొండిగాడెక్కడున్నాడో సెబుతారా లేదా?

నర : ఒరే సముద్రం! నీతోడు! వాడిముఖం మళ్లా చూడనేలేదు.

వెంక : నీతలకాయ కేమయ్యిందిరా పోలయ్యా?

పోల : ఏమయ్యిందా? గోపాలం బాబుతో కలసెళ్తన్నాను. ఆ కొండిగాడు యెనకనుంచే వచ్చి కొట్టేసినాడు.

సము : అసలు ఆడియెత్తు గోపాలంబాబుని కొడదామనే!

పోల : పిరికి యెదవ! కళ్లు బైర్లుకమ్మ నన్ను కొట్టేసి పారిపోనాడు.

సము : అలాంటి సచ్చు దెబ్బలు పోలిగాడికిగాని, నాకుగాని లెక్కా? జమా? యిదిగో నరసయ్యబాబూ! గేరంటీయిస్తున్నాను. మేం అలాంటి దెబ్బలు వందతగిలినా గునపంలాగ నిలబడతాం.

పోల : ఆడిని ఆక్కడి కక్కడే పీకనొక్కేద్దును. తిరిగిసూడకుండా పారిపోయినాడు యెదవ!

నర : పోనీ గోపాలానికేమీ దెబ్బలు తగలలేదు కదా?

సము : ఆ బాబుని సేమంగా యింటికి చేర్పేసి మరీ వచ్చినాం.

పోల : యియ్యేళ కొండిగాడి అంతు తేల్చకుండా యింటికెళ్లం.

నర : గొడవలు పెంచుకోడం మంచిది కాదురా అబ్బాయ్. యిక వూరుకోండి. ఆకొండయ్యగాడు వాడి పశువబుద్ధి మానించుకున్నాడంతే!

సము : యిసపు జంతువుని కనికరించి యెప్పుడూ యిడిసిపెట్టకూడదు. పదరా! పోలయ్యా! ముందుకు పద!

వెంక : ఒరేయి సముద్రం! నామాట యినరా! పిల్లాజెల్లా వున్నోడివి అలాంటి......

సము : (కోపంతో) ఇంకలాభంలేదు. ఆకొండయ్యగాడిని సంపేసేసీదాకా యీ సముద్రంగాడు నిద్రపోడు.

[ముందు సముద్రం, వెనకపోలయ్య ఎడమవైపు నిష్క్రమిస్తారు.]

వెంక : అయితే గోపాలం నిక్షేపంగా వున్నాడన్నమాట!

నర : నిక్షేపంగా వున్నాడు! రేపు ఎలక్షన్లో నిలబడతాడు గెలుస్తాడు. యింతకీ మన వూరికి చెడ్డరోజులు వచ్చాయి.

వెంక : లేకపోతే యిలాంటి కుర్రోళ్లంతా మునిసిపల్టి ఆఫీసుమీద కెందుకు యెగబడతారు నరసయ్య బాబూ!

నర : చిన్నయ్యకూడా వ్యవహారం కొంత చెడగొట్టేశాడు. యింతకీ సుబ్బయ్యగారి దశ మారిపోయింది.

[యిద్దరూ నిరాశతో కుడివైపు నిష్క్రమిస్తుండగా—తెర]

# విశ్వనాథవారి రామలక్ష్మణులు

శ్రీ ప్రతివాదిభయంకర వేదాంతాచార్యులు

ఈ విమర్శనము నేనేలనో వ్రాయవలసినది. నాకంటె నీ విషయము నెఱింగినవారు సహస్రాధికు లాంధ్రదేశమునఁ గలరు. ఎవ్వరును దీనికిఁ బూనుకొనకుండుటచే నేను సాహసింపవలసి వచ్చెను. అపమార్గమునఁబడిన భాషకుఁ బ్రాధాన్యము వచ్చినప్పుడది యుపాదేయమను నపోహ జనులలో వ్యాపించును. సన్మార్గమున నడచు రచనకు స్థానమే యుండదు. మనము మూకీభావము వహించిన మనకుఁ గలిగిన దుర్గతిని మన పరంపరకుఁగూడ నంటఁగట్టినవార మగుదుము. యథార్థనిరూపణము భాషాభిమానుల కర్తవ్యమై యున్నది.

'రామలక్ష్మణులు' అను శీర్షికగల పద్యభాగము శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి 'రామాయణ కల్పవృక్షము' నుండి యుద్ధృతమైన కొంతకాలముక్రిందటి పాఠ్యభాగము. ఆ కూర్పులలో వారు ప్రధానులు. కావున ఆ రామాయణములోని యుత్తమ ఘట్టములలో నిదియొక్కటియని వారియభిప్రాయమైయుండవచ్చును. ఇందు ముప్పదిరెండు పద్యములు గలవు. మూలములోని కొన్ని పద్యములు విడువఁబడినవి. ఆ సంగతిని గమనించి, దీనికిఁ బూర్వరంగమును బఠించి, ముద్రణ స్ఖాలిత్యములను గుర్తెఱిఁగి, ఆధారములేని యభిప్రాయములను వెలిఁబుచ్చక, దీనిలోని ప్రతిపద్యము నుదహరించి యందలి యౌచిత్యానౌచిత్యములను నా యోపినంతవఱకు సహృదయముతో విమర్శించుటకుఁ బ్రయత్నించెద.

వ. రామలక్ష్మణు లిరువురు గాధేయు పాదాభి
వందనం బాచరించిన 1

క. రాముఁడు నమస్కరించుచు
నా ముని పాదములు తాఁకినంతటన తనూ
రోమాంధువుఁగానంద
శ్రీమత్పులకాంబు భంగధృతి ముని పొంగెన్ 2

ఈ వచనభాగమును నీ కందపద్యభాగమును గలిసి యొకవాక్యముగా నూహింపఁబడి యున్నది. కాని వీనిలో సరియైన వాక్యనిర్మాణము లేనేలేదు. 'రామలక్ష్మణులు' అని ప్రారంభించి మఱల నా వాక్యములోనే 'రాముఁడు' అనుట యసమంజసము. అట్లనుటలో రామునకుఁ బ్రత్యేకతఁ జూపించు నుద్దేశమున్నదని యన్నచో మహానుభావుఁడైన లక్ష్మణస్వామికి న్యూనత నాపాదించుటయే యగును. దానికిని సహించిన "ఆచరించినను" అని యుండవలెను. 'ఆచరించిన' అనుటకంటె "ఆచరించిరి" అనిన నక్కడికి నొక్క వాక్యము పూర్తియయి, కందపద్యము రెండవవాక్యమయి కొంత సరళత యేర్పడి యుండునేమో?

ఒకే వాక్యములో "పాదాభివందనము" 'నమస్కరించుచు' 'పాదములు తాఁకినంతటన' అని యుండుట సరికాదు. 'ఆచరించిన' ఒకసారి, అదే వాక్యములో 'తాఁకినంతటన' ఇంకొకసారి యుండుట కుదురదు. వీనిలో నొక్కొక్క దానికి నే క్రియతో నన్వయము? కాగా నీ వాక్యమునందు కర్త కర్మ క్రియ లేవి? కర్త 'ముని'యనియు, 'పొంగెన్' క్రియయనియు ననుకొందము; ఇది యకర్మక క్రియ. ఒకే వాక్యములో 'ముని' అను విశేష్యము నుపయోగించి మఱల దాని సర్వనామమును వాడవలెను గాని యింకొకసారి 'ముని' యనుట చింత్యము. ఇఁక 'తనూరోమాంధువు లానంద శ్రీమత్పులకాంబు భంగధృతి' అనునది వాక్యమా, సమాసమా? దీని భావమేమి? పదవిభాగమేమి? తనూ = శరీరము నందలి, రోమాంధువులు = రోమము లుండెడి బావులు అనగా రోమకూపములు. వాక్యమైన, 'అంధువులు' ప్రథమావిభక్తి పదమగును. దానికి క్రియయేది? సమాసమైనచో, 'అంధువుల' ఏ విభక్తి? షష్ఠీవిభక్తిగాఁ దీసికొందమా యన్న 'అంధువులఁగానంద' అని యుండవలెను.

"ఆనంద=సంతోషము చేత, శ్రీమత్=శోభావంతమైన, పులక=గగుర్పాటును సంబంధించిన, అంబు=నీటియొక్క అనగా చెమటయొక్క, భంగ=కెరటములను, స్ఫురిత్=స్ఫురించుట చేత" అనునర్థమును లాగవచ్చును. "శ్రీమత్" అను విశేషణము సకల కళ్యాణగుణపరిపూర్ణుఁడైన శ్రీరామునకుఁ జెందిన బాగుండును గాని సన్న్యాసియైన విశ్వామిత్రుని చెమటకా విశేషణము? అది ప్రాసకొఱకే వినియోగింపఁబడినది. ఇంతకు నీ వచన పద్యసంకుల సారాంశము 'శ్రీరాముఁడు విశ్వామిత్రుని పాదములను స్పృశించుటచే నామునికి మిగుల గగుర్పాటు గలిగెను.' అని. అంతకన్న సాధారణ భాషాజ్ఞానముగల వానికిఁ దెలియని మహోన్నతభావనాబలమిందేమియు లేదు. దీనికింత ద్రావిడప్రాణాయామము ననవసరము. ఇందులోఁ బ్రసన్నగుణము సున్న. వాక్య నిర్మాణమయోమయమును, నధ్వానమును. ఇందలివి క్లిష్టాన్వయము — కాదు — దుష్టాన్వయము సహృదయులు పరికింపవలసినది.

సీ. గాధేయు చూపులు కమలపత్త్రాభిరా
మములైన రాము నేత్రములఁ గలియు
గాధేయు కన్నులు కదలి వశిష్ఠుల
స్తిమిత నేత్రములను జేరఁబోవు
గాధేయు చూపులు కమనీయ రామ మే
ఘము మేన శంపాభకాంతులొలయు
గాధేయు కన్నులు కదలి వశిష్ఠశం
పాలోచనైక్య భావంబునందు

గీ. రామచంద్రుని మధుర దర్శనములోన
నిరువురు మునీంద్రులును బ్రహ్మఋషిత గాధి
సుతునకు వశిష్ఠు లిచ్చిన శుభసమయము
నంగుఁగన్నను నధిక సౌహార్దులైరి 3

ఏమి విశ్వామిత్రుఁడో గాని తనకు నమస్కరించిన రామలక్ష్మణుల నెంతమాత్రము నాశీర్వదింపక వెఱ్ఱిమాపులు ప్రారంభించినాఁడు. మన మనకొన్న యుత్కృష్టభావము మన రచనచే వ్యక్తము కావలెను. "గాధేయుఁ డొకసారి రాముని నింకొకసారి వసిష్ఠునిఁ జూచినాఁడు. తరువాత నిద్దఱు మునులును రాముని మనోహర రూపము నొక్కమాఱుగాఁ జూచి యా సమానానందానుభవముచేత నెక్కువ స్నేహముగలవారైరి." అని మాత్రమే రచనలో నున్న భావము.

'గాధేయు' పదము పై వచనములో నొక్కమా ఉపయోగింపఁబడి యదే యీ పద్యములో నాలుగుసార్లు ప్రయోగింపఁబడుటలో సారస్యమేమియు లేదు. వాడిన పదము నావృత్తముల నా యర్థముచే వాడుట శైలికిఁ దౌర్బల్యమును సూచించును. సాధ్యమైనన్ని పర్యాయపదములు, నానార్థములు, వ్యక్తపఱచుట సత్కవుల శైలికి సహజము. మొదటి రెండు పాదము లేదో యొక రీతిగా నడచినవి. మూఁడవ పాదమునందు 'అందమైన రామునియొక్క మేఘమువంటి శరీరము నందు గాధేయుని చూపులు 'శంపాభకాంతులొలయు' అని యున్నది. శంప=మెఱపు. ఆభకును కాంతికిని నర్థభేదము లేదు. 'ఆభ' శబ్దము స్త్రీలింగము, ఆకారాంతము. 'ఆభకాంతులు' సరియేనా? పండితులు యోజింపవలసినది. ఇంతకు నీ కాంతులు ప్రసరింప నన్న శ్రీరామచంద్రుఁడు వట్టి కారు మేఘమా? ఆతఁడు స్వయముగా జగజ్జేగీయమానుఁడు కాఁడా? నాలుగవ పాదమున 'శంపాలోచనములు'=మెఱుపులిగిన కన్నులు' అని రచయిత అభిప్రాయము కాబోలు! 'ఋషిత' అన్న ప్రయోగము నిర్బంధముగాఁ జేయఁబడినదిగాని సహజము గాదు. 'శుభసమయము నంగుఁగన్నను' అప్పటి కన్నను' అని రచయిత యభిప్రాయమై యుండును. కాని యిట్లు ప్రత్యయము పైఁ బ్రత్యయము నెక్కించుట తగదు. ఇచ్చట 'కన్నను' అనఁగా 'మాచినను' అని స్ఫురించును. ఈ గీతపద్యములో ధార కుంటువడినది. అన్వయము క్లిష్టము.

క. మునిదృష్టిలోన మలఁచుచు
మనుజేశ్వరుఁ గని, వశిష్ఠమౌనిం గని, తి
క్కనవారిం గని, యొకక్రొ
త్త నవ్వు నవ్వు చిటులనియె ధాత్రీపతితోన. 4

విశ్వామిత్రుఁడు మూఁడుసారులు 'కని' నాఁడు. ఆ 'నవ్వు' కందపద్యమునకుఁ గావలసిన శరవేగమును భగ్నపఱచినది. మునియొక క్రొత్తనవ్వు నవ్వుచున్నాఁడు. ఇందేదో మోసముండితీరవలెను.

మ. ఎవరయ్యా! రఘురామచంద్రులకుఁ గానీ
యస్త్ర విద్యాపరుల్
నవబాహాపటు దీర్ఘదండునకు నీనావద్ద
శిష్యత్వ మొ

ప్పవలెన్, శ్రీరఘురాము బాహుపటిమల్
ప్రాశస్త్యమందగ వలెన్
విశ్రుతంబుల్ మునికోటియజ్ఞతతి నిర్విఘ్నత్వ
మొప్పన్ వలెన్ 5

శ్రీరామునకుఁ దక్కిన విద్యలన్నిటి వలె నే యింతవఱకు శస్త్రవిద్యయందును వసిష్ఠుఁడే గురువు. 'మునీంద్రులు గురువులు సధిక సౌహార్దులైరి' అని వెనుకటి పద్యములోఁ జెప్పఁబడియున్నది. అనఁగాఁ బరస్పరము గౌరవానురాగములు గలవారైరి యనుట సువిదితము. ఇంతలో నీ పద్యమునందు విశ్వామిత్రుఁడు, 'రామునకు గురువుగానుండుట కితఁడు తగడనియుఁ దానే తగుదుననియు నధిక్షేపించుచున్నాఁడు. 'రఘురామ చంద్రులు' అని బహువచనములో నొకతూరియు 'రఘురాము' అని యేకవచనములో నొకతూరియుఁ బునరుక్తి దోషములో నుపయోగింపఁబడినది. 'ఈ యస్త్ర విద్యాళిగల్.' ఇచ్చట 'ఈ' యను నక్షరము 'యతి' కక్కుఱతి కొఱకైనదిగాని యితర ప్రాశస్త్య మేమియు లేదు. 'నవబాహాపటు దీర్ఘదండమునకు' బాహువును దండముతోఁ బోల్చుట సంప్రదాయసిద్ధమే; కాని 'పటు దీర్ఘ' విశేషణములు (అవసరమైనచో) బాహువునకు నుండవలెను. 'బాహుపటిమల్' ఇంకొకసారి 'బాహు' ప్రయోగము. 'మునికోటి యజ్ఞతతి నిర్విఘ్నత్వము'. ఇదియొక్క సమాసము. 'విశ్రుతంబుల్' అను విశేషణము 'యజ్ఞతతి' అన్న నడిమిపదమునకుఁ జెందినది; కుదురునా? 'ఒప్పన్ వలెన్' రెండవసారి యుపయోగింపఁబడినది. విశ్వామిత్రుఁడు, దశరథునియొద్దకు, రామునిఁ బంపుమని యర్థించుటకు వచ్చినవాఁడు; అది ముందు చెప్పక రామునకు నస్త్రవిద్య నేర్పెదనని పురికొల్పుచున్నాఁడేమి?

చ. మొనసి భృశాశ్వదత్తములు మూల్గమనున్నవి
నాకపెన్ మహా
స్త్ర నిభృతవిద్యలల్లె రఘురామునకై యవియెల్ల
నిచ్చెదన్
మనుజమహేంద్ర! పంపుము కుమారుని నా వెను
వెంట; నూరకే
యనలము దాచుకొన్న ఫలమా? క్రతుయోగ్యము
గావలెంజుమీ? 6

ఉత్తమకవులు ప్రతిపదము నర్థయుక్తముగనే వాడినారు. ఇచ్చట 'మొనసి' యట్టిది కాదు. 'మహాస్త్ర నిభృతవిద్యలు'. వ్యర్థపదమైన 'మొనసి'తోఁ బద్యము ప్రారంభింపఁబడినదిగాన ప్రాసకొఱకు నింకొకపదము 'నిభృత' కావలసివచ్చినది. ధారకుంటినది. 'మనుజమహేంద్ర' యని సంబోధించుటలో విశేషమేమియు లేదు, 'అనలము దాచుకొన్న ఫలమా? క్రతుయోగ్యము గావలెంజుమీ!' రాముఁడనలముతోఁ బోల్పఁబడినాఁడు. అనల ముదాచుకొన్న ఫలములేని మాట నిజమేగాని యది దాచుకొన్నవారిని దహించివేయును. రాముఁ డట్టివాఁడు కాఁడు. క్రతుయోగ్యమైన అనగా హోమాదికర్మల కుపయోగించు ననలము దాచుకొన్న ఫలమున్నది. అది దహింపకుండ జాగ్రత్త పఱచఁబడి యుండును.

ఉ. చిత్తము చిత్తమంచు నృపశేఖరుఁ
డానమదాస్య హీనుఁడై
యొత్తిగిలెన్ విషణ్ణతను; నొత్తిడిఁ
జేసెను మౌని; రాజులో
నుత్తల మందుమన్ ప్రభు! ప్రభూ!
బ్రతుకంతయు వాచికన్న యీ
పొత్తులబిడ్డఁ బాయ నిలుపోపనయా!
నిముసంబు నేనియున్. 7

తెలుఁగు కవిత్వము వ్రాయునపుడు సంస్కృత సమాసములు కూర్చుట సాధారణమే. అయిన నవి సహజముగా నుండవలెను. 'ఆనమదాస్య హీనుఁడు' అట్టిది కాదు. 'ఒత్తిగిలెన్ విషణ్ణతను': 'విషణ్ణత' యనఁగా 'విషణ్ణతి' యని రచయిత యుద్దేశమా? కాకున్న 'విషణ్ణతి' కర్థము లేదు. ఈ పద్య రచయిత గణపూర్తి కెక్కుడనైనను నిరర్థకముగా ద్రుతము నుపయోగించుచుండును. అట్టివనేకము లింకఁ జూడఁ గలము. ఉత్తమకవులనవసరముగా నే ద్రుతమునుగాని, యే అచ్చునుగాని హల్లునుగాని చేర్పరు. ప్రతి మాత్రయు భావయుక్తమై యుండును. 'ఒకానొకచో ద్రుతంబుమీఁద ద్రుతంబునుం గానంబడియెడి' నను నాధారముఁ దీసికొని మనము ద్రుతశిరణ్యుల మగుట తగదు. 'విషణ్ణతను నొత్తిడిచేసెను' అట్టిది. 'బ్రతుకంతయు వాచికన్న యీ పొత్తులబిడ్డ' దశరథుని యత్యంత మమకారమును సూచించుచున్నది; బాగు

గనే యున్నది. దీనిలో సాధారణుల కతీతమైన విచిత్ర భావసంపద యేమియు లేదు. మనమింకను పాండిత్యము సంపాదించుకొని యాస్థాయి నందుకొని విచారింత మన్న జిజ్ఞాస యవసరము లేదు. ఈ పద్యమునుబట్టి దశరథుఁడు రాముని బంపుటకు వాగ్దానముఁ జేయ లేదనుట స్పష్టముగుచున్నది.

ఉ. రాముఁడు నాకు స్నానమగు;
రాముఁడు నాకు జపంబు, ధ్యానమున్
రాముఁడె యెల్లనా బ్రతుకు
రాముఁడు నన్నును గన్నతండ్రి, యీ
రాముని నా నిమేషమువురా!
మనఁజాలను గాదయేని నీ
రామునివీడి యీ యఖిలరాజ్యము
గాధిసుతా! గ్రహింపవే! 8

ఇన్నిసారులు 'రాముఁడు' అని ప్రయోగించుటచే యతిప్రాసలు సులభమైనవి. పద్యమునకుఁ గావ్యలక్షణము తక్కువైనను పలుసార్లు రామనామ స్మరణము దక్కినది; అది మంచిదేకదా! 'ఎల్లనా బ్రతుకు' అపసవ్యము. 'నా బ్రతుకెల్ల' సవ్యము. 'నన్నును గన్నతండ్రి': ఈ 'ను' గణము కొఱకే చేర్పఁబడినది. 'అవురా!' యనుటలో విషాదార్థముకంటె నాశ్చర్యార్థమే యెక్కువ గోచరించును. 'కాదయేని: గణముకొఱకు విభాగముఁజేసి విసంధి సేయుటలో విశేషము లేదు. 'కాదని' యనుటయే సహజము. 'గాధిసుతా!' అన్న సంబోధన పాదపూరణార్థమే.

మ. వసుధేశుం డిటు లన్న యంతటన విశ్వామిత్రు వాస్యోద్గతం
బసకృద్ధాసము చిల్లిచిల్లలయి రాజాంతఃపురం బంతటన్
ముసరెన్ మానియు నిట్లు చెప్పె బళిరా! భూపాల! నీ వీదయై
నసరే యింతకు మున్నె యిత్తునని యన్నావే కదా! దాతవై 9

వచన రచన కానిండు, పద్యరచన కానిండు, పూర్వాపరసందర్భములు చూచుకొని వాక్యము సరిగా నడచుచున్నదా యని గమనించవలెను. 'చిత్తము' అన్న పద్యములో 'రాజు'తో ప్రారంభించిన వాక్యమిప్పుడు ముగియుచున్నది. ఆ 'రాజు'ను విస్మరించియే యిప్పుడు 'వసుధేశుం డిటులు' అనుట. 'ఆస్యోద్గతంబసకృద్ధాసము': ఆ నవ్వు నోటినుండి వెలువడినదట! 'అసకృద్ధాసము' అనఁగా అ + సకృత్ + హాసము = ఎడతెగని నవ్వు. ఇటి సమాసము తెలుఁగుకవిత్వములోన సంగతము. ఇది 'అనముదాస్య హాసుఁడు' అనుదానికిఁ బెద్దక్క; అతి కఠోరము; సాధారణులకు విపరీతము. ఆ నవ్వు 'చిల్లిచిల్లు' లయినదట. అనుకరణ శబ్దప్రయోగములు రూఢిగనే యున్నవి; వాని నెవరి యిష్టమువచ్చినట్లువారు వ్రాయుటకు హక్కు లేదు. ఆ విశ్వామిత్రుని నవ్వు 'ముసరి'నదట. 'ముసరుట' ఈగలు క్రమ్ముటకే వాడుదురు. తపోనిష్ఠా గరిష్ఠుఁడయిన విశ్వామిత్రుని బహు ధారాళమయిన నవ్వునకీ నీచశబ్దము తగదు. 'ఇత్తునని యన్నావే కదా దాతవై': 'దాత' యొక్క వ్యుత్పత్తిని గ్రహించినవారు 'ఇత్తును'తో దాని నదే వాక్యములో కూర్పరు. 'ఏదయైన నిత్తునని దశరథుఁ డనినట్లు వాల్మీకములో నెచ్చటను జెప్పబడియుండ లేదు.

క. నీ కొడుకును గైకొని చని
మా కాకలి యందుఁ దిందుమా పిచ్చిన్నపా!
మా కడఁ బ్రశస్త్రశాస్త్ర
వ్యాకృతికల దిద్ది నేర్పి పంపెదమింతే 10

'మనము వ్రాయు గ్రంథమేమి? అందలి పాత్రలెట్టివి? వాని శీలము లెట్టివి? వాని సంభాషణ లెట్టి మహోన్నత భావ గంభీరములుగా నుండును?' ఇవి గమనింపవలెను గాని, మనము చీట్లపేకాడుచున్నపుడు కాఫీ హోటళ్లలోను, సంత బజారులయందును మాటలాడుకొను వైఖరిని పురాణ పురుషుల కతికించుట కూడదు. 'మా కాకలియందుఁ దిందుమా' యని నీచముగా విశ్వామిత్రుఁడని యుండఁడు. అట్లు తలఁచుటకు దశరథుఁ డంత పిచ్చివాఁడును గాఁడు. అస్త్రవిద్య నేర్పుటకే ముఖ్యముగా రామునిఁ దోడ్కొని పోయెద నని విశ్వామిత్రుఁడు దశరథుని మభ్య పెట్టుచున్నాఁడన్నమాట. కావ్యము వ్రాయువా రందలి పాత్రలలో లీనమై రచించుట ప్రశంసనీయము గాని యా పాత్రలనే తమలో లీనముఁజేసికొనుట విపరీతము. 'వ్యాకృతి' యనఁగా వ్యాకరణము సాధారణమైన

యర్థము. ఇచ్చట విశదీకరించు విద్యయని మన మూహిం చుకొనవలెను. ఈ విశ్వామిత్రుఁ డొకసారి యేకవచన ప్రయోగము నింకొకసారి బహువచనముఁ గావించు చున్నాఁడేమి? ('మొనసి', అను పద్యములో 'నాకడ', 'ఇచ్చెదన్' అని యున్నవి.)

ఉ. ఇమ్మగు విద్య నేర్పెదను, నిం
కను నా కొక చిన్న మెత్తు కా
ర్యమ్మును జేసి పెట్టవలె,
నాపయిఁ బూవులలోనఁ బెట్టి కై
కొమ్మని నీ కుమారుఁ డిడుగో!
యని నీకయొసంగవార మా
పిమ్మట; నీవు గా నతని పిలువలెన్
మాటి మాకు నేటికిన. 11

'నేర్పెదను నింకను.' ఇచ్చట 'ను' ద్రుత ప్రకృతిక మగుట కగత్యము లేదు. కొనప్పు డుకారసంధి చేయ వలసినదే. 'విద్య నేర్పెద' ననుమాట వెనుకటి పద్యము నందుఁ జెప్పఁబడినదే. మరల నెందులకు? మాటి మాటికి, "విద్య నేర్పుటకే తీసికొనిపోవుచున్నాను, తరువాత నాకొక సూక్ష్మమైన కార్యమును జేసిపెట్ట వలెను" అని కృత్రిమముగా నే యనుచున్నాఁడు విశ్వా మిత్రుఁడు. నేర్పుట యొకటి; కార్యమును జేసిపెట్టు టింకొకటి. వీనిని 'ఇంకను' తోఁ గలుపరాదు. కైకొమ్మని, 'నీ కుమారుఁ డిడుగో'యని, ఇవి రెండును తొలు మాటలుగా నున్నవి. రెండువాక్యములు 'అని' యనుట యనుచితము. తుదిపాదము పద్యపూరణకే వ్రాయఁబడి యున్నది.

ఉ. నీచులు దైత్యజంతువు లనేకులు
కారు మరీచ సుబాహు మా
రీచులటంచు నిద్దఱు ససృక్పి
శితంబుల నింపి యజ్ఞ కా
ర్యాచరణంబు బద్ధమతులై
సవ వేదికఁ బాడుచేసి క
ట్టా! చెడఁజూతు రుగ్రవికట
ప్రకటావిలచిత్తవృత్తులై. 12

'దైత్యజంతువులు'. ఈ రూపకము పటువైనది కాదు. దైత్యగుణములు లేని జంతువు లెన్నో కలవు. 'లక్ష్మణరాము' లెట్లు సరికాదో యట్లే 'సుబాహు మారీచు'లను ద్వంద్వము సాధువు కాదు. 'మరీచ' అను నది కేవలము వ్యర్థపదము. 'యజ్ఞ' 'సవ' ఈ రెంటికి నొకటే యర్థము. ఒకే వాక్యములో వాడఁబడియుండుట తగదు. 'యజ్ఞము' అనిన చాలును. ఈ 'యజ్ఞ కార్యాచరణంబు' ప్రాసకొఱకే. 'పాడుచేసి చెడఁజూతురు' ఈ వాక్యమును పాడుచేసెనీ గ్రంథకర్త. 'ఉగ్రవికట ప్రకటావిల చిత్తవృత్తులై.' ఇందుఁబదాడంబరమే గాని భావ సంపద లేదు. వెనుక ముందులు చూచుకొనక యీ పద్యములోఁ బదములు ప్రయోగింపఁ బడినవి.

ఆ. ఒక్క సిద్ధిగోరి యొగి నెన్నిసార్లు నే
మొదలు పెట్టినాఁడ నది సవంబు
నెన్ని సార్లు వారలెరియించిరి సవంబుఁ
దుదకు విసుగు పుట్టి వదలినాఁడ! 13

'అది' యనుట 'యతి' కవుగ్గతి తప్ప సార్థకత యేమియును లేదు. రెండుసార్లు 'సవంబు' వ్రాయుట పునరుక్తి. నిస్సారమైన యీ పద్యమును నేను 'విసుగుపుట్టి వదలు'చున్నాఁడను.

ఉ. ఈ జులపాలజుత్తుగల యీ పసిబాలుని నేనెఱుంగుదున్
రాజ! యొసంగఁగా వలయు రాముని నాకయి దైత్య లోకప్రా
ణాజరబద్ధ పీడఁజేయునట్టి యనుండితోఁ డాదతి ప్రసూ
తాజినమంత తానోలుచు నద్భుత శౌర్య నిధాన మీతఁడున్ 14

రెండుసార్లు 'ఈ' యని వ్రాయుట యసంగతము. 'ఒసంగఁగావలయు' అను ప్రయోగము సహాయము. 'ఒసంగవలయు' అనుటయే సరి. వ్యాకరణ సాధ్యమైన చాలునా? అక్షరరమ్యత చూపవలదా? అట్లైన గణము కుదరదు. కుదురకపోయిన వేఱు పదము వెదుకవలెను. అవసరమైన పాదమును, ఇంకను అవసరమైన పద్యము నే మార్చవలెను. అందుకొఱకు తపస్సు చేయవలెను. అది లేనిది సరియైన పద్యము రాదు. 'అజిరము' ప్రాసకొఱకు వేసిన నిఘంటు పదము. దానికి 'గాలి' యను నొకయర్థమే పొందును. ఈ సమాసము సరియేనా? రాముఁడు యముడుగా రూపింపఁబడినాఁడు; ఎందులకు? సహృదయులు గమ

నింపవలెను. 'అజినము' సాధారణముగా లేడి చర్మమునకే వాడుదురు. 'ఈతఁడున్' లోని ద్రుతము వట్టి దండుగ.

చ. అది పదినాళ్లె యజ్ఞ మిఁక నాగుటకైనను వీలు లేదు, నీ
కుదురు త్రిలోక పారిషద కూటములందు ప్రశస్తికెక్కఁగా
మది కలదేని? బంపుము, కుమారు వశిష్ఠులఁ దక్షు మంత్రు
లొప్పుదలఘటిల్లఁ జూచికొని పుచ్చుము, భావిమహో
విధాతవై 15

ఈ రచయితకు నిరర్థకపాదపూరణపదప్రయోగమునం దాస్థ మెండు. 'ఆగుటకైనను' అట్టువంటిది. పారిషదకూటములలోని 'పారిషద' అను పద మర్థయుక్తముగా వాడబడినదా? 'వశిష్ఠుల దక్కు మంత్రు లొప్పుదల': వసిష్ఠులవారియొక్కయు నితర మంత్రుల యొక్కయు నంగీకారమని రచయిత యుద్దేశము. వసిష్ఠుఁడు పురోహితుఁడు గాని మంత్రి కాఁడు 'వశిష్ఠుల యొప్పుదల' యన్నప్పుడు 'వశిష్ఠు'ల ద్రుతప్రకృతికము గారాదు. 'వశిష్ఠులయు' నని సముచ్చయమున్న ద్రుతము ననుసంధింపవచ్చును. 'మంత్రు లొప్పుదల' అసాధువు. 'మంత్రుల యొప్పుదల' అని యుండవలెను. 'భావి మహో విధాతవై' 'విధాత' కు 'భావి' విశేషణముగుట కూడదు.

క. ప్రాణములు లేచిపోయిన
మానవపతి కంతిలోన మౌనివచస్సం
తానము శ్రవోగతంబులుగా
గా నించుక యూర్పు గొంచు క్ష్మాపతి యనియెన్ 16

ఒకే వాక్యములో 'మానవపతి' యు 'క్ష్మాపతి'యు నుండుట పునరుక్తియే. క్ష్మాపతికి బదులు సర్వనామ ముండుట యుక్తము. మౌని వచస్సంతానము శ్రవోగతంబులుగా. దీని యర్థము 'మునిమాటలు విని' అని ఇచ్చట పదము లెక్కువ, భావము తక్కువ.

ఇందలి విశ్వామిత్రుఁ డొక కపట సన్యాసి. ఆ దొంగచూపులు, ఆ యికిలింతలు, ఆ దంభము, ఆ వట్టి నటన, పెద్దల నాక్షేపించుట, ఆ వెకిలినవ్వు ఆ నీచ సంభాషణ, ఆ మరియాద నెఱుఁగని సంబోధన, కృత్రిమ స్వభావము వణఁచుకొనలేక చెప్పినమాటనే చెప్పుట, తినవచ్చిన కార్యము ముందు చెప్పక అడుగని సహాయము చేయుదునని మాటిమాటికిఁ దెలుపుట, అప్రస్తుత ప్రసంగము, మాట తప్పఁ బడుట యొక స్వార్థపరుఁడైన యల్పబుద్ధినే సూచించును. అబ్జాసనదృశుఁడైన మేధావియు, మహాతేజస్వియునైన మౌనిచంద్రుఁ డీ గ్రంథకర్త చేతిలో నసభ్యప్రవర్తనగల తుంటరిజంబుకమైనాఁడు.

ఉ. తా మనుకారమే యనుము తక్కిన యుగ్గ రొకెత్తు; వాఁడొకె
త్తో ముని! నాకు; వాని విడి యోర్వఁగఁజాలను, కోసలేంద్రక
న్యామణియోర్వ దెవ్వ రెటులైనను
గైకయి యోర్వఁజాల, దా
రాముఁడు లేని నాదుగృహరాజియుఁ జీకటి
కోణముల్ మునీ! 17

ఇందలి 'తా'కు సార్థకత్వ మేమియు లేదు. 'వాఁడొకెత్తో ముని' ఈ విశేషణము ప్రతిపేయము గాదు. 'కోసలేంద్ర కన్యామణి' ఇది కౌసల్యకుఁ బర్యాయ పదము. ఘోరాతిఘోరముగా నున్నది. కౌసల్య దశరథుని భార్య. వివాహమై చిరకాలమైనది. లేక లేక సంతానము గన్నది. పెనిమిటితోఁబాటు వృద్ధ యనియే చెప్పవచ్చును. ఆమెను 'కన్యామణి' యనుట చాల ననుచితము. ప్రాసకొఱకే యీ యవస్థ. 'మునీ' అని రెండవసారి సంబోధన పాదపూరణార్థమే.

గీ. కాదు కూడ దటంచు రాఘవుని గొంచుఁ
బోవ నెంచెద వేని? నో మునిమహేంద్ర!
పూని చతురంగయుక్తమౌ సేనతోడ
నన్ను నైతెను రానీవె నాథమౌని 18

'ముని'కి, వేఱుపర్యాయ పదము లేక కాఁబోలు, మఱలఁ బ్రయోగింపఁబడినది. వాడినపదము నాయర్థము లోనే యాప్రాంతమునందే యభిమానవంతుఁడైన రచయిత వాడెను. 'నాథమౌని' 'మౌనినాథ' యనుటకు బదు లుపయోగింపఁబడినది. ఇది యతికొఱకే. ప్రయోగము బాగుండలేదు. 'ముని' యన్నతర్వాత మఱల 'మౌని' యనుటకు గ్రంథకర్తకు విసుగులేదు గాని మనకు విసుగే.

వ. అనిన విశ్వామిత్రుం డిట్లనియె 19
ఇది బాధలేని వచనము బాగున్నది!

భుజంగవిజృంభితము :

పౌలస్త్య ప్రోద్బాహుండా రా
వణుఁడు దితిజకులపతి బ్రహ్మదత్తవరంబులన్
త్రైలోక్యంబున్ బాధించున్ భూ
తతతి బెగడుకొనఁగ దైత్యసైన్యభయంకరుం
డాలోచింపన్ వాఁడే యజ్ఞా
యతన నిరతికుపితుఁడు నాకరాజ విరోధి వా
డాలంబంబై యజ్ఞధ్వంసం
బనుమతి సలిపెదరు దురాగ్రహోన్నతదర్పులై 20

ఈ రచయితకు భాషాసౌందర్యముపై దృష్టి తక్కువ; యజ్ఞధ్వంసబీభత్సమును వర్ణించుటకుఁ గాఁబోలు నీయసాధారణవృత్తమును గైకొని తన రచనను మహాబీభత్సమును గావించెను. వాక్యములను విడఁదీయఁ బ్రయత్నింతము. 'బెగడుకొనఁగ' వఱకు నొక వాక్యము. 'నాకరాజ విరోధి'వఱకు నింకొకవాక్యము, 'వాఁడాలంబంబై'నుండి తుదివఱకు మూఁడవవాక్యము. ఈ తుది వాక్యమునకుఁ గర్త యేది? 'మారీచసుబాహులను' తీసికొనుటకు నా పనిని శీప్రాంతమున లేవు. ఎట్టి భయంకరత్వమును సూచించినను బద్యము నవక మనోహరముగానే యుండవలెను. ఎక్కువ భాషా జ్ఞానము లేనివాఁడుగూడ నది విన సొంపౌనో కాదో చెప్పఁగలఁడు. అంతయేల? మంచి రచనలోని నాదము భాష తెలియనివానినిఁగూడ నాకర్షించును. ఇట్టి పద్యములు భాష తెలిసినవానినైనను వికర్షించును. 'త్రైలోక్యంబున్=త్రిలోకములను' అగునా? ధాతువు 'చలుపుటయా' లేక 'సలుపుటా'? అనుమతియే విభక్తి? 'దురాగ్రహోన్నతదర్పులు'. ఈ సమాసభావ మిప్పటి సందర్భమున నా రాక్షసులకుఁ జెల్లునా? ఈ పద్యముయొక్క అన్వయము క్లిష్టమా, దుష్టమా?

వ. వాఁడు సాక్షాద్వైశ్రవణభ్రాత వీరిద్దఱు మారీచసుబాహులు. వానికి దగ్గరచుట్టములు. 21

వెనుకటి పద్యమున రెండుసార్లు వాడిన 'వాఁడు' తిరిగి యిక్కడ సిద్ధమై వాడిపోయినది. 'సాక్షాద్వైశ్రవణభ్రాత=కేవలము కుబేరుని తమ్ముఁడు. రావణుని భయంకరత్వము, వాని కన్నడో యోడిపోయి లంకాపట్టణమును సమర్పించిన కుబేరునితమ్ముఁ డనుటలో, వ్యక్తము గాదు. 'వీరిద్దఱు మారీచసుబాహులు'- పై పద్యములో మఱచిపోయిన మూఁడవవాక్యపుఁగర్త నిక్కడఁ జొనిపినను బొసఁగలేదు. పద్యమునకుఁ బద్యమునకుఁ బద్యమునకు వచనమునకు నవిచ్ఛిన్నమైన యాలోచనాసంపత్తిని వాక్యరచనాసౌష్ఠవముతో నడపుట యీ రచనలోఁ గానరాదు.

మ. అనినన్ రాజును నివ్వెఱం గనుచు
వాఁడా? వాఁడు భీతిప్రభా
వనయక్షాదిక దేవయోని పటు
గ్రీవాదేశనిక్షిప్త తే
జనిస్త్రింశుఁడు; వానిఁ దాఁకుటకు
నేఁ జాలన్. మహేశ్వరుండు చా
లునా? వాఁడే మఱి మూఁడులోకములఁ
జాలున్ జంపఁగా నొంపఁగా. 22.

ఇది రావణుని పరాక్రమాతిశయమును సూచించు పద్యము. దీనిలో మఱి మూఁడు 'వాఁడు'లు సిద్ధమైనవి. ఇందలి దీర్ఘసమాసముయొక్క ఘనత దాని దీర్ఘతయే; ఎంతమాత్రము బిగి, జటిలత లేవు. 'ప్రధావన = పరు గెత్తుచున్నట్టి' యని యుద్దేశముగాఁబోలు. కాని యాది పొందదు. 'ఆదిక'లోని క ప్రత్యయము గణముకొఱకే. పటుగ్రీవ: ఛందోభంగము. ఏకసమాసమందున్న 'టు' స్పష్టముగా 'గ్రీ' పై నూదుచున్నది. కావున నది గురువే గాని లఘువు గాదు. 'దేశ' యనవసరపదము. 'తేజని' ప్రాసకొఱకైన యపప్రయోగము. రావణుఁ డెంతటి పోటరి? భయముచేతఁ బఱాయితు లగుచున్న దేవతా సమూహముల కంఠములయందు కత్తిని బాతువాఁడే! చివరిపాదములో 'మఱి' వ్యర్థపదము. పద్యములు వ్రాయు నీ గ్రంథకర్తకు గణమునొద్ద, యతివద్ద, ప్రాసకు నెక్కడ లేని ప్రాల్మాలికయే.

ఆ. వాని కెదురు తీర్పవలదు శ్రీరాముని
నల్పభాగ్యు నన్ను నాదరింపు
నీవ గురువవౌదు; నీవె దైవతమౌదు;
కుఱ్ఱవాఁడు సమిదకోవిదుండు. 23.

'సమిదకోవిదుండు'-మూఁడు పాదములు సులభమైన పదములతో నెట్లో నడపి నాలుగవపాదమందు 'కుఱ్ఱవానికిఁ' దగిన సులువైన పదమునే వాడవలెను గాని యిట్టి కేవల సాంస్కృతికసమాస మసహజము.

వ. ఆ సుందోపసుందుల కొడుకులు యమసదృశులు; నా కొడుకును బంపించెను. వారిలో

నొక్కనితోనైన నా సైన్యములతో యుద్ధమాడ నేర్తునని రాజూరకుండిన 24.

సుందోపసుందుల కొడుకులే మారీచసుబాహులని యిదివఱకుఁ జెప్పఁబడియుండలేదు; మన మూహించుకొనవలెను. ఇదివఱకు రాముఁడు యమునితోఁ బోల్పఁబడినాఁడు. ఇప్పుడు మారీచసుబాహు లిరువురును 'యమసదృశులై వారు. స్వభావములో శ్రీరామచంద్రుఁడును మారీచసుబాహులు నొక్కటియే యన్న మాట. 'నా కొడుకును బంపించను' అని మూర్ఖముగా నవినయముతో దశరథుఁ డనియుండఁడు. 'ఒక్కనితోఁ' దాను యుద్ధము సేయుటకు సిద్ధమైన రెండవవాని నెవరు డీకొందురు. వాఁడు వనుకనుండి తిన్నకుండునా? దశరథుని పల్కులు 'అనినన్ రాజు'తోఁ బ్రారంభించిన సంగతి మఱచి కాఁబోలు 'అని రాజూరకుండిన' అని మఱల వక్కాణించుట.

మ. అవునయ్యా! యవు నిత్తునంటి మొద;
లీ యంతంబునం దీయనం
టివి; హానీ! రఘువంశయోగ్యమునునో
నీచేఁత? నీకున్ సుఖం
బవు, నీ బంధులు నీవురున్ సుఖము పెల్లె
యుండుఁ, జేఁ బోదు. మా
నవనాథా! సుఖమాతి నీకును బ్రతిజ్ఞాభంగ
పుణ్యాబ్ధికిన్. 25

ఈ పద్యము బొత్తిగా వికారముగా నున్నది. దీనికి ముందున్న వచనములో 'నా కొడుకును బంపించను' అని యుండుటచేత నిప్పుడు 'ఇత్తునంటి' వానికే చెందును గాని యెక్కడో పూర్వరంగమందున్న 'ఏదియైన నిత్తును'కు సంబంధించదు. ఏ యుత్తమ రచనలోను నిట్టి సందిగ్ధవాక్యము లుండవు. ఆదినుండి తుదివఱకు రామునివృత్తాంతము లేకున్నను రాము నొసఁగ బోయుటకు దశరథుఁ డంగీకరింప నేలేదు. కావున 'ఈ యంతంబునం దీయనంటివి' అనుటపొరపాటు. 'హానీ!' యన్న తర్వాత కోపమెందులకు? ఈ పద్యములో 'నీకు సుఖమాతి' మూఁడు పర్యాయములు చెప్పఁబడినది. ఇందు పసయేమియు లేదు. 'ప్రతిజ్ఞాభంగపుణ్యాబ్ధికిన్'. ఈ సంబోధనచే విశ్వామిత్రుఁడు దశరథు నధిక్షేపించుచున్నాఁడు. దీని యర్థము 'ప్రతిజ్ఞయొక్క భంగమనెడి పుణ్యమునకు సముద్రమువంటివానికి' అని. విశ్వామిత్రుఁడు కోపస్వభావముగలవాఁడనుటగాక నీచస్వభావుఁడని యెంచుట తగదు. అట్టి తపశ్శక్తిసంపన్నుని వాక్కు లమోఘములు. మనస్సులో ద్వేషము పెట్టుకొని బయటకు 'సుఖమాతి' యని యాశీర్వదించువాఁడు కాఁడు. ఆ కోపమును స్పష్టముగాఁ జూపించునే గాని మర్మముఁ బెట్టుకొను కర్మ మతని కుండదు. పురాణములలోని పాత్రలను వాని వాని యౌదార్యములనుబట్టి చిత్రింపవలెను గాని మన స్వభావముల కనుగుణ్యమైన యెత్తిపొడుపుమాటలు పనికిరావు. సంభాషణలు వ్యావహారికముగా వ్రాయఁబోయి బోల్తాపడుట యీ పద్యరచనలో విశేషముగ నున్నది.

వ. అనిన విశ్వామిత్రుండు కుపితవిఘుర చలితాంగుఁడై సభాసదనంబు వెడలిపోయిన రాజు ప్రక్కటం బున్న సుమంత్రునిఁ గాంచి నీవుపోయి యెట్టులైన మునిని బ్రసన్నునిఁ గావించి తెమ్మని పంచిన సుమంత్రుండు గాధేయుని వెంటఁ జనియె; గాధేయుండు విశ్రామగమనంబున నేగి ప్రథమ కక్ష్యాంతరంబునఁ గూర్చుండిన మంత్రి పోయి బద్ధాంజలియై యాయన యెద్ద నిలఁబడిన మౌని వెడమోమై యుండె; నిట సభలో— 26

మన పురాణములలోను ప్రబంధములలోను కవులు పద్యములనే కాక గద్యములను గూడ మనోహరముగా రచించియున్నారు. ఈ గద్యములో నా తీవి యెంతమాత్రమును లేదు. 'కుపిత విఘుర చలితాంగుఁడు' ఈ సమాసములో సరియైన యర్థము లేదు. కుపిత=కోపపడిన, విఘుర = వైకల్యము గలిగిన, చలిత = కదల్పఁబడిన, అంగుఁడు = శరీరముగలవాఁడు. 'కుపిత' యను విశేషణము మనస్సునకు సంబంధించినది గాని శరీరమునకుఁ జెందదు. 'తెమ్మ' వస్తువుల కుపయోగింపవలెను గాని మానవులకుఁ గాదు. 'తీసికొనిరమ్మ' అనుట యుక్తము. రెండవసారి సుమంత్రుఁ డనుటకు బదులు 'అతఁడు' అను సర్వనామము శైలిననుసరించి వ్రాయవలెను. మఱి నానార్థములో నే 'విఘుర' నువాడుట కా మాఱుమూల పదమంత ప్రీతికరమైనదా? కోపమువచ్చి లేచిపోయిన విశ్వామిత్రుఁ డల్లే పోక అలిగిన బాలునివలె సింహద్వారమువద్దఁ గూర్చున్నాఁ డేమి? ఎవరైనఁ దన కొఱకు వత్తురని వేచియున్నాఁడు గాఁబోలు!

ఆ. పతి వశిష్ఠుఁ గాంచి ప్రాంజలియై యేమి
స్వామి! యేమి చెపద వచ్చిపడియె
గాధిసుతుఁడు ప్రథమకక్ష్యాంతరముఁగూడ
దాఁటి పోవకుండ దారిఁజూపు 27

దాటిపోవకుండ దారిఁజూపు. ఇది మిగుల హాస్యాస్పదముగా నున్నది. దారిఁజూపుట పోవుటకుఁ గాని ఆగుటకుఁ గాదు. 'దారిఁజూపు' అనఁగా 'ఉపాయము చెప్పు' అని రచయిత యుద్దేశము. సులువుగా 'ఆపు' పదమటయే గమనింపఁబడినది కాని యౌచిత్యము లేదు.

క. అనిన వశిష్ఠుం డిట్లను,
మనుజాధిప! నీవు తొలుత మాట నొసఁగి తా
వెనుక జనుకొన నేటికి?
నినకులమర్యాద యగునె యిది తాతా! 28

దీనిలోని 'తా' కేవలము వ్యర్థప్రయోగము. 'తాతా' అనుచితప్రయోగము. వసిష్ఠుఁడు దశరథుని 'సంబోధించుచున్నాఁడు. దశరథుఁడు వయోవృద్ధుఁడే వసిష్ఠుఁ డంతకంటెఁ ప్రాచీనుఁడు; తరతరములనుండి సూర్యవంశమునకు గురువు. 'తాతా' అని తెలుఁగులోని యర్థముప్రకారము పిలుచుటకు వీలులేదు. 'తాత' యన తండ్రియని సంస్కృతములో నున్నది. రచయిత తనకుమాత్రమే యీ విషయము తెలియునని ప్రకటించుటకుఁ గాఁబోలు దీనిని ప్రయోగించెను! వ్రాయునది తెలుఁగు కవిత్వము. వసిష్ఠుఁడు దశరథునిఁ ప్రేమపూర్వకముగాఁ బిలువవలసియున్నది. కావునఁ దండ్రీయనుట సమంజసము. ఇందు ఛందో నిర్బంధ మేమియు లేదు. అదిగాక, 'తాత'=తండ్రి: ఈ సంస్కృతార్థమున దీనికిఁ దెనుఁగునఁ బ్రయోగముగనఁబడదు.' అని శబ్దరత్నాకరము నుడివినది. 'శబ్దరత్నాకరమే తప్పు. అంతకంటె నాకే బాగుగఁ దెలియును.' అనుట మొండివాదమే యగును. శబ్దరత్నాకరాది నిఘంటువుల సాయమునసే యీ రచన సాగుచున్నదని సహృదయులైనచదువరులు గ్రహింపలేకపోరు. ఎంతటి సంస్కృతి దీర్ఘసమాసమైనను దెలుఁగనిపించ వచ్చునే! ఎందులకీ పనికిమాలిన 'తాత'?

ఆ. మొదట నిత్తునంచుఁ బిదప నీ కుంటుట
అశ్వమేధ యాగహతిముసేత
మొదట వాపిఁద్రవ్వి పిదపఁ బూడ్పించుట
యీవు ధర్మమూర్తి విదియుఁ దగునె? 29

'మొదట నిత్తునని' దశరథుఁడన్నట్టి పాఠ్యములో నెక్కుడను లేదు. ఈ పద్యరచనలో భాషాసంస్కారము గాని, సంప్రదాయానుసరణము గాని యలంకారమనోహరత గాని లేదు. 'అశ్వమేధయాగహతిముసేత' వాగ్దానభంగఫలితము 'మొదట వాపిఁత్రవ్వి పిదపఁబూడ్పించుట' అడి తప్పటతో సమానమా? 'వాపిఁద్రవ్వుట' తన కొఱకే ఏల కారాదు? ఇది అలంకారమా? ఏమి అలంకారము? ప్రకృతాప్రకృతసంబంధము సత్యమేనా? కానున్న 'అశ్వమేధయాగహతిముసేయు' టయు, 'వాపిఁద్రవ్వి పిదపఁ బూడ్పించుట'యు సమాన పాతకములేనా? ఈ రెండును నొకేసారిగా వాగ్దానభంగముతో నెట్లు పొందును? 'ఇదియు' లోని సముచ్చయము గణపూర్తికే గాని యింకే ప్రయోజనమునకుఁ గాదు. ఏ భావమునైనను పద్యములోను గద్యములోను జూపించవచ్చును. వ్యాకరణచ్ఛందోనియమములు పద్యములలో నెక్కువ కఠినములు. అవి సాధించిన నే పద్యములు శ్రావ్యబంధములై యుండును. ఆ యోపిక లేనివారు గద్యము నే యాశ్రయింపవలసి యుండును. పద్యములలో సంగీతధోరణి యుండవలెను. ఈ గ్రంథకర్త పద్యము లట్టివి కావు.

ఉ. అతఁడు నేర్చినస్త్రముల నన్న్యలు
నేర్పెను; నీ కుమారకున్
ప్రీతి ననుగ్రహింప మదిఁ బెచ్చు యతం డిటు
వచ్చెఁ గాని కా
దా? తనయుం తఁ దా సమదదానవ సామజ
కుంభపాటన
వ్యాతతసింహమూర్తి యతఁడై యిట
నేటికి వచ్చు భూమిపా. 30

'నేర్చినస్త్రములు.' పూర్వకవి ప్రయోగమున్నది గాన బలవంతముగా నొప్పుకొనవచ్చును గాని ప్రశంసనీయము గాదు. పూర్వ మహాకవులును మానవులే. వారికినిఁ బ్రమాదములు గలిగియుండవచ్చును. లేదా, సందర్భములనుబట్టి యీ ప్రయోగములను దప్పని సరిగాఁ జేసియుండవచ్చును. అంతమాత్రమున నవి ప్రతిచోట నుపాదేయములుగావు. వారి మంచి గుణములను మన మనుసరించి ధన్యులము గావలెను గాని

వారి ప్రమాదములు మనకుఁ బ్రామాణికములు కారాదు. 'నేర్వఁగు' అని భూతార్థములో తద్ధర్మార్థకప్రయోగముఁ జేసినప్పుడు 'నేర్చు' అనికూడ నిరాక్షేపణీయముగా వ్రాయవచ్చును. 'నీ కుమారకున్.' ఇచ్చట 'మారకున్' అని యపార్థము స్ఫురించుచున్నది. 'కుమారునిన్' అని సులభముగా మార్చుకొనవచ్చును 'కాని, కాదా' పునరుక్తి, 'సముదానవసామజకుంభపాటన వ్యాకలితసింహమూర్తి,' 'వ్యాకలిత' ప్రాసకొఱ కేర్పడినది. 'మూర్తి' యనవసరపదము; రూపకము చెడినది. పదముల యర్థములను సరిగాఁ దెలిసికొనియే సమాసములను కూర్పవలసియుండును. యజ్ఞసంరక్షణము విశ్వామిత్రునకుఁ గావలసిన కార్యము. అస్త్రములు నేర్పుట దానికి దోహదమైన యుద్యమము. దీనిని తాఱుమాఱుచేసి రామాయణవృత్తాంతమునే దిద్దఁబూనుట గ్రంథకర్తకుఁ దగనిపని.

వ. అనుచు వశిష్ఠుఁ డాడ, ముదితాంతగుదార
సముజ్జ్వలత్తనూ
తనుతరమూర్తి భూమిపతి తాఁ గబు
రంపెను రాముని౯ సల
క్ష్మణుని; వశిష్ఠమౌనికృతి మంగళ
వంతుల మాతృపాదపూ
జన మధురాస్యచంద్రముల క్ష్మాపతి
యిద్దఱి రెండు చేతులన్. 31

'వశిష్ఠులు' బహువచనప్రయోగము, 'పతి వశిష్ఠుఁ గాంచి' అను పద్యములో ఏకవచనముగా నున్నది. 'ముదితాంతరుదారసముజ్జ్వలత్తనూ తనుతర మూర్తి', ఇది పదాడంబరసమాసమే గాని గంభీరార్థయుక్తము కాదు. మఱల నొక మూర్తి సిద్ధమైనది. ఏటి పదముల కూర్పైనను సహజమైన శోభించును. లేనిచోఁ గృతక భాష యనిపించుకొనును.

ఉ. కైకొని మోదవీచి మృదుకంపనుఁడై తొలి రేసుగ
నమ్రమున్
దాకొనియున్న కౌశికునివగ్గరఁ జేతులు పిడి
పుత్రులన్





మోకలఁ బ్రేమ మూర్ధముల మూర్కొని మౌనినిఁ
జూపఁగా సుప
ప్రశ్రీకమలాననుల్ మునినిఁ జేరిరి వారు వినమ్ర
దేహులై 32

సాధారణముగాఁ బద్యాంతముతోఁబాటు వాక్యాంతముఁ గూడఁ గావలెను. అపలేని ప్రవాహము గాని, విశిష్టాన్వయసందర్భము గాని యైనచో రెండవ పద్యములోఁ బూర్తికావచ్చును. అట్టిదేదియు నిందు లేదు. సుదితాంతిర వెనుకటి పద్యములో నున్నది గాన 'మోదవీచి' యిక్కడనవసరము. 'తాకొని' యర్థమేమో? 'పుత్రులన్ మోకలన్'=కుమారులు అను పులకలను, రూపక సమాసము కుదుర లేదు. అది కుదిరిన ప్రాస తన్నును. అందుకొఱకు 'అన్', 'తాకొని', 'మోకలు': ఇవి నిఘంటువుసహాయమున వేసిన అపరిచిత పదములని సహృదయులెఱుంగకుందురా? 'సుప్రశ్రీకమలాననుల్', ఈ రచయితయొక్క చిన్న సమాసములకును విగ్రహము కష్టసాధ్యము. 'శ్రీ' తరువాత 'కలిగిన' అని సమకూర్చుకొనవలెను. ఇట్టివనేకములు. 'దగ్గరవీశుట' లోనే చేరుట యున్నది. మరలఁ 'జేరిరి' యనవసరము. వినయము సూచించుటకు 'వినమ్రదేహులు' సరికాదు. 'వినమ్రశీర్షులు' అని తోఁచలేదు.

'రామలక్ష్మణులు' అను శీర్షికగల యీ పద్యభాగములో వారు మొదటనొక్కసారి మునికి నమస్కరించినారు. ఈ 'యంతంబు' నందు మునినిఁ జేరినారు. అంతే వారినిఁగూర్చి చెప్పఁబడినది.

ఈ ముప్పదిరెండు పద్యములలోఁ బ్రాచీన సంప్రదాయముగాని, నవీన సంస్కారముగాని, కళాపోషణగాని, సరియైన అలంకారముగాని, వ్యంగ్యముగాని, ధ్వనిగాని, చమత్కారముగాని, యే అందచందములుగాని, నేర్చుకొనవలసిన నీతిగాని వ్యుత్పత్తిగాని లేవు. అన్నియు నిర్జీవములే. తుదకుఁ గథాకథనము గూడ నెంతమాత్రముఁ దృప్తికరముగా లేదు. ఇందులో పురాణధురీణతయు లేదు; ప్రబంధనిబంధనమును లేదు.

ఇతి వృత్తమునుబట్టి కాని కథాసంవిధానమును బట్టిగాని యీ రచనలో విశ్వాసహీనమైన ప్రాచీనానుసరణనిర్బంధనమే పాడుసూపును గాని నాగరకతా విశిష్ట నవ్యమార్గవిహరణము గానరాదు.

ముత్యములవంటి పదములెన్నో భాషలో నిండారియున్నవి. ఈ రచయిత కవేవియుఁ బొడఁగట్టవు. మృదుశబ్దములకేఁ గాక కఠినశబ్దములకును భాషలో నవకాశము గలదని యొప్పుకొనవచ్చును. రసోచితినిఁ బట్టి యాయాపదములు తగుచోట్లఁ బ్రయోగింపఁబడెనేని యాక్షేపణయుండదు. తెనుఁగుఁ బద్యమునకు వలసిన విసురు, నాదము నీ పద్యములందుఁ గానరాదు. మాధుర్యము మచ్చునకైనను లేదు. కవిత్వమున కవసరమైన యుద్రేక మసలే లేదు. ప్రవీణతగలవారు, సంగీతములో సంగతులను విసరినట్లు, భాషావైఖరులలోఁ దాండవమాడవచ్చునే. అట్టిదేదైన నిందున్నదా? ఈ రచనలోఁ బునాదియే కొనరాదు; శిల్పమెట్లుండును?

ఇది స్వచ్ఛగ్రాంథిక శైలియుఁ గాదు; శిష్టవ్యావహారికమును గాదు. ఆస్తికుండనని మభ్యపెట్టి నాస్తికత నవలంబించుటకంటె ఘంటాపథముగా నాస్తికత ననుసరించుటయే మంచిది.

భాస్కరాదిరామాయణములలో నవరసములు చిప్పిలుచుండును. ఈ రామాయణభాగములో నీరసమే గాని యేరసమును లేదు. ఇందున్న దోసఁగులు నాకు గోచరమైనంతవఱకు బయలుపఱచితిని. పండితులు పరిశీలించినచో నింకను గనఁబడవచ్చును. వాల్మీకి భాస్కరులకు విశ్వనాథకు నంతరమెంత గలదో సహృదయులు గ్రహింపఁగలరు.

# నైజగుణం

శ్రీ ఆర్. సూర్యనారాయణ

తెల్లటి బట్టలు వేసుకుని వీధిలోకి బయలుదేరాడు మురారి. వీధి గేటు దాటి రోడ్డుమీదికి అడుగు పెడుతూండగానే, భుజంమీద యేదో పడ్డట్టయి ప్రక్కకి తల త్రిప్పాడు. తెల్లటి చొక్కా మీద డాగుపడింది. మొహం చిట్లించి, తలపైకి యెత్తిచూస్తే పైనున్న రావిచెట్టు కొమ్మమీద కాకి అప్పుడే యెగిరి పోవడం కనిపించింది. ఓసారి మళ్ళీ భుజం చూసుకుని లోపలికి పోవడం కోసం వెనక్కి తిరిగాడు. కాని వెనకాలనుంచి:

"అంతేరా! మురీ! దాని నైజగుణమే అంత! శుభ్రమైన తెల్లటి వాటిని మచ్చపరచి పాడుచేయడమే వెధవ కాకిమూక పని. అలాంటి వాళ్ళు మనుష్యుల్లోనూ ఉంటారు. నైజగుణాన్ని ఎవరూ తగ్గించలేరు కదా!" అంటూ నరహరిదగ్గరకి వచ్చి, భుజంమీద చేయివేసి లోపలికి దారి తీశాడు. ఇద్దరూ హాల్లో కూర్చున్నారు.

"ఏరా నరీ! కనిపించనే లేదు. ఇంతకాలం నుంచి?"

"ఏం చెయ్యనురా! వెధవది ఆఫీసుపనితోటే సరిపోతోంది. ఒకటే ప్రయాణాలు. నువ్వు యిక్కడికి బదిలీ అయ్యావని తెలిసింది. వచ్చినట్టూ తెలిసింది. ఏదీ వచ్చి కలుసుకుందామంటే తీరుబడి అయితేనా?"

"నేను వచ్చిన ఈ వారం రోజులనుంచీ నిన్ను గురించే వాకబు చేస్తున్నా. అంతా క్రొత్త అవడంవల్ల యేం తోచడంలేదు."

"ఊఁ! దానికేంగాని, విశేషాలేఁవిటి? అసలు అక్కడనుంచి బదిలీ ఎందుకయిందిరా? నువ్వే వచ్చేశావా?"

"నేను రావడం ఏమిటి? వాళ్ళే పంపేశారు. "ఏం"అని అడుగుతావుగా నేనే చెప్పేస్తా! ఏముంది? ఆయనకీ నాకూ పడలేదు. ఆయన చర్యల్నీ విధానాన్నీ విమర్శించానుట. 'ట' ఏమిటిలే అన్నమాట నిజం. అందుకని మనస్సులో ఉంచుకుని శెలవలాఖరిని గెంటించాడు."

"అయితే నీ తత్వం మార్చుకోలే దన్నమాట. ఇంకా విమర్శలు వ్యాఖ్యానాలూ చేస్తూనే ఉన్నా వన్నమాట! అయినా..."

"విమర్శ ఏముందిరా! నాకు తోచిన అభిప్రాయం చెప్పడం తప్పా! నేనన్నది అబద్ధమైతేగా."

"అది కాదురా! మురీ! నిజమయినా అప్రియమయితే చెప్పకూడదన్నారు కదురా! ఏమో నువ్వీ పద్ధతి మార్చుకుంటేనే గాని..."

"బాగుపడను. అంతేనా! పోనివ్వరా! నరీ! చదువుకుని, సంస్కారం యేడిసినవాళ్ళం కనక కొన్ని ఆశయాలు, ఆదర్శాలూ ఉండడం అందుకోసం పాటుపడడం సహజం. కాని ప్రపంచం అంతా దానికి వ్యతిరేకంగానే సలహాయిస్తుంది. ఒక్కరూ చేయూతనివ్వరు. ఇంకా శక్తిసామర్థ్యాలున్నాయి. రక్తం వేడిగానే ఉందిగనక ఆశయసిద్ధికోసం వెర్రిగా ప్రయత్నం చేస్తున్నా. కొన్నాళ్ళు పోతే, ఓగి తగ్గితే అందరిలాగే అవుతానేమో! ఈలోగా ఎందుకు నన్ను నిరుత్సాహపరుస్తారు?"

"ఊఁ! ఇక్కడి ఉద్యోగం ఎలా ఉంది. ఏఁవయినా సరిపడేనా?"

"ఇంకా యేదీ! అవునుగాని, ఆయన ఎవరూ! అస్తమానూ ఎవరినో విమర్శిస్తూనే ఉంటాడు. నల్లగా, సన్నగా, చప్పిదవడలూ..."

ఓహో! ఆయనా! శ్రీశైలంగారని. లోయర్ డివిజనులే!"

"అదేఁవిటిరా ఎప్పుడూ వాగుతోనే ఉంటాడు? అందులోనూ ఎదటివాణ్ణి వెధవని చెయ్యడంలో చొరవ ఎక్కువనుకుంటా!"

# నైజగుణం

"పసి గట్టేశావ్! అతని నైజమే అంత. అతని నోటికి జడిసి అంతా ఊరుకుంటున్నారు. అతను ఎందుకు అలా తయారయ్యాడో మన సైకాలజీలో నా కిప్పటికీ సమాధానం దొరక లేదు."

"ఆ చూసిన కాసేపు నాకు అసహ్యం వేసిందంటే..."

"తొందరపడకు. ఆ ఊరులాంటిది కాదు ఈ ఊరు."

అలా మాట్లాడుతూంటే—"మాష్టారూ! అయిదు రూపాయిల చిల్లర ఉంటే యిమ్మంటుంది మా అమ్మ" అంటూ వచ్చింది ఓ పది పదకొండేండ్ల పిల్ల, సన్నగా, నాజూగ్గా, చామనచాయతో, కోలమొహం. అందకత్తె కాకపోయినా చూడముచ్చటగా ఉంది.

"లేదమ్మా! యింట్లోకి వెళ్లి అడుగు. లేకపోతే కావలసిన చిల్లర పట్టుకు వెళ్లు." అని మురారి అనగానే నవ్వుతూ లోపలికిపోయింది.

"ఎవర్రా మురీ!"

"అదిగో. ఆ యింటివారిమ్మాయి. వచ్చినప్పటి నుంచీ చనువుగా ఉంటోంది. వట్టివెర్రిబాగులపిల్ల,"

"ఉఁ హుఁ! ఒరేయి మురీ! నువ్వీ ఊరికి క్రొత్త. ముక్కుకుసూటి వ్యవహారమే గాని ముందు వెనకలు చూడవు. నా మాటమీద విలువ వుంటే ఆ అమ్మాయిని చనువు చెయ్యకు. వస్తాను. పనివుంది. సాయంత్రం పార్కులో కలుసుకుంటావుకదూ?" అంటూ నరహరి హడావిడిగా వెళ్లి పోయాడు. అతను వెళ్లిన దిక్కునే అర్థంకాక చూస్తూ ఉండిపోయాడు మురారి.

నరహరి, మురారీ బాల్యస్నేహితులు. హైస్కూలు చదువూ, కాలేజీ చదువూకూడా కలసే చదివారు. తత్వాల్లోను, అభిప్రాయాల్లో భేదమున్నా యిద్దరి స్నేహానికి యింతవరకూ అంతరాయం కలగలేదు. కారణం ఒకరిభావాల్ని ఒకరు అర్థంచేసుకోవడమే.

నరహరి ఒకవిధంగా ఆశావాది. జన్మతః అదృష్టవంతుడు. కనక మొదటినుంచీ జీవితాన్ని ఆనందంగా చూడడమే అలవాటయింది అతనికి. దానికితోడు యింతవరకూ అతనికి జీవితంలో ఎటువంటి కష్టం ఎదురు కాలేదు. అంచేత అతనికి అసలు చీకటి అనేది ఉందా అని సందేహం.

మురారి తరహా అందుకు సరిగ్గా వ్యతిరేకం. చిన్నప్పటినుంచీ యేదోరకమైన కట్టుబాట్లు, నియమాల్లో బ్రతకవలసిరావడంవల్ల అతని జీవితం ఒక ప్రత్యేకమైన గాడిలోనే పోతున్నట్లనిపిస్తుంది. అంతేకాక అతనికి జీవితంలో అనుకోకుండా పెద్ద అఘాతం లాంటిది తగలడంతో అతనికి జీవితంలో యింక వెలుగు లేదని, యీ నిరాశతో, దిగులుతోనే యీ జీవితం గడపాలనే నిరాశావాదానికి వచ్చేశాడు. ఇంకేవో విధంగా జీవితాన్ని సుఖమయం చేసుకోవాలనే ఆవేదనలో అతను కొన్ని ఆదర్శాలు నిశ్చయాలు యేర్పరచుకొని అవి ఆచరించడంలోను, వానిని సాధించడంలో అవిరళకృషి చేయడంలో తన జీవితభగ్నత్వాన్ని కొంత మరిచిపోగలుగుతున్నాడు. అతని ఈ అంతస్స్వరూపం చూడలేనివారికి అతని బాహ్యప్రవర్తన కొంచెం యిబ్బందిగాను విచిత్రంగానూ ఉంటుంది.

మురారినీ, నరహరినీ కలిపిన ముఖ్యవిషయం-యిద్దరికీ ఉన్న సారస్వతాభిలాష, రసజ్ఞత. చదువుకునే రోజుల్లో యిద్దరూ యెన్నో విషయాలమీద రోజుల తరబడి వాదించుకుంటూనే ఉండేవారు. అందులో నరహరి అంతగా చదవకపోవడంవల్ల మురారి వాదనలో ఏకీభవించక తప్పలేదు. మురారికి తనకన్నా ఎక్కువ తెలుసుననే భావనే నరహరిని అతని స్నేహంలో ఉంచింది. మురారికూడా తన కంటికంటె ఆప్తస్నేహితులు లేకపోవడంవల్ల అప్పుడప్పుడు నరహరికి తన హృదయంలో నిండుకున్న చీకటితెరలు చూపిస్తూ ఉండేవాడు.

అంతకు ముందున్న ఊరునుంచి మురారి ఆ వూరు బదిలీ అయ్యాడు. ఆ ఊరిలోనే కొన్నాళ్ళనుంచి ఉంటున్నాడు నరహరి. ఇద్దరూ ఒకే డిపార్టుమెంటు కావడం ఒక అదృష్టం. ఆ వూరు విషయాలు, ఆఫీసు వ్యవహారాలు నరహరికి తెలిసినంతగా మురారికి తెలియవు. పైగా మురారి పైపై విషయాలు మాత్రమే గ్రహించగలడు, నరహరి కొంత లోపలి విషయాలు కూడా గ్రహించే చాకచక్యం గలవాడు.

ఆ నాడు మురారికి నరహరి అన్న ఆఖరిమాటలే అర్థంకాలేదు. ఆ అమ్మాయిని రానివ్వవద్దంటాడు ఎంచేతో ఎలా చెప్పడం? ఈ వూరు వచ్చిన ఒకటి రెండు రోజుల్లోనే శాంతమ్మగారు తన భార్యతో పరిచయం చేసుకుంది. అనుభవంలేని తన భార్యకి అన్ని

విషయాల్లోనూ పెద్ద దిక్కుగా ఉంటోంది. వచ్చిన పదిహేను, యిరవై రోజుల్లోనే వారికుటుంబంతోనూ యింత కలిసి మెలసి ఉండడానికి ఏ జన్మాంతరసంబంధమో కారణం అనిపిస్తుంది కూడా. నిజం చెప్పాలంటే యిప్పటి కామె ఒక్కసారి తన కంట బడలేదు. పిల్లలు తనని చూడకుండా ఒక్కరోజు ఉండలేరు. అలాంటివాళ్ళని ఎలా కాదనడం? సాయంత్రం తెలుసుకోవాలి ఈ విషయం!

## 2

"ఏమిటిరా నరీ! ప్రొద్దున్న అలా అన్నావ్. ఏం ఆ అమ్మాయిని రానిస్తే..."

"నీకు తెలియవురా తరవాతి ఫలితాలు. ఆ అమ్మాయి అమాయికమైనదే. కాని వారి యింటి చరిత్ర..."

"చరిత్ర కేముందిరా. తండ్రి పోయాడు. తల్లే అన్నీ చూసుకుంటూ వస్తోంది. పెద్దబ్బాయి కొంచెం తిక్కరకం. మిగతావాళ్లు చిన్నవాళ్లు. చాలా కలిసి కట్టైనవాళ్లు లాగే ఉన్నారు."

"నీ కంటే తెలుసు. ఆమె గతజీవితం అంత విశుద్ధమైంది కాదు. భర్తపోయిన క్రొత్తలో ఆమెని గురించి చెడ్డగా చెప్పుకునేవారు. ఇప్పటికీ ఎవరిని కదిలించినా ఆకథ చెబుతారు."

"నువ్వు నమ్ముతావా?"

"ఏదీ నిర్ణయించుకోలేక పోతున్నాను. పది మందీ చెబుతోన్నప్పుడు అబద్ధం అవుతుందా అనే అనిపిస్తోంది. కాని పూర్తి విశ్వాసం కలగడం లేదు."

"ప్రజల నైజగుణం నీకూ తెలుసుగా. ఏమీ లేక పోయినా గాలిపోగుచేసి అభాండాలు వేస్తారు. నువ్వుకూడా..."

"నిప్పులేనిదే పొగ వస్తుందిరా?"

"దొరికిందిరా, దొడ్డప్రశ్న. ఎవరు వేసినా అదే ప్రశ్న. సమాధానం రాని ప్రశ్న. ఏదో చూసి పొగ అనుకునో లేక పొగనే కల్పించో అల్లకూడదూ? సరే నువ్వు ఆమెని చూశావా?"

"ఆ ఒకటి రెండుసార్లు..."

"ఎన్నేళ్లుంటాయి?"

"ముప్ఫయి దరిదాపు."

"అంటే చిన్నపిల్ల కాదన్నమాటేగా. అప్సరసలా ఉండదుకదూ?"

"..........."

"ముప్ఫయేళ్ళ సామాన్య అందకత్తెకి ఆ విధంగా అంటకట్టారంటే ఏమనుకోవాలో అర్థంకావడంలేదు. అయినా ఆమె ఏకాంతంగా నివసించడంలేదు కదా. పిల్లలు-అందులో ఎదిగినవాళ్ళుకూడా-ఉన్న తల్లి, తప్పుదారిని పడిందంటే వీలవుతుందా అని. పోనీ అవుతుందనే అనుకున్నా, ఆ ఒక్క గుణంవల్లా యింక ఆమెలో మంచిగుణాలు, మానవత్వం, ఉపకార లక్షణం ఉండవనీ, ఆమెనింక దగ్గరకు రానియ్యకుండా సంఘంలో దూరంగా ఉంచెయ్యాలనీ అనడం అన్యాయం అంటాను."

"అబ్బబ్బ! నీదంతా వితండవాద నేరా!"

"అవును. దాంతో అందరూ ఏకీభవించరు. పోనీ చదువుకున్నవాడివి నాకు ఆప్తుడివంటివాడివి నువ్వైనా అర్థం చేసుకుంటే చాలు."

"అంచేత ఆ అమ్మాయిని రావడం మాన్పించవలే వన్నమాట."

"ఎలాగరా? వస్తోంటే 'వద్దు పో' అని చెప్పడం యింకా చేతనవడం లేదురా?"

"ఈ ఊరు మంచిది కాదురా. అందుకని...."

"వేస్తే ఆ అభాండం నామీదకూడా వేస్తారు అంటేనా. కానియ్యి నిండా మునిగినవాడికి చలేమిటి?"

* * * *

షికారునుంచి ఇంటికి వస్తూన్నంతసేపూ మురారికి నరహరి చెప్పిన విషయాలే బుర్రలో కదులుతున్నాయి. ఆ ఆలోచనల్లో శాంతమ్మగారే ఎక్కువ స్థానం ఆక్రమించుకున్నారు. ఆమెనిగురించి నరహరి ఎంత చులకనగా మాట్లాడాడు? అసలామె అటువంటిదంటే తను నమ్మలేకపోతున్నాడు. తన భార్యకూడా ఆవిషయంలో ఎటువంటి అనుమానం వెలిబుచ్చలేదు.

అయినా నరహరి అంతగా చెబుతున్న విషయాన్ని తను మనస్ఫూర్తిగా త్రోసివేయలేకపోతున్నాడు. భర్త పోయినక్రొత్తలో ఆమె తప్పటడుగు వేసిందేమో! అప్పటికామె వయస్సు ఏపాతికో ఉండి ఉండవచ్చు. అంతవరకూ అనుభవించిన దాంపత్యజీవిత మాధుర్యం ఆమె వెంటనే మరిచిపోలేకపోయిందేమో?

లేదా అధిరతతో ఆమె హృదయపూర్వకమైన ఆనందం అనుభవించలేకపోయిందేమో! కొందరు మనుష్యులు ఆకలిని అరికట్టుకోలేరు. ఎంత రోగంతో బాధపడుతున్నా, ఎందరు డాక్టరు వద్దని చెప్పినా, అలా చపలత్వంకలవాళ్ళు వాళ్లే బాధపడుతారుగదా మనకెందుకని ఊరుకోకూడదా మిగిలినవాళ్ళు? యిదే తనకి సమాధానంలేని ప్రశ్న. పైగా ఎప్పుడో ఒకసారి కాలుజారిందని యింక ఎల్లకాలమూ అంతేనని యింక ఆ వ్యక్తిలో పశ్చాత్తాపమూ, బాగుపడదామనే కోరిక ఉండదని అనుకోవడం, ప్రస్తుతం ఆవ్యక్తిజీవితవిధానం ఎలాఉందని చూడకపోవడం—యీపొరపాట్లు ఈ లోకం ఎప్పుడు చేయడం మానేస్తుందో కాని

అలా ఆలోచించుకుంటూ యింటికి వచ్చేప్పటికి శాంతమ్మగారి పాప పకళ్లిది నవ్వుతూ ఎదురువచ్చింది. అనుమాన కళంకిత హృదయం కావడంవల్ల వెంటనే చిరునవ్వుతో ఆమెని ఆదరించలేకపోయాడు. కాని ఆమెలోని అమాయకత్వమూ చిలిపి తనం చూసి, తన తెలివి తక్కువకి తనే సిగ్గుపడి, ఆ అమ్మాయితో మామూలుగా ఉండగలిగాడు. ఏ మాత్రం కాస్త అవకాశం వచ్చినా శాంతమ్మగారి విషయమే ఆలోచిస్తూ ఉండేవాడు మురారి.

ఒక ప్రక్క ఈ విధంగా ఉంటే రెండో ప్రక్క ఆఫీసులో కూడా అనేక సమస్యలు ఎదురవుతున్నాయి మురారికి. ఆఫీసులో ఉండే వారి నైజగుణాలు చూస్తుంటే అతనికి ఆశ్చర్యం వేసేది. కొందరు ఎంతసేపూ అధికారి మెప్పుకోసం ఎందుకు ప్రాకులాడతారో, కొందరు ఎదటి వాడి బాగుచూసి ఎందుకు కళ్ళల్లో నిప్పులు పోసుకుంటారో, కొందరు ఎప్పుడూ, అకారణంగానే ఎందుకు ఎదటివారిని విమర్శిస్తుంటూ ఉంటారో అతనికి అర్థం కాలేదు. పోనీ యిందువల్ల వారేమైన ప్రత్యేక ప్రయోజనం సాధించారా అంటే యేం లేదు. ఇటువంటి వాతావరణంలో తాను తప్పకుండా వేరుచేయబడి విమర్శలకి. అయిష్టాలకీ ఆగ్రహాలకీ గురికావలసి వస్తుందని ఎందుకో అనుమానం వేసింది మురారికి. అందుకని తన ఆదర్శాలు, ఆశయాలు మానుకుని వారితో ఒకడై పోవడమా? నిగ్రహంతో ఎదురునిలిచి కాపాడుకోవడమా? తీరనిసమస్య అయిపోయింది అతనికి.

అందులోనూ ఆ శ్రీశైలం ఎందుకు తనమీద అంత యిదిగా ఉంటాడో అర్థంకాలేదు మురారికి. తన డివిజను కాదు. తానెప్పుడూ అతని ప్రస్తావన తేలేదు. తనకీ అతనికీ అంత పరిచయంకావలసిన అవకాశం లేదు. అయినా ఎందుకు అతడు తనని, తన వేష భాషలనీ అంత యిదిగా విమర్శిస్తున్నాడో ఎంత ఆలోచించినా తెగలేదు. చివరికి మొట్టమొదటి రోజున నరహరి చెప్పిన విషయం చటుక్కున జ్ఞాపకం వచ్చి నవ్వుకున్నాడు మురారి.

## 3

రోజురోజుకీ శ్రీశైలం మురారినిగురించి చేసే విమర్శలు మితిమీరుతున్నాయి. అయినా మురారి లెక్క చేయడంలేదు. తన పనేమో, తన గొడవేమో అనే ధోరణిలో పోతున్నాడు. ఒకరోజున నరహరి హడావిడిగా వచ్చి

"నీమీద పడ్డాడేంరా ఈ శ్రీశైలం? ఒట్టి విమర్శలు ఒకటే వ్యాఖ్యానాలు?"

"మామూలేగా?"

"అయితే నే చెప్పేదేముంది? అంతకంతకీ శృతిమించుతోందనే చెప్పడానికి వచ్చాను. మొన్న ఆవూరు వెళితే శాస్త్రి చెప్పాడు, నిన్నుగురించి వీడు అక్కడ ఒకటే గొడవట. అక్కడ నీ ప్రవర్తన పాడయిపోవడంవల్లనే ఇక్కడికి బదిలీచేశారట! ఇంకా..."

"అందుకనే ఆ వూరిలో చాలామందికి ఫామిలీ ఫ్రెండ్ అయ్యాను. అయినా నరహరీ! అప్పుడప్పుడు నాకు ఈ విమర్శలు విని మనస్సు పాడుచేసుకోవాలో, లెక్క చేయకుండా తిరగాలో అర్థం కాదురా? ఎంత కాదనుకున్నా, ఏమీ లేనిదానికి అపనిందవేశారే అని మనస్సు బాధపడుతూనే వుంటుందిరా? ఆత్మవిశ్వాసం కలవాణ్ణి కనక నెట్టుకువస్తున్నా"

"నువ్వు బాధపడతావని నాకు తెలుసురా! ఐనా చెప్పకపోతే నీకు విషయాలు సరిగ్గా అర్థంకావని చెప్పడం. వాడి నైజమే అంత అని చెప్పాను కదరా! అంతేకాదు, ఆ అమ్మాయితల్లి నిన్ను పట్టిందనికూడా అంటున్నాడుట ఒకటే రెండు చోట్ల. ఇదే నలుగురి నోళ్లలోను..."

"పడుతుందంటావ్. కానియ్యి. ఇంకేం చేస్తాడు?"

"అదికాదురా! పోనీ ఇప్పటికయినా..."

"ఒరేయి నరీ! ఒకమాట చెబుతాను విను. ఎవరి నైజగుణాన్ని ఎవరూ మానరని నువ్వే అన్నావుగా. అకారణంగా ఇలాంటి అపవాదులు లేవదియ్యడంవల్ల దీని అంతం చూడాలనే పట్టుదల యెక్కువౌతోందిరా! సరే తక్కువలక్షణం నా నైజగుణం అని నీకు తెలుసుకదా! కానియ్యి యేం జరుగుతుందో?"

"నీ యిష్టం మరి." అని వెళ్లిపోయాడు నరహరి.

మురారి ఆలోచనలో పడ్డాడు. చివరికి అనుకున్నంతా అయింది. ఈవిషయం తెలిస్తే శాంతమ్మ

గాడు ఎంత యిదయిపోతాడో? యింక పాప తనింటికి రావడం మానేస్తుందేమో? తనకి కాలక్షేపం అయ్యే అవకాశం ఉండదేమో? అయినదానికీ, కానిదానికీ ఆదుకునే పెద్దదిక్కు యింక తనకుటుంబానికి ఉండదన్నమాట!

అయినా యీ వాదు వేసేవారు మంచి చెడ్డలు చూడరేమో అని మురారికి ఆశ్చర్యం. తన వయస్సెంత, ఆమె వయస్సెంత? మహా ఉంటే తనకంటె ఆమె రెండుమూడేళ్ళు పెద్దయేమో? అంటే తన అక్కయ్యన్నమాట. ఛీ ఛీ మనుష్యులకి అసలు విచక్షణ లేకుండా పోయిందేం? ఈ విషయం ఆలోచిస్తోంటే మురారికి యింకో అనుమానం కూడా బయలుదేరింది. ఈ విషయమే అనోటా, ఆనోటా తన భార్యకి కూడా తెలిస్తే ఆమెనమ్మితే ఇంక తనసంసారం? పైన ఊహించలేకపోయాడు. చివరికి యేది యేమయినా సరే శాంతమ్మగారి కుటుంబంతో తనకుటుంబానికుండే పరిచయం పాడవకూడదనే దృఢనిశ్చయానికి వచ్చేశాడు మురారి.

అటు నరహరికూడా అనేకవిధాల యిదయిపోతున్నాడు తన ఆప్తమిత్రునిమీదపడ్డ యీ నీలాపనిందకి. మిగిలిన స్నేహితులు శ్రీశైలం ఎంతఘట్టిగా వాదిస్తున్నా, మురారి అలాంటివాడంటే అతని అంతరాత్మ ఒప్పుకోవడం లేదు. అక్కడికీ, శ్రీశైలాన్ని నరహరి ఎక్కడికక్కడ ఖండించుకుంటూ వస్తూ, మురారిపైన అతనికి యేర్పడిన దురభిప్రాయాన్ని తొలగించడానికి ప్రయత్నించాడు. ప్రతివాదానికీ యేదో విపరీతఅర్థం చెప్పి తన అనుమానాన్ని బలపరచేవాడు శ్రీశైలం. కావలసివస్తే తాను మరో అవినీతి ప్రవర్తనని సోదాహరణంగా నిరూపిస్తానని నరహరితో శ్రీశైలం ఛాలెంజి కూడా చేశాడు.

* * * *

ఒకరోజు రాత్రి నరహరి యింటికి హటాత్తుగా వచ్చాడు శ్రీశైలం. తన వాదానికి సాక్ష్యం చూపిస్తానని, అంతకుముందే మురారి శాంతమ్మగారింటికి వెళ్ళినట్టు ప్రబల నిదర్శనం దొరికిందని, తానువచ్చి చూసుకోవచ్చుననీ చెప్పాడు నరహరితో. శ్రీశైలం నైచ్యానికి ఒకప్రక్క కోపం, స్నేహితుని అవస్థకి ఆవేదన ఒక్కసారి పెల్లుబికాయి నరహరికి. వెళ్ళకూడదనుకుంటూనే శ్రీశైలంవెంటనడిచాడు నరహరి. వీధి మొగలోకి వచ్చినతర్వాత శాంతమ్మగారి యింటివైపు పరిశీలనగా చూస్తూ నుంచోమని మురారి ఆయింటిలోంచి రావడం తథ్యమనీ శ్రీశైలం నొక్కి చెప్పాడు. కొద్దిసేపటికి గూడకట్టులో ఎవరో శాంతమ్మగారింటిలోంచి మురారియింటివైపు రావడం కనపడింది. నరహరికి అనుమానం, శ్రీశైలానికి ఆనందం ఒక్కసారి కలిగాయి. కాని ఆ వచ్చిన వ్యక్తి మురారి యింటిముందు నిలచి "మురారిగారూ!" అని పిలవడం, మురారి బయటకు వచ్చి మాట్లాడ్డం చూసిన నరహరి కోపం ఉండబట్టలేకపోయాడు.

"అయిందా నీప్రతాపం. అతను శాంతమ్మగారి పెద్దబ్బాయి. ఏదో పుస్తకం ఇవ్వడానికి వచ్చాడు. శ్రీశైలం నీకిదేం బుద్ధోయ్? ఎంతసేపు ఎదటివారిమీద అభాండాలు వేయడమే నీబ్రతుకయిందికదా? వాడి పేరుని కళంకపరుస్తే నీకేం వస్తుందోయ్" అని నాలుగూ అనేశాడు.

"అమ్మ! మీవాడా......" అంటూ తప్పుకున్నాడు శ్రీశైలం.

ఆనాటి సంఘటనలో శ్రీశైలానికి కొంచెం చిన్నతనం అనిపించింది. అందుచేత తన అనుమానం నిరాధారంకాదని ఎప్పటికైనా నరహరిచేత ఒప్పించాలని అతను శతవిధాల ప్రయత్నంచేస్తున్నాడు. పట్టుదల ఎక్కువఅవడంవల్ల మురారిప్రవర్తనని మహా నిశితంగా పరిశీలించడం మొదలుపెట్టాడు.

ఒకనాటి సాయంత్రం అప్పుడే చీకటిపడుతూంది శ్రీశైలం నరహరిని హడావిడిగా వెంటబెట్టుకుని వస్తున్నాడు మురారియింటివైపు. నరహరికి అర్థంగావడం లేదు, ఎంత అడిగినా యేం చెప్పడంలేదు శ్రీశైలం. ఆఖరికి వారియింటిముందుకువచ్చాక శ్రీశైలంకటువుగా "మొన్నటిసారి ఆ లచ్చిగాడు చెప్పినమాట పట్టుకుని నీకుసాక్ష్యం చూపించలేకపోయాను. చీవాట్లుతిన్నాను. ఈసారి నాకు స్వయంగా దొరికిందిసాక్ష్యం. శాంతమ్మ యిప్పుడే మురారియింటిలో ప్రవేశించడం నాకళ్ళారా చూశాను. ఈ సమయంలో ఆ మహాతల్లికి మీ ప్రియస్నేహితుడియింట్లో పనేమిటోయ్?"

నరహరి మెల్లిగా అంటున్నాడు.

"నిజమే. నువ్వు చూశావా? అన్యాయంగా ఒకరిని......"

"పిలవ్వోయ్ మీవాణ్ణి. తేలుతుంది భాగోతం"

ఇంకేం అనలేక నరహరి తలుపు తట్టుతూ "మురారీ మురారీ!" అని పిలిచాడు. రెండుమూడుసార్లు పిలిచినతరవాత "లేరండీ" అనే సమాధానం వినిపించింది ఆగొంతుక మురారిభార్యది కాదని నరహరికి ధృవపడిపోయింది. అయితే మరి ఆగొంతుక శాంతమ్మగారిదేనా? శ్రీశైలం అనుమానం ... అతనికి మతిపోతోంది. శ్రీశైలం విషపునవ్వు అతనికి దుర్భరం అయిపోతోంది. ఏం చెయ్యడం?

"అదేమిటిరా అక్కడ నుంచుని యేంచేస్తున్నావు?" అనే ప్రశ్నతో తల పైకెత్తాడు

యిద్దరూ. రెండు చేతుల్లోనూ మందుసీసాలు, పొట్లాలూ, పళ్లు పుచ్చుకుని మురారి వస్తున్నాడు. శరీరమంతా ఒక్కసారి తేలికయినట్లయింది నరహరికి. కాళ్లక్రింది భూమి తిప్పుకుంటూన్నట్లనిపించింది శ్రీశైలానికి.

"అదేమిటిరా?" అని మాత్రం అనగలిగాడు నరహరి.

"మందులురా! రెండురోజులనుంచి మా ఆవిడకి జ్వరం డోకులు. నానాయిబ్బంది పడుతున్నాననుకో. పాపం ఆ శాంతమ్మగారు పిలువనప్పటికీ వచ్చి చూసి ఆదుకుంటున్నారు కనక సరిపోతోంది లేకపోతే..."

"చెప్పావుకాదేంరా? విన్నారా శ్రీశైలం గారూ! రండి మనం వెళదాం." అంటూ లాక్కుపోయాడు నరహరి. మురారి యేం అర్థంకాక తెల్లబోయాడు.

## 4

కొద్దిరోజుల తరవాత కలుసుకున్నప్పుడు నరహరి, మురారి కంతా చెప్పాడు. అతని ఈ అర్థంలేని పగ ఎందుకో అని మురారి ఆశ్చర్యపోయాడు. నరహరే అన్నాడు.

"కొందరు కొందరు మనుష్యులు అంతేరా? ఏం ప్రయోజనం లేకపోయినా ఎదటివారు సుఖంగా ఉంటే ఓర్వలేరు. తేలుకుట్టడానికీ కాకి రెట్టవేయడానికీ కారణం ఎవరు చెప్పగలరు?"

"అదికాదురా మానసికశాస్త్రం ప్రకారం తమ కోర్కెలు తీరనివాళ్లు, అవి ఎదటివారిలో తీరుతున్నట్టు చూసినప్పుడు వారిమీద ద్వేషంతో ఉంటారేమో! అది ఒక్కటే తప్పిస్తే మనిషి మంచివాడిలాగే కనపడతాడు. చాలా బాగా పాడతాడు. మంచి నటకుడు. అయితే నేం..."

"వాడి నటనమాత్రం బాగుంది యేడిసింది కనకనా ఎదటివారిని తప్పు పట్టడానికి. అయ్యగారి భాగోతం తెలియనివారి దగ్గర చెప్పు ఈ కబుర్లు."

అంతలోకే శాంతమ్మగారి పాపవచ్చి "మా అమ్మ యేడుస్తోందండి మామయ్యగారూ! ఈ ఉత్తరం మీకు యిచ్చి రమ్మందండి." అంటూ ఒక ఉత్తరం యిచ్చి వెళ్లింది. మురారి అందుకుని నరహరికి యిచ్చాడు. చివరిదాకా చదవకుండానే నరహరి ఒక్కసారి నుప్పమన్నట్టుగా

"ఛండాలుడు. చివరకి ఎంతకి ఒడిగట్టాడు. ఈసారి కనిపించనీ పీడిపని చెబుతాను. ఎదటివాడిమీద లేపడం అనుకున్నాడు కాబోలు వె......" అని అరిచాడు.

మురారికి అర్థంకాక "ఏమిటిరా?" అని అడిగాడు. సమాధానం చెప్పకుండా ఆ ఉత్తరం అందించాడు. చదువుకున్న మురారి మొహంలో బాధ స్పష్టంగా కనిపిస్తోంది. "పాపం అందుకే యేడుస్తోంది కాబోలు శాంతమ్మగారు, నే చెప్పలేదురా! ఇది కూడా ఒక మానసికవ్యాధి లక్షణం అని, అయినా......" అని అంటూంటే శ్రీశైలం పరుగెత్తుకుంటూ వచ్చాడు. "నరహరీ! నరహరీ! నీ కోసం మీ యింటికి పరిగెత్తాను. బాబ్బాబు ఒక పదిరూపాయలుంటేయిద్దూ నీకు పుణ్యం ఉంటుంది. మా ఆవిడ చావుబ్రతుకుల్లో ఉంది. ఇంజక్షన్ యిస్తేనే గాని......" అంటూ చేతులు పట్టుకోబోయాడు. నరహరి యింక ఉండబట్టలేకపోయాడు.

"పోనియ్యవోయ్ శ్రీశైలం. ఆవిడ పోతే నేం ముందుప్రయత్నాలు చేస్తున్నావుగా! సమాధానం వచ్చేదాకా చూడు."

"వేళాకోళం కాదు నరహరీ! చాలా అవసరం" అని చేతులు పట్టుకున్నాడు శ్రీశైలం. విదిలించుకుని:

"ఛీ పాపాత్ముడా! నీ స్పర్శ తగిలితే నే పాపం. దూరంగా ఉండు. నీ నైజగుణంవల్ల ఎందరిని ఉసురు పెట్టావో అది తగలకుండా పోతుందా? ఏమిటీ వెధవ పని?" అని ఉత్తరం చూపించాడు.

శ్రీశైలం యేం మాట్లాడలేక నుంచున్నాడు. అతని మొహంలో ఆవేదన అవమానం కలిసి నల్లగా వ్యాపించాయి. అంతకన్నా నిరాశాజీవి ఉండడనిపించింది మురారికి. చటుక్కున లోపలికివెళ్లి పది రూపాయలనోటు పట్టుకువచ్చి,

"శ్రీశైలంగారూ! యిదిగో పట్టుకువెళ్ళి యింజక్షన్ కొనుక్కోండి. మావాడు కొంచెం విసురుమనిషి. వాడిమాటలు లెక్కచేయకండి." అంటూ అందిచ్చాడు.

శ్రీశైలం తన చెవులని తాను నమ్మలేకపోయాడు. మెల్లగా సంబాళించుకుని వణుకుతున్న చేతులతో బాటు మురారిచేతులు పట్టుకుని శ్రీశైలం:

"మురారిగారూ! మీరు నిజంగా దే..." అని అంటూంటే,

మురారి మాటకి అడ్డువచ్చి,

"ముందు మందు పట్టుకురండి." అంటూ సాగనంపాడు. మెట్లుదిగుతున్న శ్రీశైలం పైగుడ్డతో కళ్ళు ఒత్తుకోవడం చూసి మురారి ఒక్క నిట్టూర్పు విడిచాడు.

అర్థంకాక చూస్తున్న నరహరి భుజంతడుతూ "నువ్వన్నమాటేకదరా? ఎవరి నైజగుణాన్ని ఎవరు మార్చుకోగలరు?" అంటూ లోపలికి తీసుకువెళ్ళాడు.

# రష్యా యువ మేధావులు

కేథరిన్ ఫోర్

* గత సంచిక తరువాయి

ఐరోపా అమెరికాలలో కూడా చదువుకున్నవారిలో ఎక్కువమంది తెలివితేటలలో చాలా సంసార పక్షంగానే కనిపిస్తారు. వీరిలో అంతగా చెప్పదగ్గ ప్రత్యేక శక్తులు కనిపించవు. ఈ బాపతు జనాభా రష్యాలోను ఉన్నారు. అయితే వీరికీ వారికీ ఒక పెద్ద తేడా కనబడుతుంది. ఐరోపా అమెరికాలలో ఇలాంటి వారంతా పత్రికాస్వాతంత్ర్యాన్ని, పార్లమెంటరీ ప్రజాస్వామ్యాన్ని, కళారంగంలో కొత్త కొత్త ధోరణులు—అన్నీ తమకు సంప్రదాయ సిద్ధంగా సంక్రమించిన వారసత్వమనే భావిస్తారు.

రష్యాలో ఒక మాసం రోజులపాటు పర్యటించిన, తరవాత — ప్రతిపక్షం మాటే వినిపించని రష్యాదేశంకంటె ప్రతిపక్ష సంప్రదాయం యథాతథంగా అంగీకరించే ప్రజాస్వామ్య దేశాలంటే నే నాకెక్కువ అభిమానం ఏర్పడింది. అమెరికాలో మధ్యతరగతి కుటుంబాలలో సామాన్యంగా వాన్‌గో పొద్దుతిరుగుడు పువ్వుల చిత్రాల నకళ్లు వేలాడగట్టుకుంటారు. రష్యాలో ఎక్కడచూసినా బ్రహ్మాండంగా ఉపన్యసిస్తున్నట్టున్న లెనిన్ ప్రచారచిత్రాలే! నాకా లెనిన్ చిత్రాలకన్న వాన్‌గోచిత్రాల నకళ్ళే నయమనిపించాయి! ఎంతతీసివేసినా వాన్‌గో సుప్రసిద్ధ చిత్రకారుడు గదా!

రష్యాలో మేధావులకు, సామాన్య జనానికీమధ్య ఒక తేడా కనబడుతుంది. మేధావులలో చాలామంది రష్యాలో జీవితపరిస్థితు లన్నీ చక్కగా ఉన్నట్లే మాట్లాడతారు. వీరినోట వాటికి సంబంధించిన విమర్శనలు వినిపించవు.

రష్యాలో జీవితపరిస్థితుల్నిగురించి విమర్శించే వారెక్కువగా విద్యార్థులు. కొందరు చిన్న చిన్న వర్తకులు కూడా ఇలాంటి విమర్శనలు చేయడంకద్దు. ఒకసారి నేనొక షాపులోకివెళ్లి 3 రూబుల్లిచ్చి ఒక పాటలపుస్తకం కొన్నాను. "అమెరికాలో అయితే ఈ డబ్బుతో ఒక సూటు కొనుక్కోవచ్చును!" అన్నాడాదుకాణంమీద కూర్చున్న ఆసామీ. నేనెంత కాదనిచెప్పినా అతగాడు నామాట వినిపించుకోలేదు. నాకు పరిచితుడయిన ఇంకొకవ్యక్తి ఇంతకన్నా విడ్డూరంగా మాట్లాడాడు.

రష్యాలో విద్యార్థులు చాలామంది విద్యార్థి వేతనాలమీదే కాలక్షేపం చేస్తూంటారు. నేను వారి మర్యాదా ఆదరణలు చూచి నిర్ఘాంతపోయాను! వారిలో కొంతమంది నాకెన్నో బహుమతు లిచ్చేవారు. చివరికి నేనీ మర్యాదాదరాలు భరించలేనంత స్థితికి వచ్చేశాను. ఒకవిద్యార్థి "మీకు పువ్వులంటే ఇష్టమేనా?" అన్నాడు. నేనిక భరించలేక పువ్వులంటే నాకు బొత్తిగా ఇష్టంలేదు!" అన్నాను. అతగాడు కొంత ఆశ్చర్యపడ్డాడు. ఎలాగైనా ఆబహుమానాల బారి వదిలించుకోడానికే నేనలాగ మాట్లాడాను. రూబుల్ డాలర్ మారకంరేటు విపరీతంగా పెరిగినా లక్ష్యపెట్టకుండా చాలామంది నాకెన్నో బహుమతు లిచ్చారు.

ఒకసారి ఒక విద్యార్థి నాతో మాట్లాడుతూ తన కుటుంబం ఇంకొక కొత్తవాటాలోకి మారిపోతూందని అన్నాడు. పూర్వపు వాటాలో 6 కుటుంబాలున్నాయనీ అందుచేతనే కొత్తవాటాలోకి మారుతున్నామనీ చెప్పాడు. నేను కొంచెం లౌక్యంగా మాట్లాడి ఉండవలసింది. కాని అతని పరిస్థితి విని కొంచెం జాలిపడుతున్నట్లు మాట్లాడాను. దానిమీద అతను వెంటనే సర్దుకున్నాడు:

"అబ్బే! ఆ ఇల్లు చాలాబాగుంది. బాగా పెద్ద వాటా. అయితే అది మాకంత బాగాసరిపోలేదు."

# రష్యా యువమేధావులు

అని పరస్పర విరుద్ధమైన వాక్యాలతో నీళ్ళు నమిలాడు. అతనికి తానన్నమాటల్లో పూర్వాపర విరోధం ఉన్నదని పూర్తిగా బోధపడింది.

చాలామంది విద్యార్థులు తమకు ముందు ముందు పెద్దపెద్ద ఉద్యోగాలు వస్తాయనే ఆశతో ప్రస్తుత పరిస్థితులను గురించి అంతగా పట్టించుకోరు. తమ పరిస్థితులంతగా బాగుండకపోయినా విద్యార్థులు గోడు పట్టించుకోక పోవడానికిదే ముఖ్య కారణమై ఉంటుంది. రష్యాలో గొప్పగొప్ప కళాకారులు, ఇంజనీరులు, శాస్త్రవేత్తలు చాలా పెద్ద పెద్ద జీతాలే తీసుకుంటారు. నేనొకసారి పాశ్చాత్య దేశాలలో శాస్త్రవేత్తలు వ్రాసిన వ్యాసాలకు ప్రతిఫలం ఇచ్చే అలవాటు లేదనీ, కొంతమంది శాస్త్రవేత్తలు తమ వ్యాసాలు ప్రకటించినందుకు కొద్దో గొప్పో ముట్టజెప్పడంకూడా కద్దనీ అన్నాను. ఆ మాటలు విని రష్యా శాస్త్రజ్ఞులు కొందరు నిర్ఘాంతపోయారు!

అమెరికాలో గ్రంథకర్తలు తీసుకునే రాయల్టీల అంకెలు విని కొందరు రష్యా రచయితలు చాలా జాలిపడ్డారు. "పాపం! అంతంత చిన్న మొత్తాలా?" అని రెట్టించి రెట్టించి అడిగారు. మరి కొందరు హేళనగా నవ్వారు. విద్యార్థులు సామాన్యంగా తమకు ముందు ముందు పెద్దజీతాలందుతాయనే అనుకుంటూ ఉంటారు. చాలామందికిది చాలా సామాన్యంగా జరిగే సంఘటనలాగే కన్పించింది. వీరిలో కొద్ది మొత్తాలతో కాలం గడుపుకునే ఆత్మత్యాగ ధోరణి చాలా తక్కువ. కాని కొంతమంది వస్తుప్రదర్శనశాలలలోను, గ్రంథాలయాలలో చిన్న చిన్న ఉద్యోగాల కోసం కూడా ఆశిస్తారు. ఇలాంటి ఉద్యోగాలలో స్వాతంత్ర్యంపాలెక్కువ. జీతాలు తక్కువైనా తమకిష్టంఉన్న విషయాలమీద పరిశోధనలు సాగించుకో వచ్చును. శాస్త్రపరిషత్తుల లోను, విశ్వవిద్యాలయాల లోను పై అధికారుల అధికారం - హంగామా జాస్తి. కనుకనే విద్యార్థులీ చిన్నచిన్న ఉద్యోగాల కెగబడతారు.

పాశ్చాత్యదేశాల సౌఖ్యాలు, జీవిత సౌకర్యాలు నానాటికీ హెచ్చుపెరిగి పోతున్నాయి. మన పాశ్చాత్య దేశాల జీవనప్రమాణాల అంతరువులలో కూడా కొంత తారతమ్యం కనిపిస్తుంది. ఇవన్నీ బేరీజు వేసుకుని చూసినా రష్యాలో ఆర్థిక పరిస్థితులు, జీవిత సరళి చాలా క్లిష్టంగా కనిపిస్తాయి. ఈ క్లిష్ట పరిస్థితుల ప్రభావం మేధావుల మీద కూడా ప్రసరించింది. యుద్ధ కాలంలో రష్యావారు అనేకమైన బాధలనుభవించారు. అందుచేత ప్రస్తుత పరిస్థితులు చూసుకుని రష్యాదేశీయులంతా హాయిగానే ఉన్నామని అనుకుంటున్నారు. మేధావులు కూడా తమసాధారణసౌకర్యాలతోనే తృప్తిపడతారు. చాలామందియుద్ధకాలంలో ఎన్నెన్నో ఇబ్బందులు పడ్డామని ఎంతో విడ్డూరంగా చెప్పుకుంటారు. కొందరది అంతా సహజమేఅన్నట్టు మాట్లాడతారు. కాని అందరు, లెనిన్‌గ్రాడ్‌నగరం ముట్టడి సమయంలోఒకటిబాధతో ఉటంకించామనేఅంటారు. ఆఇబ్బంది ఏవోకొన్ని రోజులతో అంతరించలేదు కొన్ని సంవత్సరాలలాగే కొనసాగింది. నేను లెనిన్‌గ్రాడ్ నగరంలో ఉన్నప్పుడు--ఎక్కడికివెళ్ళినా—"యుద్ధం రోజుల్లో 125 గ్రాముల రేషనింగే!" అన్నమాట ఏకగ్రీవంగా వినబడింది. ఆమాటఅనడానికెవరు బిడియపడ లేదు! తమఇబ్బందులు కప్పిపుచ్చడానికెవ్వరు ప్రయత్నించలేదు! నేనక్కడ ఉన్న రెండుమూడు రోజులలోను, యుద్ధపు రోజులలో బాధపడిన వారినిట్టే కనిపెట్టివేశాను. లెనిన్‌గ్రాడ్ నగరం ముట్టడి తొమ్మిది వందల రోజుల వరకు ఏకధాటిగా కొనసాగింది. కీవ్ నగరానికి కూడా ఇలాంటి అవస్థే పట్టింది. అన్న వస్త్రాల కేలోటు లేకుండా ఇప్పుడందరికీ అన్ని సౌకర్యాలు ఏర్పడ్డాయి. కాని యుద్ధపు రోజుల్లో లెనిన్‌గ్రాడ్ నగరంలో చిక్కుపడిన వారందరి ముఖాలలోను వార్ధక్య చిహ్నాలేర్పడ్డాయి. ఆ సమయంలో లెనిన్‌గ్రాడ్ నగరం ఖాళీ చేసివచ్చిన వారిలో ఈ చిహ్నాలు కనబడలేదు. వీరంతా ఎంతో ఖులాసాగా ఉన్నట్టు కనిపిస్తారు. వారికీ వీరికీ తేడా ఇది.

రష్యా పౌరులింతకు పూర్వం ఎన్నెన్నో ఇబ్బందులు పడ్డారు. అందుచేత అందరికీ చక్కని మర్యాదా ఆదరణ లలవడ్డాయి. గట్టిగా మాట్లాడ్డం కూడా అమర్యాదే! అతిగా అభినయిస్తూ మాట్లాడడం కూడా అనాగరక చిహ్నమే! నేటి రష్యా పౌరులలో మర్యాదాదరాలెంతో విచిత్రంగా కనిపిస్తాయి. కాని సామాన్యపౌరుల మర్యాదదారాలకు, పెద్ద పెద్ద జీతాలతో జేబులు నింపుకునే అధికారుల మర్యాదాదరాలకు చాలా తేడాఉంది. ఈ అధికారులు పైజామాలు వేసుకుని పెట్టెలు పెట్టెలు సిగరెట్లు తగలబెడుతూ

చాలా చాలా ఎబ్బెట్టుగా కనబడతారు. వీరి మోటుదనం దుర్భరం! సామాన్యపౌరులలో మర్యాద చాలా సహజంగా అమాయికంగా ఏర్పడినట్టు కనబడుతుంది. ఒకసారి నేనొక బస్సులో ప్రయాణం చేస్తున్నాను. నాపక్కన ఒకవ్యక్తి కూర్చున్నాడు. అతని కిదివరలే వివాహం స్థిరపడింది. ఆనూతన వధువుకూడా అతని పక్కనే కూర్చుంది. ఇంతలో ఆమె ఒకచోట దిగిపోవలసి వచ్చింది. ఆమె నాతోను, ఆ వ్యక్తితోను కరచాలనం చేసింది. అతడామె బస్సుదిగి వెళ్ళిపోయేదాకా అలాగే నిలబడి ఉన్నాడు. ఎవరైనా కొత్తవారొకచోటికి వస్తే, వారి మర్యాదకోసం అక్కడ కూర్చున్నవారంతా కుర్చీలు, బెంచీలు సర్దుతూ నానాహంగామా చేస్తారు. వారి గౌరవ సత్కారాలలో గొప్ప మర్యాద, హుందాతనము కనిపిస్తాయి. ఆ దేశంలో ఉన్నప్పుడు నా కొక స్త్రీతో కొంచెం బాగా దోస్తీ కలిసింది. ఆమె నాకు సమాన వయస్కురాలే! అయినా నాకు రాసిన ఉత్తరంలో "మహా గౌరవనీయురాలయిన కేథరిన్ ఫోర్...అని మొదలు పెట్టింది. ఆ ఉత్తరం చదువుతూంటే నాకు ఈట్స్ కవిత్వము, కలలు జ్ఞాపకం వచ్చాయి. మర్యాదా సత్కారాల నీలి తెరల మాటున అస్తవ్యస్త మయిన సాంఘిక పరిస్థితు లెన్నైనా కప్పబడివుండవచ్చునని నాకప్పుడు స్ఫురించింది.

రష్యా పౌరుల వినోదవ్యాసంగాలు కొన్ని చాలా సరళమైనవి. కొందరు చాలా దూరందాక షికారు వెళ్ళి ఒకకప్పు టీతో సంతృప్తిపడతారు. కొందరు చిత్ర చిత్రమైన హాస్యకథలతో తమ సంభాషణలు సాగిస్తారు. బహుశః పరస్పర విరుద్ధ పరిస్థితుల ఉదాహరణ ద్వారా ఈవిషయం ఇంకా విస్పష్టంగా వివరించవచ్చుననుకుంటాను. డాబుసరిగా దుస్తులు వేసుకుని పెద్ద హంగామా చెయ్యడం ఎక్కడా కనబడదు. అల్లాగే ముక్తసరిగా సరిపెట్టుకుపోవడంకూడా బాగాతక్కువే. బ్రాడ్వే (అమెరికా) లోను పారిస్‌లోను కనిపించే ఫాషన్లతో సరిపోల్చతగిన హంగామా అసలే కనిపించదు. పైరెండు నగరాలలోను కళాకారులు డాబుసరిగా దుస్తులు వేసుకుని వాటితో తమశక్తి సామర్థ్యాలుకూడా మేళవించి ఒకవిధమైన తాత్కాలిక శిల్ప వాతావరణం సృష్టించుకుంటారు. ఇక్కడి రచయితలలో గడ్డాలు, మీసాలు పెంచుకొని స్వేచ్ఛగా విహరించేవారు చాలాతక్కువ. అయితే నాకిలాంటి కవి ఒకడు తటస్థపడ్డాడు.

చూస్తేఏదో నాటకంలో వేషంలా కనిపించాడు. యతిప్రాసలులేని కవిత్వం మీద దుమ్మెత్తిపోశాడు. అలాగే పతనావస్థలో పడిన పాశ్చాత్య కళలమీద ఘాటుగా విరుచుకుపడ్డాడు. బహుశః ముందుముందు యథేచ్ఛా ధోరణి రష్యాలో కూడా తలెత్తవచ్చును. ప్రస్తుతం దానికి తగిన పూర్వరంగం అంతా సిద్ధంగాఉంది. ఆకతాయిపిల్లల అల్లరి చిల్లరి ధోరణుల హంగామాలలో ఈసూచనలు కొంచెం కొంచెం తలెత్తున్నాయి. ఈ పరిస్థితులలో ప్రస్తుత పరిస్థితులపై తిరుగుబాటు సాగించే మేధావివర్గం కూడా ఏర్పడితే ఏర్పడవచ్చును. అయితే దీనికి ముందుగా దేశంలో బాగా శాంతిసౌఖ్యాలు, భోగభాగ్యాలు డాబుదర్పాలు ఏర్పడాలి. వాటిమీద కొంచెం విసుగుదల పుట్టినప్పుడే మేధావివర్గంలో కొంత సంచలనం బయలుదేరుతుంది. ప్రస్తుతం రష్యాలో అలాంటి సంచలనానికి కవకాశా లేవీ కనబడవు.

అమెరికా సాంఘిక శాస్త్రజ్ఞు లనేకులు రష్యా సాంఘిక స్వభావాన్ని గురించి కొన్ని వ్యాఖ్యానాలు చేశారు. సోవియట్ రష్యా జనంలో అంతర్లీనమై అణిగి మణిగి ఉన్న శక్తి సామర్థ్యాలు ఒక్కమారుగా అగ్ని పర్వతంలా పైపైకి పొంగివస్తాయని ఆ శాస్త్రజ్ఞు లభిప్రాయపడుతున్నారు. ఇది నిజమైతే రష్యా యువమేధావుల ప్రవర్తన దీనికి వ్యతిరేకంగానే సాగిపోతూందని అనాలి. వీరికి జీవితంలో ఏవేవో ఇబ్బందులు వస్తే వాటి నెదుర్కోవడానికి ఒక్కమారుగా నడుం బిగించి ముందు కురకరు. అలాగే తాపీగా, అంటే అంటనట్టుగా సాగిపోతారు. ఏదైనా సినిమా ప్రారంభించడం ఆలస్యమైనా, కాఫీహోటళ్ళలో ఫలహారాలు వేళ కందకపోయినా, నాటకాలలో అంకానికీ అంకానికీ మధ్యన బాగా వ్యవధి ఏర్పడినా ఎవరికీ విసుగు చిరాకు పుట్టినట్టు కనబడదు. వారా సమయంలో కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ కాలక్షేపం చేస్తూన్నట్లే కనిపిస్తారు. కంగారు, హడావిడీ అనవసర మన్నట్టే కనబడుతుంది. నేనొకసారి ఒక బస్సు అందుకోవడం కోసం పరిగెత్తడం ప్రారంభించాను. "ఎందు కలాగ పరిగెడతారు? పదినిమిషాల్లో ఇంకొక

బస్సు వచ్చేస్తుందే!" అన్నాడొక వ్యక్తి. చాలామంది బస్సులకోసము, రైళ్లకోసము, విమానాల కోసము బాగా ముందుగానే వచ్చేస్తారు. వాటికోసం పడిగాపులుపడి కూచుంటారు. దీనికోసం అనవసరంగా ఎంతో కాలం పాడవుతుంది. కాని రష్యాలో ఆలస్యంగా రావటం చాలా పెద్ద అమర్యాదగా భావిస్తారు. పూర్వకాలంలో రష్యాలో మందకొడితనం నరనరాల్లో కింటా జీర్ణించుకుపోయింది.

ఇప్పటి రష్యాలో ఆ మందకొడితనం మాత్రైనా వినిపించకుండా జాగ్రత్త పడుతున్నారు. ఇందులో మళ్ళీ బోల్షివిక్కు హంగామా ఏమీ లేదు. నీరసంగా సాగిపోయే వర్తమాన జీవితాన్ని కేవలం సామరస్యము, స్వారస్యము సంపాదించాలన్న తహతహే దీనికి కారణం.

బహుశః దైనందిన క్లిష్టపరిస్థితులవల్లే అనుకుంటాను - రష్యాలో ఇంకొక విచిత్రమైన పరిస్థితి ఏర్పడింది. ఆ దేశంలో ప్రస్తుతం ఉన్నవారికీ, లేనివారికీ మధ్య పెద్దపెద్ద అంతరువులేర్పడ్డాయి. ఈ అంతరువులు 'వర్గదౌర్జన్యం' ధోరణిదాకా వెళ్ళిపోయాయి. అయినా సహృదయులయిన మేధావులెవరిలోను 'పతిత జనోద్ధరణ దృష్టి' కనిపించదు. నేనొకసారి కార్మికాధికారుల దుబారా ఖర్చుల్ని గురించీ, ప్రత్యేక శిక్షణ పొందని సామాన్య కార్మికుల దుర్భర దారిద్ర్య పరిస్థితుల్ని గురించీ ప్రసంగించి కార్మికాధికారుల దాబుసరి దుస్తులు, వారి గృహాలంకార పద్ధతులు చాలా మోటుగా ఉన్నాయనీ సామాన్య కార్మికుల దారిద్ర్య పరిసరాలసహ్యంగా ఉన్నాయనీ అన్నాను. నాతో ప్రసంగించినవారు కార్మికాధికారుల దాబుసరి ధోరణి మోటుగా ఉన్నమాట నిజమే అని అంగీకరించారు. అంతేగాని కార్మికుల దుర్భర పరిస్థితులమాటే ఎత్తుకోలేదు. మొత్తంమీద వారికి సాంఘిక సమస్యల గొడవే పట్టలేదు. అసలు వారందరికీ సంఘోద్ధరణ పేరు చెబితేనే విసుగు, చిరాకు పుట్టుకొచ్చాయి. పైపై అధికార వర్గాలవారు సంఘంలో వ్యత్యాసాలలాగే అట్టేపెట్టి, ఈ యువకులందరినీ చిన్నప్పటినించీ విప్లవ ప్రచారం ఉగ్గుపాలతో పెంచి పెద్దవారిని చేశారు. పైపై అధికారులంతా పెద్ద పెద్ద జీతాలు జేబుల్లో వేసుకుంటూ ఊరికే రాత్రింబగళ్లే పనిగా విప్లవప్రచారం సాగిస్తే ఏమవుతుంది? వినేవాళ్లకి విసుగు, చిరాకు పుట్టుకొస్తాయి. ప్రస్తుతం రష్యామేధావులలో కూడా సరిగా ఇదే పరిస్థితి ఏర్పడింది.

ఆ దేశంలో కొంతకాలంపాటు సంచారంచేసిన వారికింకొక విచిత్రమైన పరిస్థితి ఎదురవుతుంది. అమెరికాలో జఫర్సన్, లింకన్ల పేర్లంటే ఎవరు అంతగా లక్ష్యపెట్టరు. ఏదో యదాలాభంగా చప్పరించేస్తారు. ఈ నాడు రష్యాలో మార్క్స్-లెనిన్ల పేర్లు కూడా సరిగా ఇలాగే తయారయ్యాయి. 'వర్గకలహాను' 'శ్రామిక వర్గాన్ని ముందుకు తీసుకుపోయే విప్లవ నాయకత్వము' మొదలైన ఘాటుమాటలన్నీ చప్పగా చప్పబడిపోయాయి. ఇవి అచ్చంగా అమెరికాలో పిల్లల పాఠ్యపుస్తకాలలో నీతి వాక్యాలలాగే తయారయ్యాయి. నేటి రష్యా విద్యార్థులకు, ఎప్పుడో 14 వ శతాబ్దంలో జరిగిన తిరుగుబాటు పోరాటానికీ, ఇటీవల జరిగిన డిసెంబరు విప్లవానికీ తేడా ఏమీ కనబడదు. అన్నీ ఎప్పుడో పాతకాలంలో జరిగిపోయినట్టే లెఖ్ఖ. విద్యార్థులంతా ఇదే ధోరణిలో ఉన్నారని నేననటం లేదు! ఎవరో కొంతమంది చరిత్ర కొంచెం జాగ్రత్తగా చదివితే చదివి ఉండవచ్చును. ఒకసారి ఇద్దరు విద్యార్థులు వేర్వేరుగా వచ్చి నన్ను కలుసుకున్నారు. కమ్యూనిస్టుపార్టీ చరిత్రని గురించి ఎన్నెన్నో ప్రశ్నలడిగి తెలుసుకొన్నారు. మెన్షివిక్కులను గురించీ ఆ కాలంలో ఇంకొక పార్టీని గురించీ మరికొన్ని ప్రశ్నలడిగారు. గొప్ప గొప్ప విప్లవకారులంతా తమ 'ఆత్మకథలు' ప్రచురించారని విని ఆశ్చర్యపోయారు. వాటిని గురించి వివరాలింకా చెప్పమని వేధించుకుతిన్నారు. ట్రాట్స్కీని గురించి ఇంకా కొన్ని వివరాలు చెప్పమని అడిగారు. అతని విదేశ నిర్వాసనానికి పూర్వం జరిగిన విశేషాలు, ఆ తరవాతి విశేషాలు చెప్పమని బలవంతపెట్టారు. ఆ ఇద్దరిలో ఒకతను ట్రాట్స్కీ వ్రాసిన స్టాలిన్ చరిత్రని గురించి కొన్ని ప్రశ్నలడిగాడు. ఆ జీవిత చరిత్ర నన్ను కూడా చదవమన్నాడు. ప్రతీ అధ్యాయము అతి జాగ్రత్తగా చదవమన్నాడు. దానివల్ల తేలిందిది. ట్రాట్స్కీ ఆ జన్మాంతము విప్లవవాదిగానే ఉండిపోయాడు. అంతేగాని 'సామ్రాజ్యవాదుల చేతుల్లో పిచ్చికుక్క' కాలేదు. అతని గురించి ఆవిద్యార్థి ఇలాగన్నాడు: "ట్రాట్స్కీ అసలైన చరిత్ర రచన కుపక్రమించాడు. అంతేగాని చరిత్రమీద లేనిపోని సిద్ధాంతాలు, వాదోపవాదాలు లేవదీయలేదు."

అలాంటి రహస్యసంభాషణలు నిజంగా చాలా ప్రమాదకరమైనవే. రష్యా నగరాలన్నిటిలోను పెద్ద పెద్ద పార్కులు విహారస్థలాలు ఉన్నాయని ఎంతో గొప్పగా చెప్పుకుంటారు. అక్కడ కూర్చుని హాయిగా మాటాడుకోవచ్చునని అంటారు. కాని నాతో మాటాడుతున్న ఆ విద్యార్థి హఠాత్తుగా తన సంభాషణ ఆపివేశాడు. మావెనకనించి ఎవరో నడిచి వస్తున్నారు. అతగాడు మమ్మల్ని దాటివెళ్ళిపోయేదాకా ఆ విద్యార్థి మళ్ళీ నోరు మెదపలేదు. ఆ సమయంలో ఏర్పడ్డ మౌనం నాకు చాలా చిత్రంగా కనిపించింది. నేనా సమయంలో ఒక రష్యా జాతీయ గీతం సన్నసన్నగా ఆలాపించడం మొదలు పెట్టాను. అది అధికారముద్ర పడిన జాతీయగీతం కాదుగాని పాశ్చాత్య దేశాలలో బాగా ప్రచారంలోకి వచ్చింది.

"ప్రపంచంలో ఇంతటి స్వాతంత్ర్యం ఉన్న దేశం ఇంకెక్కడ ఉంది? మీకు మా ఛలోక్తులన్నీ బాగా తెలుసునుగా!"

అన్నాడా విద్యార్థి! చిన్నతరంవారికి స్టాలిన్ పేరు చెబితే అరికాలిమంట నెత్తికెక్కుతుంది. అయితే అతన్నిగురించిన వ్యతిరేకవిషయాలేవీ ఈ విద్యార్థులు పట్టించుకోరు. నేనొక సంభాషణ మధ్యలో స్టాలిన్ జారుచక్రవర్తి గూఢచారిగా వ్యవహరించాడనీ, దీని విషయంలో కొందరు సుప్రసిద్ధవ్యక్తులే పరిశోధన సాగించి అసలు విషయం బైట పెట్టారనీ అన్నాను. "మ కిష్టంలేనివాడిని 'జారుచక్రవర్తి గూఢచారు'లని దుమ్మెత్తి పొయ్యడం కమ్యూనిస్టులకు మొదటినించీ అలవాటే!" అన్నాడా విద్యార్థి. అంతేగాని నామాట తిన్నగా వినిపించుకోలేదు. నేనంతటితో ఊరుకోలేదు. దీనికి సంబంధించిన దాఖలాలు కాగితాలు ఉన్నాయనీ, అవికొట్టి పారెయ్యడానికి వీలు లేదనీ అన్నాను. ఆ విద్యార్థి "కాగితాలకేం లెండి!" అని ఈసడించి వేశాడు.

అలాంటి ఆధారాలు నమ్మేవాళ్ళంతా వట్టి అమాయికులని అతని అభిప్రాయం! అయితే కొందరు స్టాలిన్‌మీద దుమ్మెత్తిపొయ్యడానికి కిక వెనక ముందు కూడా చూడరు.

సామాన్యంగా నేను పలకరించినవారిలో గోరంతలు కొండంతలుచేసే ధోరణి చాలా తక్కువగా కనిపించింది. అలాగిమాట్లాడేవారి మాటలంటే నే అసలు లెక్కచెయ్యరు. అలాగే ఏదో పెద్ద పెద్ద ఆదర్శాల కోసం 'ఆత్మత్యాగం' అంటే కూడా ఖాతరీలేదు. డాస్టావిస్కీ రాసిన 'బ్రదర్స్ కర్మజోవ్'లో ఇవాన్ కర్మజోవ్, తమ్ముడు అల్యోషాతో రష్యాయువకులను గురించి అన్నమాటలివి.

"ఇదిగో! ఈ కుళ్ళు కంపుకొడుతున్న మద్యశాలకేసి చూడు! ఇక్కడ మన యువకులు లోకమూల ఎలాగ గుమిగూడారో చూశావా? ఇదింతకుపూర్వం, ఎప్పుడు ఎక్కడ కలుసుకోలేదు! ఇకముందెన్నడూ, ఎక్కడ కలుసుకోరు! ఇక్కడ కొంచెంసేపు మద్యం సేవించిఏవో పిచ్చాపాటీ మాట్లాడుకొని ఎవరిదారిని వారు వెళ్ళిపోతారు. ఇక్కడ కూర్చున్న కాస్సేపు వారేమి చర్చించుకుంటారో తెలుసునా? ఎంతసేపు ప్రపంచ సమస్యల్నిగురించిన ఘోషలే. అవితప్ప మరి వేరేవిషయాలేవీ లేవు! ఎంతసేపు భగవంతుని ఉనికినిగురించీ మోక్షాన్నిగురించీ చర్చించుకుంటారు! భగవంతుడంటే నమ్మకంలేనివాళ్లు సామ్యవాదాన్నిగురించీ, అరాజక వాదాన్నిగురించీ, సంఘోద్ధరణాన్నిగురించీ చర్చిస్తారు. మానవజాతి అంతా ఒక కొత్త పంథాలో నడిచేటట్టు చెయ్యాలని కలలుగంటారు. మొత్తం మీద ఎవరు దేనినిగురించి చర్చించినా ఒక సమస్యే చర్చిస్తున్నారన్నమాట! కొందరొక చివర మొదలుపెడితే మరికొందరింకొకచివరనుంచి మొదలు పెడుతున్నారు. ఇంతే తేడా? ఈ రోజుల్లో మన జనం అంతా ఈ నిత్యసమస్యలు చర్చించడానికే బ్రతుకుతున్నారు."

బహుశః నేనిటువంటి నిత్యసమస్యలు చర్చించే రష్యాయువకులను కలుసుకొని ఉండకపోవచ్చును. కాని ఈ పరిస్థితి 19 శతాబ్ది రష్యా కంతటికీ అన్వయిస్తుంది. ఈ నాటివారి కిది అన్వయించదు. అయితే వార్సాలోను, ప్రాగ్‌లోను, బుఖారెస్టులోను, ఈ నాడు కూడా మద్యశాలల్లో ఈ నిత్య సమస్యలు చర్చిస్తున్నారనే అనుకుంటాను. సోవియట్ యూనియన్‌లో ఈ వ్యవహారం మాత్రం బాగా నేల బారుగా చాలా వాస్తవికంగా సాగిపోతూంది. నేను రష్యాలో అనేక మందిని "మీ అభిమానరచయిత ఎవరు" అని అడిగాను. అందరు ఒకేవిధంగా చెహోవ్ తమ "అభిమాన రచయిత" అని సమాధానం చెప్పారు. చెహోవ్

జీవితంలోను, రచనలలోను ఆదర్శాల బెడద లేని పట్టి సామాన్య వాస్తవిక మానవులే తటస్థపడతారు. చెహోవ్ భూమ్యాకర్షణ సిద్ధాంతంలాంటి ఏదో సాధించాలని ఎన్నడు తాపత్రయపడలేదు. తన చుట్టూ ఉన్న 'జబ్బు మనుషుల' రోగాలు నయం చెయ్యాలని మాత్రమే తాపత్రయపడ్డాడు తనరచనలలో వీరులెవరినీ యుద్ధరంగానికి పరిగెత్తించలేదు! ఇటుకలు తయారుచేసే కర్మాగారాల్లోకే రవాణా చేశాడు. నాతో మాట్లాడిన మేధావులు కూడా అంతపెద్ద ఆదర్శాలేవీ పెట్టుకున్నట్టు కనబడలేదు. అసలు వారి ఆదర్శాలే చాలా సంకుచితమైనవి. ఒక మేధావి తన కొకే ఒక మహాదర్శం ఉన్నదని కలగన్నాడు. ఆ మహాదర్శం మరేమీ కాదు. తాను రాసిన పుస్తకమేదో తన అనంతరమైనా ప్రచురిస్తే చాలట! అదీ అతని జీవితాదర్శం! దాన్ని గురించి కూడా అతను చాలా సంసారపక్షంగానే మాట్లాడాడు.

రష్యా మేధావులకు చెహోవ్ మీద ఏర్పడ్డ భక్తి ప్రపత్తులను బట్టి ఇంకొక విషయం కూడా ఊహించవచ్చును. ఎంతటి నిగ్రహం అవలంబించి రచనలు సాగించినా చెహోవ్ స్వతః నిరాశావాది. కాని తన చుట్టూ ఉన్న సంఘం ఎంత నిరాశా జనకంగా కనిపించినా ఆ విషయంలో మాత్రం అతను ఆశావాదమే అవలంబించాడు.

నేటి అమెరికా కళాశాల విద్యార్థులలో దిగులు, నైరాశ్యధోరణి ఒక ఫాషన్! ఈ ధోరణిలో ముందు ముందేవో మంచిమంచి అవకాశాలు దొరకుతాయనే ఆశావాదం కూడా కనిపిస్తూనే ఉంటుంది. రష్యాలో మేధావులందరు హేతువాద దృక్పథం అవలంబిస్తారు. దీన్ని బట్టి సౌఖ్యము, సౌకర్యాలు బాగా తేలిగ్గా అందుబాటులోకి వస్తాయని అందరు ఆశిస్తారు. ఇలాంటి పరిస్థితుల్లో మేధావులలో కనిపించే నిరాశావాదధోరణి మరింత విచిత్రంగా కనిపిస్తుంది.

ఆదేశంలో ఫ్రాయిడ్ సిద్ధాంతాలమీద కొంతవరకు ఆసక్తి ఆదరణ ఉన్నాయి. ఫ్రాయిడ్ పుస్తకాలన్నీ ఎలాగో అలాగ సంపాదించి, అవన్నీ జాగ్రత్తగా చదివిన ఒక మహిళతో నాకు కొంచెం పరిచయంకూడా కలిగింది. ఈ విషయంలో నాతో ప్రసంగించినవారంతా మనం అస్తిత్వవాదాన్ని గురించీ (Existentialism), సైకోఎనాలిసిస్ ని (Psycho-analysis) గురించీ, చేసిన చాటుమాటు పాపాలని గురించీ అస్తమానము అదేపనిగా ఆలోచిస్తూ కూర్చుంటామని అంటారు. ఒక తత్త్వశాస్త్ర విద్యార్థి నాతో మాట్లాడుతూ హేతువాద సాహాయ్యంతో మనలో లోపలినించీ పైపైకి ఉబికివచ్చే హేతురహిత ధోరణులన్నీ అణిచివెయ్యవచ్చునని బల్లగుద్ది వాదించాడు. అంతలోనే మళ్ళీ అందుకున్నాడు:

"అస్తమానం ఇలాంటి వాటినిగురించి ఆలోచించడంవలన కలిగేలాభం అదొక్కటే! మీ మతోద్ధరణోద్యమాలలోను, పుస్తకాలలోను, సినిమాలలోను మాటిమాటికీ వీటినిగురించిన చర్చలే! నేనీమధ్యన ఒక అమెరికా మిత్రుణ్ణి కలుసుకున్నాను. మా ప్రసంగం కొంతసేపు స్టాక్ మార్కెట్ పరిస్థితులమీద నడిచింది. అతడా వ్యవహారం అంతా మనస్తత్వశాస్త్రంలోకి దింపేశాడు. మీ దేశంలో బేస్ బాల్ ఆడేవారిని కూడా కనుకట్టుతో కట్టివేస్తారట! మీరందరు నరాల దౌర్బల్యంలో బాధపడుతున్నామని అనుకుంటారు. కొంతమంది పిల్లలు ఊరికే ఉత్తిపుణ్యానికి తమనీడలు చూసుకుని భయపడతారు. అసలు ఆ విధంగా జడుసుకుని గంతులువెయ్యాలని ముందే అనుకుంటారు! మీ అమెరికావారి ధోరణికూడా అచ్చంగా ఇలాగే ఉంది!"

"సోవియట్ రష్యా సంఘం లోలోపల అణిగిమణిగిఉన్నవన్నీ మాదేశంలో పైపైకి తీసుకురావాలని ప్రయత్నిస్తున్నాము." అన్నాను నేను.

"మీ ఇంట్లోకి ఒక పెద్దపులివచ్చిందనుకుందాం! దాన్ని గదిలో పెట్టి తాళం వేయాలని ఆలోచిస్తారా?" అన్నాడతను.

ఈ సందర్భంలో మనం డాస్టావిస్కీ సంగతి బాగా జ్ఞాపకం పెట్టుకోవాలి. మనుషుల హృదయాంతరాలలో అణిగి మణిగి ఉన్న పెద్ద పులులన్నిటినీ పైకి నెట్టి వ్యవహారంలో డాస్టావిస్కీ చాలా గట్టివాడు. ఈ మధ్యన మళ్ళీ అతని పుస్తకాలన్నిటికీ బూజుదులిపి పైకి లాగారు. నేటి యువ మేధావులలో చాలామందికతడొక 'ప్రవక్త'లా కనబడలేదు. ఎవరో కొద్దిమంది కతడొక మహాప్రవక్తే కావచ్చును. కాని చాలామందికి డాస్టావిస్కీ మనస్తత్వ పరిశీలనలు చాలా గజిబిజిగా ఉన్నట్లు, నైరాశ్యంతో తల మునకలయినట్టు కనిపిస్తాయి. ఈ ధోరణిలో తమ తమ

అంతఃకరణ ధోరణులు సమర్థించుకోవాలనే తహతహ ఉంటే ఉండవచ్చును. డాస్టావిస్కీ చాలా చోట్ల జీవితంలో 'శవంవాన్ని' గురించి చర్చించాడు కాని ఈ మేధావుల కది కేవలం అసంబద్ధంగా కనిపించింది!

మైకొవిస్కీకికూడా సరిగా ఇలాంటి పరిస్థితే ఏర్పడింది. అతని పుస్తకాలి సేవల మళ్ళీ ప్రచారంలోకి తీసుకు వచ్చారు. "కవిత్వం మనసారా ద్వేషించాలంటే రెండే రెండు పద్ధతులు: ఒకటి పుష్కిన్ కవిత్వం ఒక మూలకి నెట్టి నెయ్యడం! రెండోది మైకొవిస్కీ కవిత్వం చదవడం!" అన్నారు కొంతమంది మాస్కో నగరంలో నాతో ప్రసంగిస్తూ. రెండో పద్ధతివల్ల తప్పకుండా కవితా ద్వేషం కలిగించవచ్చునని వారి అభిప్రాయం! రష్యారచయితలు విప్లవధోరణిలో పదజాలం సృష్టించినందుకు మైకొవిస్కీని అభినందిస్తారు. స్టాలిన్ ఆజ్ఞాపించాడు కనక రష్యా దేశభక్తులంతా అతని కవిత్వం బాగున్నదంటారు! అదీగాక అతనిలోని విప్లవం హంగామా మోటుదనంకూడా ఆవేళ భక్తులకు బాగా నచ్చుతుంది. కాని ఇందుచేత ఈ మేధావులకతని కవిత్వం అంటే సరిపడదు. ఈ మేధావులందరు మైకొవిస్కీని వేళాకోళం చేసే వ్యంగ్య రచన ఒకటి నవువుతూంటారు. దానిలో మైకొవిస్కీ అమెరికా వెళతాడు. ఎంపైర్ స్టేట్ బిల్డింగ్ పక్కన నిలబడతాడు. వీథమ్మట నడిచివెళ్ళేవారిని చూచి అసహ్యపడి తుపుక్కున ఉమ్మేస్తాడు! ఆ ఉమ్మి 'మైకొవిస్కీ!' అని గట్టిగా అరుస్తుంది! మొత్తంమీద ఆవ్యంగ్యరచన అర్థం అది! పాశ్చాత్య దేశాలలో మైకొవిస్కీని గౌరవిస్తున్నారని విని అక్కడివారాశ్చర్యపోయారు. రష్యా మేధావుల దృష్ట్యా చూస్తే అతని కవితలో 'సంస్కృతి' లేకపోవడమే వారి ఉపేక్షా భావానికొక కారణమై ఉండవచ్చును. కాని ఆ దృక్పథంలో ఒక కొత్త బూర్జువాధోరణి ఏదీ లేదు. ఏదో ఒక కొత్త రచనా ప్రణాళిక (Manifesto) అనుసరించే ధోరణికూడా కనబడదు. ఒకవేళ ఈ మేధావులందరికీ ఏదైనా ఒక ప్రణాళిక ఉన్నదనుకుంటే అది ఈ క్రింది చెహోవ్ లేఖ ధోరణిలో సంగ్రహంగా క్రోడీకరించుకోవచ్చును. చెహోవ్ ఈ లేఖ తన సోదరుడు నికొలాయ్ పేర వ్రాశాడు. ఆ లేఖ ఇక్కడ ఉదాహరిస్తున్నాను.

"నీ దగ్గరున్న తప్పల్లా ఒక్కటే. నీ అస్తవ్యస్త పరిస్థితి కదే కారణం. అంతేకాదు! నీ బాధలకన్నిటికీ అదొక్కటే ప్రధాన కారణం. సంస్కృతిలోపమే నీకున్న పెద్ద తప్పు! నేనిలా గన్నందుకు నన్ను మన్నిస్తావని అనుకుంటున్నాను. ఇంతకీ నేను వ్రాయబోయేదిది. జీవితమే తన నియమాలు సృష్టించుకుంటుంది. సంస్కృతికలవారెప్పుడు ఈ క్రింది విషయాలు జాగ్రత్తగా గమనించాలి. సంస్కారులు ఎల్లప్పుడు మానవ వ్యక్తిత్వం గౌరవిస్తారు. అందుచేత ఇతరుల యెడల మర్యాదగా, ఉదారంగా ప్రవర్తిస్తారు. ప్రతి చిన్న విషయానికీ ఒక పెద్ద రగడ రేవకొట్టరు. చప్పుడవుతోందనీ, గందరగోళంగా ఉందనీ చీటికీ మాటికీ విసుక్కోరు. కొస్త జలుబు చేసినంత మాత్రాన్న కంగారు పడరు. వండిన మాంసం చిమిడిపోయినా, ఎవరైనా ఒక ఛలోక్తి విసిరినా మాసీ చూడనట్టూరుకుంటారు. కొత్తవారెవరో హఠాత్తుగా లోపలికి వస్తే విసుక్కోరు. 2 ముష్టివాళ్ళమీద పిల్లలమీద చిరాకు పడరు. అంతేకాదు. అందరియెడల ఆప్యాయంగా మసలుకుంటారు. 3 ఇతరుల ఆస్తిపాస్తులు గౌరవిస్తారు. అందుచేత ఒకరికివ్వవలసిన బాకీలు పూర్తిగా తీరుస్తారు. 4 ఉన్నది ఉన్నట్టు మాట్లాడతారు. నిజాయితీతో వ్యవహరిస్తారు. అబద్ధాలాడడం నిప్పులతో చెలగాటం అన్నట్టు భయపడతారు. అనవసరమైన గొడవలలో పడి కుసలాడడం పెద్దమనుషులు చెయ్యవలసిన పని గాదు. ఒకళ్ళమనస్సునొప్పించకుండా సాధ్యమైనంతవరకు మౌనం వహించి మాట్లాడకూరుకోవడమే మంచి పని. 5 ఒకరి సానుభూతికోసం ఆత్మ వినాశనానికి ప్రయత్నించడం సంస్కారుల లక్షణం కాదు. 6 సంస్కృతికలవారెన్నడు గర్వపడరు. కానీ పనిచేసి నూరురూపాయల పనిచేశామని పెద్ద పెద్ద బడాయిమాటలు చెప్పరు. ఇతరు లెవ్వరినీ రానివ్వని చోటికి తమ నొక్కరినే రానిచ్చారనీ, అందుచేత తామెంతో గొప్పవారమనీ అహంకరించరు. 7 తమకేమైనా కళలలో శక్తిసామర్థ్యాలుంటే వాటికోసం ఎలాంటి సౌఖ్యాలైనా, సౌకర్యాలైనా విసర్జిస్తారు. తమ లక్ష్యసాధనకు ప్రత్యేక శ్రద్ధ తీసుకుంటారు. 8 కళాభిరుచి పెంపొందింపజేసుకోడానికి శాయశక్తులా ప్రయత్నిస్తారు. కట్టుకున్న బట్టలతో అలాగే నిద్రపోరు. గోడకన్నాలలో బొద్దింకలున్నాయేమోనని పనిగట్టుకుని అక్కడికి వెళ్ళరు. చెడుకంపు కొడుతూందని

ముక్కోణాలు బిగబట్టరు. ఎక్కడ బడితే అక్కడ మద్యపానానికి సిద్ధపడరు. అలవాగా తెరిచి ఇదేమిటీ వాసన అని విసుక్కోడం సంస్కృతికలవారి లక్షణం కాదు. అలాంటి పనులు చేసేవి పందులు గాని మనుషులు కారు!"

రష్యాలో చాలామంది పెద్దమనుష్యులుగా కాలంగడుపుతూ ప్రశాంతంగా తమపని తాము చేసుకోవాలని కోరుకుంటారు. సామాన్యంగా ఈ కోరిక చాలామందినోట వినబడుతూంటుంది. ఇలాంటి వారిలో చాలామంది సంప్రదాయ మార్గాలవలంబించే మేధావులలోనే కనిపిస్తారు. వీరందరు "మున్ముందుకు పరుగెత్తండి! పరుగెత్తండి!" అనే ప్రభుత్వ ప్రగతి ప్రచారంతో బాగా విసిగిపోయారు. అందుచేత 'విప్లవ ధోరణి' అనే మాట వినీవినగానే వీరందరికీ పెద్ద విసుగు, చిరాకు పుట్టుకొస్తాయి.

వీరంతా సాంప్రదాయికులే కావచ్చును. కాని ఆ సంప్రదాయం ఏ ప్రత్యేక చారిత్రిక యుగానికీ, ఏ ప్రత్యేక మేధావంతుల సంప్రదాయానికీ సంబంధించినది కాదు. గత రష్యాదేశచరిత్రలో మేధావంతుల సంప్రదాయాలు చాలా ఉన్నాయి: కాని నేటి మేధావంతుల సంప్రదాయానికీ, వెనకటివారి సంప్రదాయాలకు సంబంధ మేమీ లేదు. దీని ప్రత్యేకత దీనిదే. నేటి మేధావంతులు మన పాశ్చాత్య ధోరణివైపు కూడా మొగ్గడం లేదు.

వీరికి పాశ్చాత్యదేశాల యెడల పక్షపాతం కలగక పోవడానికి కారణమేమిటి? అజ్ఞానము, అబద్ధ ప్రచారాలు దీనికి కొంతవరకు ముఖ్యకారణాలు. ఒక విద్యార్థి నాతో మాట్లాడుతూ అమెరికాలో తాను రోడ్లన్నీ తీసివేస్తున్నారనీ, ఈ గోష్ఠిమూలంగా రాబ కరువులు వస్తాయని అక్కడివారు భయపడుతున్నారనీ అన్నాడు! ఆ విద్యార్థి చాలా తెలివైనవాడు. ప్రస్తుతం భవననిర్మాణ శాస్త్రం చదువుతున్నాడు. విశ్వవిద్యాలయంలో పనిచేస్తున్న ఒకాయన 'రూజ్ వెల్టుకు విషంఇచ్చి చంపివేసినమాట నిజమేనా?' అని అడిగాడు. మొట్టమొదట ఈమాట అడగడానికతడు కొంచెం తటపటాయించాడు. చిట్టచివర కీవిధంగా బైటపడ్డాడు! ఇది ఎంతమాత్రం నిజంకాదని అన్నాను. ఆపైన "రూజ్ వెల్టుకి ఎవరు విషం ఇచ్చారని అనుకుంటున్నారు?" అన్నాను. అతడు అలాగే తన పాదాలకేసి చూస్తూ మొండిపట్టుదలతో 'ట్రూమన్' అని సమాధానం చెప్పాడు.

నేను మాస్కోలో ఉన్నప్పుడే నినాహానో మరేవ్నాను నిర్బంధించడం జరిగింది. దీనికక్కడ ఒకే ఒక ధోరణిలో అర్థంచెప్పడం జరిగింది: "సరీగా ఈ సమయంలో బ్రిటిషు ప్రభుత్వం ఈ తగాదా లేవదీయడానికసలు కారణమేమిటి?" ఇదీ అక్కడి వారి ధోరణి!

పోనీ మాటవరసకైనా నినాహానో మరేవ్నా ఆ అయిదు టోపీలు అపహరించిందేమోనని ఎవరూ అనుమానించలేదు! పోనీ అవిశ ఆ టోపీలయిను అపహరించి ఉండకపోతే టోపీలమ్మే ఆసామీ అయినా పొరబాటుపడి ఉండవచ్చునేమో అనిగాని, అన్యాయంగా ఆమెమీద నిందమోపాడేమో అనిగాని ఎవరికీ తట్టనేలేదు. బ్రిటిషుప్రభుత్వం ఈ కేసు బనాయించడంకోసం టోపీల అపహరణ కథ సృష్టించి ఉండక పోవచ్చునని నేనన్నాను. కాని నామాట ఎవరూ పట్టించుకోలేదు. నేనేదో మరీ సత్యకాలపు మనిషిలా మాట్లాడుతున్నానని వెటకారంగా నవ్వారు. ఇంకొకసారి మళ్ళీ ఈ ప్రసంగమే వచ్చింది. నేనీసమయంలో ఒక ఛలోక్తి విసరాలని అనుకున్నాను. చల్లచల్లగా అంటించాను.

"అయితే సరిగా ఈ ప్రత్యేక పరిస్థితుల్లో రష్యాప్రభుత్వం ఈ తగాదా లేవదీయవలసినంత అవసరం ఏమి వచ్చిందేం?"

నా పక్కనే కూర్చుని మాట్లాడుతున్న వ్యక్తి ఇది ఛలోక్తిగా తీసుకోలేదు. తీవ్రంగానే అడిగాడు:

"అయితే మీరిది అంతా నిజమనే నమ్ముతున్నారా?..."

"ఏమో నాకిదంతా అగమ్యగోచరంగానే ఉంది మరి!" అన్నాను.

ఆంగ్ల కార్మికులందరికి ఆరోగ్యం కోసం ఎన్నెన్నో సదుపాయాలేర్పాటు చేశారు. ఫ్రెంచి వారికీ, ఇటలీ దేశీయులకు పన్ను తెగ్గొడుతూండడం ఒక పరిపాటి. చార్లీ చాప్లిన్ సినీమాలు అమెరికాలో చూడవచ్చును గాని రష్యాలో అవి చూడడానికి వీలు లేదు. రష్యాలో చార్లీచాప్లిన్ విధానా లామోదిస్తారు గాని అతని సినీమాలేవీ ప్రదర్శించరు. బ్రెష్ట్ కీ

సరిగా ఇలాంటి అవస్థే పట్టింది. రష్యాలో వారందరికీ ఇవన్నీ పెద్ద పెద్ద విడ్డూరాలలా వినిపిస్తాయి. సామాన్య పౌరులకివి విడ్డూరాలు కానేకావు! ఇలాంటివి జరుగుతున్నాయంటే అసలు వారెవరు ఇవి నమ్మనే నమ్మరు! మేధావులకి విషయాలు తెలుసుకునే అవకాశాలే లేవు! అందుచేత వారందరికీ ఇవి చాలా విచిత్రంగా కనిపిస్తాయి.

రష్యా మేధావులకు పాశ్చాత్య దేశాలంటే భక్తి శ్రద్ధలు లేకపోవడానికి ఆ దేశాలనుగురించిన అజ్ఞానం ఒక్కటే ముఖ్య కారణమని అనుకోకూడదు. ఆ దేశాల కళాభివృద్ధి, వ్యక్తిస్వాతంత్ర్యము, శాస్త్రాభివృద్ధి చూసి రష్యా మేధావు లసూయపడతారు. అయితే అమెరికా తమ దేశంకన్నా బాగా యాంత్రికమైపోయిందనీ అందుచేతనే తమదేశంకన్నా అదేశంలో మొరటుదనము, మోటుదనము మితిమీరిపోయాయనీ చెబుతారు. కాని నేటి ఐరోపాఖండం మరణశయ్య మీదనే ఉన్నదనీ ఐరోపాపని అయిపోయిందనీ అంటారు. 'సోవియట్ మార్క్సిజం' తీవ్రంగా విమర్శించే మేధావులుకూడా మార్క్స లెనిన్‌లను గౌరవిస్తారు. ఇన్నాళ్లనించీ పెద్దపెద్దవలసలున్న సామ్రాజ్యాలుగా చలామణీఅయిన ఇంగ్లండ్, ఫ్రాన్స్, ఇటలీ, హాలండ్ దేశాలపని అయిపోయిందనీ, ప్రస్తుతం ఇవి అప్పులుచేసుకుని బతుకుతున్నాయనీ, సామాన్యంగా అందరినోట వినబడుతూంటుంది. భాషాశాస్త్రంమీద వ్యాసం స్టాలిన్ వ్రాశాడని అందరు అంగీకరిస్తారు. "కాని ఈ అంగీకరించడం "అంత అస్తవ్యస్తమైన వ్యాసం ఆయనగారు కాకపోతే మరెవరు రాస్తారు?" అని వేళాకోళం చెయ్యడానికే! కాని ఇంకొకవిషయంలో స్టాలిన్ ప్రతిపాదించిన సిద్ధాంతం అందరు గౌరవిస్తారు. ఇకముందు పాశ్చాత్య ఐరోపాఖండానికీ, అమెరికా సామ్రాజ్యవాదానికీ మధ్య వైరుధ్యం ఏర్పడగలదని స్టాలిన్ ఒక సిద్ధాంతం ప్రతిపాదించాడు. దీనితో చాలామంది ఏకీభవిస్తున్నారు. ఇప్పుడందరికీ అమెరికా ఒక్కటే ఒక పెద్దసమస్య అయి కూర్చుందని అనుకుంటాను. ఆదేశం పౌరులెవరయినా రష్యాలో పర్యటిస్తూంటే వారిని అమెరికాలో ధరవరలను గురించీ, జీతాలనుగురించీ, వస్తూత్పత్తినిగురించీ ఇంకా ఇతరవిషయాలను గురించీ వేలాది ప్రశ్నలడుగుతారు. ఈ ప్రశ్నలన్నీ అమెరికాలో ఏదో భూతలస్వర్గం ఒరగబెడుతున్నారనే అసూయతో అడిగినవి కావు. రష్యా మేధావులు, అమెరికా ధనస్వామ్యవ్యవస్థ ఆయుర్దాయం ఇంకా ఎంత కాలముందో తెలుసుకోడానికే ఈ ప్రశ్నలన్నీ అడుగుతూంటారు. అమెరికా ధనస్వామ్యవ్యవస్థవల్ల ఏర్పడే ప్రపంచ రాజకీయాల పరిణామాలనుగురించి కూడా వూహాగానాలు చేస్తూంటారు. ఈ విషయంలో బాగా లోతుగా పరిశీలిస్తే తప్ప తొందరగా ఒక నిశ్చయానికిరారు. చాలా మంది ఇక భవిష్యత్తంతా రష్యాదే అన్నట్టు మాట్లాడతారు. మరికొంతమంది భవిష్యత్తుకు సంబంధించిన జవాబు దారీలన్నీ బలవంతంగా తమభుజస్కంధాలమీదే పడిపోయినట్టు మాట్లాడతారు. ఈ రెండు అభిప్రాయభేదాలలోను అమెరికా భవిష్యత్తును గురించిన అనుమానాలుండనే ఉన్నాయి. పాశ్చాత్యదేశాలు పతనావస్థలో ఉన్నాయనీ రష్యా అన్నిదేశాలకన్నా గొప్పదనీ అనేనా రాష్ట్రే ఎక్కువమంది కనిపించరు. ఇలాంటి అభిప్రాయాలు పూర్వం నాజీజర్మనీలో బాగా వ్యాప్తిలో ఉండేవి. సామాన్యంగా రాజకీయ ప్రచారం సాగించేవారంతా "మనం అన్ని విషయాలలోను అమెరికా నతిక్రమించి ముందుకు సాగిపోవాలి" అని గావుకేకలు పెడుతూంటారు. దీనికి తరచుగా అందరు వంత పాడుతూంటారు. నేనొక్కసారి ట్రెట్యకోవ్ ఆధునిక చిత్రప్రదర్శనాలయం సందర్శించాను. నాకక్కడ ప్రదర్శించినవన్నీ చాలా బీభత్సంగా కనిపించాయి. అక్కడ నిలబడిన ఒక శిల్ప చరిత్రవేత్త "మేమిక 18వ శతాబ్ది శిల్పవాతావరణం విడిచిపెట్టి బాగా ముమ్ముందుకు వెళ్ళిపోవాలి!" అన్నాడు.

రాబిన్‌సన్ క్రూసో తన ద్వీపంలో దొరికిన వస్తువులతో తాత్కాలికంగా ఒక విధమైన సంస్కృతి సృష్టించుకొన్నాడు. రష్యా వాఙ్మయం ఒక పెద్దవిజ్ఞాన సర్వస్వం వంటిది. శాస్త్రవేత్తలకు, చరిత్రవేత్తలకు ఆ వాఙ్మయం లోటుపాటులన్నీ బాగా తెలుసును. ఎవరికైనా ఏదైనా ఒక ఖండకావ్యమేదైనా నచ్చకపోతే దాని వెనకాల ఎంతో అభిరుచి పూర్వరంగం ఉన్నదన్న మాట! రష్యా చిత్రకళలో వైవిధ్యం చాలా తక్కువ. లోటుపాటులుకూడా అంతంత మాత్రంగానే ఉంటాయి. అయినా చిత్రకళ విషయంలో చాలా మంది ప్రత్యేక శ్రద్ధ వహిస్తారు. లెవిటన్,

గే మొదలయిన చిత్రకారుల చిత్రాల మీద ఏదో ఒక విశిష్టమైన అభిరుచి ఏర్పరుచుకోవటం చాలా ముఖ్యం. మన దేశాలలో ఆయా శాస్త్రాల సిద్ధాంతాలలో అనేకమైన కొత్త కొత్త ధోరణులు ఏర్పడుతూంటాయి. ఇలాగే రష్యాలో కళాకారుల మీద, రచయితల మీద చిత్రవిచిత్రమైన చర్చలు, వాదోపవాదాలు, వ్యాఖ్యలు విమర్శలు చెలరేగుతూంటాయి. రష్యా మేధావులందరికీ ఈ ధోరణి ఒక విశిష్టమైన దైనందిన వ్యవహారంగా మారింది. కాని వీరిలో చాలా మందికి రష్యా చరిత్ర, వాఙ్మయము బొత్తిగా తెలియవు. ఒక సంపాదకుడికి టాల్‌స్టాయి అంటే చాలా ఇష్టం. అతనిలో ఆశావాద ధోరణి ఒక్కటే దానికి ప్రధాన కారణం! ఒక విద్యార్థి 1917 లో విప్లవం వచ్చిన దాకా రష్యాలో బలవంతపు వెట్టి చాకిరీ ఉండేదని నొక్కి వక్కాణించాడు! ఇంకొక హైస్కూల్ ఉపాధ్యాయుడు డాస్టావిస్కీని ఎప్పుడూ సైబీరియా పంపించనే లేదనీ, అతను అభివృద్ధి నిరోధకుడనీ, అలాంటి వ్యక్తిని సైబీరియా పంపించవలసిన అవసరం ఏమి వచ్చిందనీ వాదించాడు!

రష్యాలో ఏర్పడిన సంస్కృతి సరిగా అవగాహన చేసుకోవాలంటే ఆ దేశంలో ప్రచారధోరణి, అక్కడి విద్యా వ్యవస్థ జాగ్రత్తగా అవగాహన చేసుకోవాలి. శాస్త్రాలకు, భాషలకు రష్యా విశ్వవిద్యాలయాలలో చాలా మంచి అవకాశాలున్నాయి. ఈ విషయాల్లో ఈ విశ్వవిద్యాలయాలు బాగా ముందంజ వేశాయి. అయితే చరిత్ర, తత్త్వశాస్త్రము, వాఙ్మయము, మొదలైన వాటి అభివృద్ధికి సరియైన అవకాశాలు లేవు ఈ విషయాలు పఠించే విద్యార్థులు సామాన్యంగా స్వయంశక్తివల్లనే ఎన్నెన్నో లోతుపాతులు తెలుసుకుంటారు. నేనొకసారి ఒక తత్త్వశాస్త్రపరీక్ష జరుగుతూంటే అక్కడ కూర్చున్నాను. అప్పుడు కొంతసేపు మార్క్సుమీద, లెనిన్‌మీద, చెర్నిషెవిస్కీలమీద ప్రశ్నలడిగారు. మార్క్సు లెనిన్లమీద ప్రశ్నలు మళ్ళీ ఇంకొకమారడిగారు. తరవాత స్టాలిన్ గ్రంథాల అంతరార్థాలమీద ప్రశ్నలవర్షం కురిపించారు. అటుపిమ్మట రష్యా నడిపించిన 'మహా జాతీయ యుద్ధంమీద' మరికొన్ని ప్రశ్నలడిగారు. ఇది తత్త్వశాస్త్రాభివృద్ధి కోసం నడిపించిన మహా యుద్ధమట! ఇలాంటి నోటి పరీక్షలో ఒక కొరియా విద్యార్థి అత్యద్భుతమైన సమాధానం ఇచ్చాడు. ఆ సమాధానం ఒక పెద్ద ఛలోక్తిగా నాలుగు వైపులా పాకిపోయింది! కొరియా విద్యార్థిని వాల్టేర్ తత్త్వశాస్త్రాన్ని గురించి చర్చించవలసిందని ప్రశ్నించారు. అతడిలాగ సమాధానం చెప్పాడు: సోవియట్ రష్యా ఉత్తర కొరియా జనానికి విముక్తి భాగ్యం ప్రసాదించింది! ఆ విముక్తికి పూర్వం ఉత్తరకొరియా జనం వాల్టేర్ తత్త్వ శాస్త్రం చదవలేరు! రష్యా ఉత్తర కొరియాకు విముక్తి కలిగించిన తరవాత. .”

ఆ సమాధానం అటువంటి విచిత్ర ధోరణిలో సాగిపోయింది!

ఎవరైనా విద్యార్థులే విషయమైనా కొంచెం లోతుగా పరిశీలించాలనుకుంటే దానికి సంబంధించిన ముఖ్య గ్రంథాలు, పరికరాలు దొరకవు. అక్కడి విద్యార్థుల పరిశోధన కిదొక పెద్ద గడ్డు సమస్య. ఒక విద్యార్థి ఆంగ్లవాఙ్మయంలో ప్రత్యేక పరిశోధన చేస్తున్నాడు. అతని పేరు బోరిస్. ప్రాచీనాంగ్ల కావ్యాలన్నీ క్షుణ్ణంగా చదువుకున్నాడు. కొంత స్వతంత్ర విమర్శక ధోరణి కూడా అలవడింది. అతడెంతసేపు ఆధునికాంగ్ల కవిత్వాన్ని గురించి ప్రశ్నించేవాడు. ఈట్స్, ఆడెన్, స్పెండర్ల మీద ప్రశ్నలవర్షం కురిపించేవాడు. 1935 ప్రాంతంలో వీరందరు రచించిన కొన్ని ఖండకావ్యాలక్కడక్కడ పత్రికల్లో పడితే అవన్నీ జాగ్రత్తగా చదివాడు. “ఈమధ్యనే మరికొన్ని చదివాను” అన్నాడు.

తరవాత అతిజాగ్రత్తగా ఒక పెద్ద నిట్టూర్పు విడిచిపెట్టాడు: “ఆ పైన ఒక పెద్ద అఖాతం ఏర్పడిపోయింది!” అన్నాడు.

“డైలాన్ థామస్, టి. యస్. ఇలియట్ — ఈ ఇద్దరు వ్రాసిన కావ్యాలు చదవలేదా?” అన్నాను. అతను వారి పేర్లుకూడా వినలేదట!

“మీరథమపక్షం టి. యస్. ఇలియట్ పేరైనా వినివుండాలే!” అన్నాను.

దానిమీద అతడన్నాడు:

“మీరు ఫెడయేవ్ అన్న మాట వినలేదా? కోతులు టైప్‌రైటర్లు ఉపయోగిస్తే, దుమ్ములగొండి పద్యాలు రాస్తే, అవి సరిగా టి. యస్. ఇలియట్‌లాగే రాస్తాయి. టి. యస్. ఇలియట్ అంటే అంతకన్న విశేషమేమీ లేదు!”

నేనాతరవాత లెనిన్‌గ్రాడ్‌లో సాల్టికవ్ ష్చెద్రీన్ లైబ్రరీకి వెళ్ళాను. ఇలియట్ మొదలైన కవుల పుస్తకా

లన్నీ ఆ లైబ్రరీ కేటలాగ్‌లో కనిపించాయి. బోరిస్ కా పుస్తకాలెందుకు కనబడలేదా అని ఆశ్చర్యపోయాను. ఈ సంగతి మిగిలిన విద్యార్థులతో అన్నాను. వారసలు కథ అంతా చెప్పారు. లైబ్రరీ అధికారులకే అసలు పుస్తకాల కేటలాగువాడే అధికారం ఉన్నదట! అందరువాడే పుస్తకాలపట్టికల్లో సామాన్యంగా అన్ని ముఖ్యపుస్తకాల పేర్లు ఉండవట! విదేశాలకు సంబంధించిన పుస్తకాలన్నీ ప్రత్యేకంగా వేరే అలమారుల్లో జాగ్రత్త చేస్తారట! విదేశీవాఙ్మయాలకు సంబంధించిన పుస్తకాలెక్కువగా కావాలని అడగకూడదట! దానివల్ల చాలా ఇబ్బందులున్నాయట! ఆ పుస్తకాలు కావాలంటే అత్యవసర కారణాలు పేర్కొని ప్రత్యేకంగా అనుమతి పొందాలట!

వేరే అలమారుల్లో భద్రపరిచిన పుస్తకాల పేర్లు కొన్ని అసలు ఏ కేటలాగుల్లోకీ చేరవు. ఇక మిగిలిన పుస్తకాలమీద ప్రత్యేకంగా కొన్ని అంకెలు, గుర్తులు ఉంటాయి. ఇలాంటి ప్రత్యేకమైన ఏర్పాటులుంటాయని విద్యార్థులకు, లైబ్రరీ అధికారులకు తెలియకపోలేదు. వీరంతా ఇది చాలా సాధారణ పరిస్థితే అన్నట్లు నటిస్తారు. ఇలాంటి ఏర్పాటు చాలా మంచిదని వెనకేసుకు వచ్చేవాళ్ళు కూడా ఉన్నారు. ఆ పుస్తకాలు విశ్వసనీయులయిన పెద్ద పెద్ద విద్వాంసులకు మాత్రమే ఇస్తారనీ, మిగిలినవారంతా చదువుకోవడానికి కావలసినన్ని మంచిపుస్తకాలున్నాయనీ, ఇలాంటి చెత్తపుస్తకాలు చదివి అనవసరంగా మనస్సులు పాడుచేసుకోవడం మంచిదికాదనీ వీరంతా వాదిస్తారు. పుస్తకాలు మొదలైనవి నిషేధించే తను మనుషులంతా అన్ని కాలాలలోను, అన్ని దేశాలలోను ఒక్కరంగులోనే బైటపడుతూంటారు!

రష్యా యువమేధావుల రాజకీయాలలో అభిప్రాయభేదాలనేకవిధాలుగా ఉండవచ్చును. వ్యక్తిగతంగా వీరిలో వీరికనేకమైన విభేదాలుండవచ్చును. కాని వెనకబడి ఉండడమన్నా, జడ్డితనమన్నా, మందకొడితనమన్నా వీరుబాగా అసహ్యించుకొంటారు. ఇందుచేతనే వీరంతా ఆదేశంలో కార్మికవర్గంమీద విధించే కఠిన నిబంధనలన్నీ అలాగ ఉండవలసినవే అని వాదిస్తారు. ఒకసారి నేను, ఇంకొక మిత్రుడు పార్కులో పచారుచేస్తున్నాము. మాకెదురుగా కొందరు ఫుట్‌బాల్ అలవాటు చేసుకుంటున్నారు. మీకు ఫుట్‌బాల్ ఆటంటే ఇష్టమేనా?" అని అడిగాడు నా మిత్రుడు. నాకు బేస్‌బాల్ ఆటంటే ఎక్కువ ఇష్టమనీ, ఆ ఆటలో శరీరబలమేకాక బుద్ధి చాకచక్యం కూడా చాలా అవసరమనీ అన్నాను.

"అయితే ఆ ఆట ఈ దేశంలో ఎప్పుడు ప్రచారంలోకి రాదు. ఫుట్‌బాల్‌లో ఉపయోగించేవి కాళ్లొక్కటే! మావాళ్ల కాళ్లు చాలా గట్టివి." అన్నాడు నా మిత్రుడు.

ఆ దేశంలో మేధావంతులు శక్తి సామర్థ్యాలున్న శిల్పులన్నా, కళాకారులన్నా చాలా గౌరవిస్తారు. వేర్వేరు శాఖలలో కృషి చేసే విద్యార్థు లందరికీ దేశంలో సాహిత్యవేత్తలంటే చాలా గౌరవం. షూకిన్ అనే రష్యావిద్వాంసుడొకడు ఇంప్రెషనిజానికీ, పోస్టు ఇంప్రెషనిజానికీ సంబంధించిన చిత్రాలెన్నెన్నో సంపాదించి అవ్వన్నీ ఒకచోట జాగ్రత్త చేయించాడు. ఆ విద్వాంసుని పేరు వినగానే విద్యార్థులెంతో భక్తి ప్రపత్తులు ప్రదర్శించారు. ఒకసారి నేనా చిత్ర ప్రదర్శనానికి వెళ్లాను. నా పక్కనున్న విద్యార్థులంతా హఠాత్తుగా గుసగుస లాడడం మొదలు పెట్టారు. ఇంతలో ఒక వ్యక్తి అక్కడికి వచ్చి మోనెట్ చిత్రాలతి జాగ్రత్తగా పరిశీలించడం మొదలు పెట్టాడు. ఆ తరవాత విద్యార్థులు నాకాయన సంగతి చెప్పారు. ఆయన ఒక పెద్ద ప్రొఫెసరట! ఈ మధ్యనే ఆయన్ని ఖైదులోనించి విడిచిపెట్టారట! ఆ విద్యార్థులు చదివే చదువుకీ ఆ ప్రొఫెసరు పరిశోధించే విషయానికీ ఏ విధమైన సంబంధమూ లేదు. కాని వారికాయన గొప్పతనం బాగా తెలుసును. ఆయన బాగా పేరు మోసిన ప్రొఫెసరు!

నేను కలుసుకున్న చాలా మంది మేధావులలో చక్కని వివేచనశక్తి కనిపించింది. ఒకసారి నేనొక రచయితతో మాట్లాడుతున్నాను. అతడు సామ్యవాద వాస్తవికతను గురించి ప్రసంగిస్తున్నాడు. కాని తనకు టియూచెవ్ కవిత్వం అంటే చాలా ఇష్టమనీ దానిలో సామ్యవాద వాస్తవికత లేకపోయినా మనోజ్ఞమైన సౌందర్యం ఉన్నదనీ అన్నాడు. ఒకసారి నేను కీవ్ నగరంలో ఆరుబయట ఏర్పాటు చేసిన ఒక గానసభకు వెళ్లాను. ఆ వేళ అక్కడ నినా సంగీతం పాడుతూంది. ఆ వేళ సాయంత్రం అంతా ఆ అమ్మాయి ఏదో ఇబ్బందిపడుతూన్నట్టే కనిపించింది.

# రష్యా యువమేధావులు

ప్రతి సంగీత కార్యక్రమానికీ ముందుగా ఆ కార్యక్రమాన్ని గురించిన చిన్న ప్రసంగాలుకూడా జరిగాయి. అవి సంగీతపరిచయం లేని సామాన్యజనంకోసం ఏర్పాటు చేశారు. నాకా ప్రసంగాలు బాగున్నాయి. కాని నినామాత్రం అవన్నీ వింటూ చాలా చిరాకు పడింది. జనం ఆ ప్రసంగాలన్నీ శ్రద్ధగానే విన్నారు. కాని తీరా సంగీతం కార్యక్రమం జరుగుతూంటే బాతాఖానీ కొట్టడం మొదలు పెట్టారు.

ఆతరవాత కార్యక్రమంలో మోజర్ట్ కృతులు పాడారు. కాని అవి ఆలాపించడంలో సరిగ్గాయైన శాస్త్రీయపద్ధతికి బదులు తీయని వాయులీనవాద్య సంగీతం పాలెక్కువ కలిపారు. నినా కది అంతా దుర్భరమై పోయింది. ఆమె మరి ఉండబట్టలేక పోయింది: "ఈ చాదస్తపు మిఠాయిపాకం అంతా యుక్రేనియన్ పద్ధతే! పూర్వకాలంలో ఈ సంగీతం చాలా శాస్త్రీయంగా పాడేవారు. ఆరోజుల్లో అత్యద్భుతమైన జానపదసంగీతము, కథలు ప్రచారంలో ఉండేవి. అందుచేత అప్పుడు గొగోల్ వంటి గొప్ప రచయిత పుట్టాడంటే ఆశ్చర్యమేమీ లేదు! కాని అక్టోబర్ విప్లవం వచ్చినప్పటినించీ రైతులందరికీ కొత్త సంస్కృతి అందింది. పూర్వం ఈ రైతు - లేస్ నా అల్లికపనులుచేస్తే వాటిమీద పువ్వులు, పక్షులు చిత్రించేవారు. ఇప్పుడు విమానాల బొమ్మలు, సెంట్రల్ కమిటీ సభ్యుల బొమ్మలు చిత్రిస్తున్నారు! పూర్వం యువతీ యువకుల ప్రేమకు సంబంధించిన గీతా లాలపించేవారు. కోసక్ వీరుల పరాక్రమాల్ని గురించీ, మృత్యుదేవాల్యల్ని గురించీ పాటలు పాడేవారు. ఈరోజుల్లో అవన్నీ మారిపోయాయి! ఇప్పుడు "ఓ కర్షక యంత్రరాజా! నీ ఇంజను మెడలో పూలమాలిక లర్పిస్తున్నాను." ఈ ధోరణిపాట లెక్కువయ్యాయి. మోజర్ట్ సంగీతానికి కూడా సరిగ్గా ఇలాంటి గతే పట్టింది. ఇప్పుడీ సంగీతం వింటే దీనిలో అనవసరమైన భావోద్రేకం పాలెక్కువ వినిపిస్తుంది. శాస్త్రపద్ధతికి బదులు అనవసరమైన తీపి సరుకెక్కువ చేర్చారు."

అక్కడినించి తిరిగి వచ్చేటప్పుడు నినా, నేను కలిసి కొంతదూరం దాకా నడిచివచ్చాము. సంగీత కచేరీ జరిగిన పార్కు దాటగానే ఒక వంతెన తగులుతుంది. దానికి 'పయ్యాలవంతెన' అని పేరు! దానికీ పేరెందుకు వచ్చిందని అడిగాను. దీనికి పాతకాలపు కథ ఏదైనా ఉందా అని అడిగాను. నినా అలాంటికథ ఏమీ లేదనీ, విప్లవానికి ముందు చాలామందిక్కడ ఆత్మహత్య చేసుకున్నారనీ చెప్పింది. ఆమె "విప్లవానికిముందు" అన్నమాట బాగా నొక్కినొక్కి పలికింది. ఆపైన వెన్నెలలో ఆమె వెటకారపు నవ్వు నా కంటబడింది.

ఆతరవాత మళ్ళీ నినా నెప్పుడు కలుసుకోలేదు. మరికొన్ని రోజులతరవాత రష్యా చిత్రప్రదర్శనాలయానికి వెళ్ళాను. అక్కడ ఇంకొకవ్యక్తిని కలుసుకున్నాను. అతను నినా స్నేహితుడులాగే కలిపించాడు. నేను 18 వ శతాబ్దంలో తయారయిన ఒక జాడీ జాగ్రత్తగా పరిశీలిస్తున్నాను. దానిమీద చెక్కడపుపని కొంచెం బాగుంది. నాపక్క నిలబడిన వ్యక్తి అక్కడనే ప్రదర్శించిన ఇంకొక చిత్తరువు కేసి చూస్తున్నాడు. మేమిద్దరం ఇంతకు పూర్వం అక్కడ ప్రదర్శించిన కొన్నికొన్ని వస్తువులమీద మా అభిప్రాయాలు కలబోసుకున్నాము. హఠాత్తుగా అతను నాకేసి తిరిగి గుసగుసలాడుతూ అడిగాడు: 'ఏమిటి మీరంతగా నిర్ఘాంతపడి చూస్తున్నారు! ఆ జాడీని గురించి అంత ఆశ్చర్య పడవలసింది ఏముంది?"

అతడంతకుపూర్వం ఒక చక్కని ప్రకృతి చిత్రంపై పడేపనిగా చూస్తున్నాడు. నాకతని ధోరణి చూస్తే చాలా ఆశ్చర్యం వేసింది. అయినా నేనలాగే ఆజాడీకేసి చూస్తూ "ఇందులో పెద్దగా ఆశ్చర్య పడవలసిందేమీ లేదు! నిజమే!" అన్నాను. అతను నాతో ఏకీభవించాడు. ఆపైన ఇలాగన్నాడు:

"ఈ ప్రకృతిచిత్రం చిత్రించిన శిల్పి పాశ్చాత్యచిత్రకళా సంప్రదాయాలన్నీ నేర్చుకున్నాడు. తాను నేర్చుకున్నది ఆచరణలో పెట్టాలని ప్రయత్నించాడు. ఆజాడీలో ఏముంది! అది చూడడానికి చాలా మోటుగా ఉంది. అది 18 వ శతాబ్దంలో తయారయింది తెలుసునా? మైకెల్ ఏంజిలో, రెంబ్రాగట్ రష్యాశిల్పి రూబ్లవ్ మొదలయిన మహామహులంతా అవతరించిన తరవాత కొన్ని వందల ఏళ్ళకీశిల్పం బయలుదేరింది. యూరప్, యూరప్ అంత అప్పటికి సంస్కృతిలో బాగా ముందంజ వేసింది. అలాంటప్పుడు ఇక్కడ 18 వ శతాబ్దంలో

తయారుచేసిన ఈజాడీ బాగుందని మీ రెలాగ సమర్థిస్తారు!"

అతనికీ నాకు ఈ విషయంలో చిన్న చర్చ జరిగింది. చదువు సంధ్యలున్నా శక్తి సామర్థ్యాలు లేని శిల్పి శిల్పంకన్న చదువు సంధ్యలు లేక పోయినా శక్తిసామర్థ్యాలున్న శిల్పి శిల్పమే గొప్పదని అన్నాను. కాని ఆ చర్చలో ప్రాకృతికమైన (Primitive) అనేపదం పొరబాటుగా ఉపయోగించాను. ఈ ప్రాకృతికవాదం అంటే అక్కడివారికి బొత్తిగా సరిపడదు. దీనితోబాటు అక్కడ అరాజకవాదము, శూన్యవాదము మొదలైనవన్నీ ఎందుకు పనికిరావని తూర్పారబట్టేస్తారు. రష్యామేధావుల కివన్నీ పెద్ద పెద్ద భూతాల్లా కనిపిస్తాయి! అందుచేతనే అక్కడ క్రొపాట్కిన్ సిద్ధాంతాలు, బ్లాక్ కవిత్వము, రూసో చిత్రాలు అన్నీ ఎందుకు పనికిరావని తీసి పారేస్తారు. అక్కడి అధికారుల ధోరణి అది! ఈ అస్తవ్యస్త హేతువాద గ్రస్తమైన ప్రగతి వాదానికి అక్కడి యువ మేధావు లింకా పక్కతాళాలు వేస్తారు! కాని ఆవాదంలోని మిథ్యావాతావరణంమాత్రం బాగాలేదని చాలామంది ఈసడించుకుంటారు!



18వ శతాబ్దం ప్రారంభంలో రష్యాలో ఆ కాలం నాటి ప్రభువులకు, పెద్ద పెద్ద భూస్వాములకు మధ్యన ఒక పెద్ద పోరాటం చెలరేగింది. ఆ రోజుల్లో పెరిస్లావల్ ప్రాంతాన్ని యెరోస్లవ్ సివోలోడవిచ్ అనే ప్రభువు పరిపాలించేవాడు. అప్పుడు డేనియల్ అనే వ్యక్తి ఆ ప్రభువు సముఖానికొక అర్జీ పంపుకున్నాడు. డేనియల్ బహుశః అతని ఆస్థానంలో ఒక ఉద్యోగిగా వ్యవహరించి ఉండవచ్చును. లేకపోతే బాగా చదువుకున్న 'దాస' వర్గానికి చెందినవాడైనా అయి ఉండాలి. డేనియల్ ఆ రోజుల్లో అవతరించిన ఒక స్వతంత్ర మేధావిలా కనిపిస్తాడు. అతని కాలంలో రష్యా సంస్కృతి అంతా చర్చి అధికార ముద్రకింద సాగిపోతూండేది. ఆ నాడు చర్చి అధికారానికి లోబడని రచన ఏదైనా కనిపిస్తే ఈ నాటిది యథార్థమైన రచన అని ఎవరు నమ్మరు! ఆ రోజుల్లో అలాంటి రచన చెయ్యడానికెవరికి దమ్ములుంటాయి కనక?

ఆనాడు డేనియల్‌కి తన స్వతంత్రప్రతిపత్తి మీద చిరాకు బయలుదేరింది. అందుచేత అతడా అర్జీలో తనకు సంరక్షణ ప్రసాదించవలసిందని ప్రాధేయపడ్డాడు.

"ప్రభువర్యా! నన్ను తమరొక తోడేలు గొర్రె పిల్లని చూసినట్టుగా చూడటం న్యాయం కాదు. తల్లి పిల్లని చూసినట్టుగా చూసి దయదలచాలి.!"

పాపం ఆ పరిస్థితులలో అతడెన్నో ఇబ్బందులు పడ్డాడు. అవన్నీ ఆ అర్జీలో విన్నవించుకొన్నాడు. తనకు సామాన్యంగా అందరు కోరుకొనే—డబ్బున్న భార్య, చర్చి అధికారము—మొదలైన ఆసరాలేవీ అక్కరలేదన్నాడు. ప్రభువు కటాక్షం కోసమే పడిగాపులుపడి కూర్చున్నానని విన్నవించుకున్నాడు. డేనియల్ ఇదంతా నక్క వినయంతో వ్రాశాడని అనుకోకూడదు. అతని అర్జీలో ప్రాధేయపడిన ధోరణిలో సిగ్గు, లజ్జ లేనట్లే కనిపిస్తాయి:

"ప్రభూ! తాము నేను కుక్కలా పడిఉన్నానని అనవచ్చును. కాని ప్రభువర్యులకు, పెద్ద పెద్ద భూస్వాములకు మంచి జాగిలాలు చాలా అవసరం!"

ఆనాటి ప్రభువుల ఆస్థానాలలో యోధులున్నారు! విదూషకులున్నారు. సంగీత విద్వాంసులున్నారు! పెద్ద పెద్ద జాగిలాలున్నాయి! మరి మేధావంతులుమాత్రం ఎందు కుండకూడదు?

డేనియల్ ఆ ప్రభువు వారికి చేసుకున్న విజ్ఞాపనలో చాలాదూరదృష్టి కనబడుతుంది. దానిలో రష్యా

కు సంబంధించిన భవిష్యద్వాణి కూడా స్పష్టంగా వినబడుతుంది. అతని విజ్ఞప్తి ఇది:

"ప్రభూ! మీరు ధైర్యసాహసాలున్న వారి నిట్టే చేరదీయవచ్చును! కాని బుద్ధికుశలతగలవారు దొరకడం మాత్రం చాలా కష్టం!"

చిట్ట చివరికి డేనియల్ అర్జీ ఫలిత మేమయిందో మనకు తెలియదు. కాని అప్పటినించీ ఆయా శతాబ్దాలలో అవతరించిన రష్యాపరిపాలకులంతా డేనియల్ సలహా చాలా జాగ్రత్తగా ఆచరణలో పెట్టారు. పీటర్ స్వయంగా కొన్ని అనువాదాలు చేయించాడు. కేథరిన్ నాటకాలేగాక వ్యంగ్య రచనలెన్నో చేసింది. మొదటి నికొలాస్ స్వయంగా పుష్కిన్ కవిత్వంలో కొన్ని భాగాలు నిషేధించాడు. లెనిన్ ప్రత్యేకంగా వాఙ్మయంమీద కొన్ని ఉపన్యాసాలిచ్చాడు. స్టాలిన్ విశ్వవిద్యాలయాల్లో ప్రతివిషయంమీద తన స్వంత అభిప్రాయాలు ప్రకటించాడు. మొత్తంమీద మేధావంతుల నదుపాజ్ఞలలో పెట్టని రష్యాపరిపాలకు లెవరు కనిపించరు! ఆ పరిపాలకులు 'సాహిత్యానికి ముంగుజా' కావాలని తహ తహ పడిన కొద్దీ అది బాగా దెబ్బతిన్నదని నిస్సంకోచంగా చెప్పవచ్చును. సాహిత్యంమీద నిషేధాజ్ఞలు, ప్రభుత్వాలు చేసే సహాయాలు — అన్నీ పట్టి సంసారపక్షపు సాహిత్యపరులకే ఉపయోగిస్తాయి.

ఇలాంటి విధి నిషేధా లెన్ని ఉన్నా రష్యాలో ప్రతియుగంలోను సాహిత్యంలో అజరామరులయిన మహామహు లెందరో ఉదయించారు! రష్యాలో 'లే ఆఫ్ ఇగోర్స్ రెయిడ్' అనే పుస్తకం ఒకటుంది. కాని గ్రంథకర్త ఎవరో తెలియదు. అది గొప్ప గ్రంథం. 'మాగ్జిమ్ ది గ్రీక్' అని ఇంకొకరచయిత ఉన్నాడు. అతను విద్యావిషయాలమీద, మత విషయాలమీద కొన్ని అభిప్రాయాలు వెల్లడించాడు. వాటివల్ల అతనికి జైలుప్రవేశం జరిగింది. లోమొనోసవ్ కవన బద్ధవాళ్ళందరితోను తగాదాలు పెట్టుకున్నాడు. కాని లక్ష గవర్నమెంటుకమిటీలు చేసినపనికంటె అతని రచనలే రష్యాసాహిత్యాని కెక్కువ ప్రోద్బలం కలిగించాయి. మొత్తంమీద చాలామంది చేసిన రచనలకంటె అతనిరచనలు గొప్పవి. ఇలాగే 18వ శతాబ్దిలో రెడిషివ్ అని ఇంకొక గొప్పవ్యక్తి అవతరించాడు. పాపం చివరికి అతను ఖైదులో పెట్టి బాధిస్తారనే బెంగతోనే ప్రాణాలువిడిచాడు!

ఇక 19, 20 శతాబ్దాలలో ఇలాంటివా రెందరెందరో కనిపిస్తారు. వీరంతా చాలా ప్రతిభావంతులు. కాని ప్రభుత్వ వర్గాలతో కలహించారు. వారిరచనలీనాడు అద్భుతంగా కనిపిస్తాయి... ఎన్ని ఇబ్బందులు వచ్చినా ఎన్నికష్టాలుపడినా వారెన్నడు వెనకంజ వెయ్యలేదు! అందుచేతనే ఈనాడు వారికి మనమందరము జోహారు లర్పిస్తున్నాము.

స్టాలిన్‌తరువాత అధికారంలోకివచ్చిన రష్యా పరిపాలకు లింతవరకు అట్టే ఆర్భాటం చేసినట్టు కనబడరు. అయితే వారికి మేధావుల ధోరణికి సంబంధించిన సమస్యలన్నీ కూలంకషంగా తెలుసును. ప్రతిభావంతుల విలువకూడా వారికి బాగా ఎరికే! నేటి రష్యాలో యువ మేధావులుకూడా అట్టే ఆర్భాటం చేస్తున్నట్టు కనబడరు. కాని వారి సమస్య అలాగేఉంది. వారంతా అన్ని విషయాలు లోతుగా పరిశీలిస్తున్నారు. ఏవేవో రచనలు సాగిస్తున్నారు. ఏదో అవకాశం కోసం ఎదురుచూస్తూ ప్రస్తుతాని కలాగే కాలక్షేపం చేస్తున్నారు!

[ఎన్‌కౌంటర్ పత్రిక సౌజన్యంతో]

# కలగూరగంప

## కావ్య గుణములు

'రాజేశ్వరి'

గుణమను పదము నానార్థ సంకలితము. అన్నంభట్ట విరచితమైన తర్క సంగ్రహమున "ద్రవ్య గుణ కర్మ సామాన్య విశేష సమవాయాభావాః" అని మొదటి సూత్రము. పై వాక్యమునుబట్టి నైయాయికుల మతమున పదార్థములు సప్త విధములు. ఇందు "రూప, రస గంధ, స్పర్శ సంఖ్యా పరిమాణ పృథక్త్వ సంయోగ విభాగ పరత్వా పరత్వ గురుత్వ ద్రవత్వ స్నేహ శబ్ద బుద్ధి సుఖ దుఃఖ ఇచ్ఛా ద్వేష ప్రయత్న (ప్రయుక్త) ధర్మా ధర్మ సంస్కారాః చతుర్వింశతిః గుణాః" అని గుణము లిరువది నాల్గుగాఁ జేర్కొనఁబడినవి.

ఇట్లు గుణశబ్దము వస్తుమాత్రధర్మము గాను మనుష్య ధర్మములగు శౌర్యాదులపరము గాను వాడఁబడి క్రమముగా కావ్యధర్మవాచకముగాఁగూడ నైనది. వస్తుధర్మములైన గుణములు వస్తువుల నాశ్రయించుకొని యుండి భిన్న పదార్థములందును సమవేతములై యుండును.

అలంకారశాస్త్రమునందు గుణవిచారణావిర్భావ కాలమునుగూర్చి భిన్నాభిప్రాయములు కలవు. అలంకారశాస్త్ర పితామహుఁడగు భరతమునీంద్రుని నాట్యశాస్త్రమందలి కావ్యాంగములలోఁ జేర్కొనఁబడిన గుణములే గుణవిచారావిర్భావమునకు మూలమని పలువురి అభిప్రాయము, కాఁగా నాట్యశాస్త్రమునకుఁ బూర్వమే కావ్య గుణప్రసక్తి కలదని కొందరాలంకారిక విమర్శకుల యభిప్రాయము.1 దీని కుపబలకముగా వీరు చూపిన ప్రమాణము శకరాజగు రుద్రదమనుని శాసనము.2 (తత్కాలము క్రీ. శ. 150 అని పి. వి. కాణేగారు పేర్కొనిరి) ఆశాసనమునందు:

"స్ఫుట లఘు మధుర చిత్రకాంత శబ్ద సమయ
ఉదార అలంకృత గద్య పద్య కావ్య విధాన ప్ర
వీణేన ప్రమాణ మానోన్మాన స్వర గతి వర్ణ సార
సత్వాదిభిః పరమ లక్షణ వ్యంజనైరుపేత కాం
తమూర్తినా స్వయ మధిక మహాక్షత్రప నామ్నా"

ఇది రుద్రదమనుని వర్ణనము. ఇందు పేర్కొనఁబడిన మధురము, కాంతము, ఉదారము అను శబ్దములు గుణనామములని కాణేగారి యభిప్రాయము. కాని ప్రకరణమునుబట్టి యీపదములు "మధురమైనట్టియు, ఉదారమైనట్టియు, మనోజ్ఞమైనట్టియు" అను విశేషణార్థమును స్ఫురింపజేయుచున్నవి.

'కాంతి' శబ్దముచేత కాంతియును 'ఉదార' శబ్దముచేత నౌదార్యమును 'మధుర' శబ్దముచేత మాధుర్యమును శాసనకర్తలచే నుద్దేశింపబడినట్లు పై విమర్శకుల యభిప్రాయము కావచ్చును. అనఁగా పైని పేర్కొనబడిన కాంతాది శబ్దములు కావ్యము యొక్క శబ్దాది ధర్మములుగా కాని ఆత్మయైన రసాది ధర్మములుగా కాని నిర్ణయించి వానిని ప్రత్యేక గుణములుగా పేర్కొనిరి. అట్లుకాక కేవలము విశేషణ సామాన్యములుగా శాసనము నందలి యితరము లగు చిత్రాదిపదములతో చేర్చి చెప్పుట సక్రమపద్ధతి. మొదటి మార్గము, శాస్త్రము పరిపూర్ణము నందిన తరువాతమాత్రమే చెప్పుటకవకాశమున్నది. రెండవది ప్రాథమికావస్థయందుండు రూపమును సూచించును.

1. History of Alankara literature (Second Edition) by P. V. Kane.

2. Junugad Inscription of Rudradaman I, Saka year 1f0 A. D. Calcutta University Publication.

రుద్రదమునిని నాటికి (150 క్రీ॥ పూ॥) అనగా, నాట్యశాస్త్రమునకుఁ బూర్వము (300 క్రీ॥ పూ॥) అలంకార శాస్త్రమంత విపులముగాఁ బెరిగియుండ లేదనుట నిర్వివాదాంశము. కావుననీ సందర్భమునందు రెండవ పద్ధతి నంగీకరించుటయే సముంజసమని తోచుచున్నది.

కావ్యమును స్త్రీస్వరూపముగా నాలంకారికులు సమన్వయించుటం జేసి తదాశ్రయములైన శౌర్యౌదార్యముల వంటివి కావ్యమునందుగూడ నుందునని యంగీకరింపబడినది. కావ్య ప్రకాశమున :

"యే రస స్యాంగినో ధర్మాః శౌర్యాదయ
ఇవాత్మనః
ఉత్కర్ష హేతవ స్తేస్యు రచల స్థితయోగుణాః."
(కావ్య. ప్ర. ; అష్టమోల్లాసము ౬౬ శ్లో)

అనియు, ప్రతాపరుద్రీయమున

"హారాదివ దలంకారా స్తత్ర స్యు రుపమాదయః
శ్లేషాదయో గుణా స్తత్ర శౌర్యాదయ ఇవ స్థితాః"
అనియు

సాహిత్య దర్పణమున

"రసస్యాంగిత్వ మాప్తస్య ధర్మాః శౌర్యాదయో
యథాగుణాః..............."
(సాహిత్య. ద. అష్టమ పరిచ్ఛేదము ౧-వ శ్లో)

అనియు చెప్పగా, విద్యానాథుని అనుగామియగు కావ్యాలంకారసంగ్రహకర్త—

కం. తనువగు శబ్దార్థంబులు
ధ్వనిజీవ మలంక్రియావితానము సొమ్ముల్
తనరు గుణంబులు గుణములు
ఘన వృత్తులు వృత్తు లౌర కావ్యేందిరకున్.

అని పేర్కొని యున్నాఁడు.

ఇక కావ్య గుణములయొక్క సంఖ్య విషయమునను భిన్నాభిప్రాయములు గలవు. అగ్ని పురాణమున గుణముల ప్రసక్తి కలదు. ఇందు అలంకార శాస్త్ర విషయములం గూర్చి 336-346 ప్రకరణములందు వివరింపఁ బడినవి. కాని ఈ భాగములు ప్రాచీనములు కావనియు తరువాతి కాలమున చేర్పఁబడిన వనియు సిద్ధాంతితము. భరతుఁడు నాట్యశాస్త్రమున, ముఖ్యముగా నాట్య విషయమే వ్రాసినను అందు తత్సంబంధమైన రసాదులే గాక పదునారవ ప్రకరణమున కావ్య లక్షణములను గూడ చెప్పుచు కావ్యకాంతాలంకామకు అలంకారప్రాయములైన గుణాలంకారములను గూడ పేర్కొని యున్నాఁడు.

శ్లో. శ్లేషః ప్రసాదః సమతా సమాధిః *
మాధుర్య మోజః పదసౌకుమార్యం
అర్థస్యచ వ్యక్తి రుదారతాచ
కాంతిశ్చ కావ్యస్య గుణా దశైతే"॥
(నాట్యశాస్త్రము-16 వ. ప్ర. 95 వ శ్లో.)

అని గుణములు దశవిధములుగా చెప్పియున్నాఁడు. అప్పటికి కావ్యనాట్యములకు విభాగ మేర్పడి యుండలేదన వచ్చునేమో!

భామహుని కావ్యాలంకారము శ్రవ్యకావ్యములను గూర్చి సమన్వయించి వ్రాసిన గ్రంథములలో ప్రాథమిక మైనది. ఈతఁడు గుణములయొక్క ప్రాధాన్యమును గుర్తించినట్లు లేదు, మాధుర్య-ఓజః-ప్రసాదములను మూఁడు గుణములనే పేర్కొనినాఁడు. తరువాతి వారగు మమ్మట హేమచంద్రాదులును కావ్య గుణములను మూఁడుగనే యంగీకరించిరి.

దండి, గుణములకు గలస్థానమును పైవానివలెనే స్పష్టముగ తెలుపక పోయినను వానికి ప్రాధాన్య మిచ్చి భరతాదులు పేర్కొనిన పదిపేర్లనే వివరించెను. అవి క్రమముగ శ్లేష, ప్రసాదము, సమత, మాధుర్యము, సౌకుమార్యము, అర్థవ్యక్తి, ఉదారత, ఓజస్సు, కాంతి, సమాధి. ఇప్పటికిని దండ్యాచార్యుఁడును శబ్దార్థ గుణ విభాగము తెల్పియుండలేదు.

దండ్యాచార్యుల నాటికి ముకుళితావస్థయందున్న గుణమత కోరకము, వామనాచార్యుల నాటికి రీతిమత వాదరూపదోహదముచే ఫుల్లకుసుమితమైనది. కావ్య శరీర సౌందర్యము నేగాక ఆత్మ తత్త్వ పరిశీలనావస్థుఁడై వామనుఁడు గుణాలంకార సంస్కృతిములైన శబ్దార్థములకే కావ్యశబ్దము వర్తించుమని చెప్పుచు తన పూర్వుల కన్న వివేకమును ప్రదర్శించెను. ఈతఁడు రీతిత్రయ ప్రతిష్ఠిత కావ్యశోభకు గుణములు ప్రధానములని చెప్పుచు "రీతిరాత్మా కావ్యస్య, విశిష్టా పదరచనా రీతిః—"అనియు, "విశేషోగుణాత్మా" అనియు చెప్పుటంజేసి గుణములు ప్రధానములనియు అవి కావ్యశోభకు కర్తలనియు తేలినది. వామనాచార్యుఁడు దశగుణములను శబ్దగుణములుగా సంగీకరించి వానినే అర్థగుణములుగా కూడ నిరూపించియున్నాఁడు. దాన నీతని మతమున పేరికి మాత్రము దశగుణములే యైనను స్వరూపనివేదనావసరమున 'వాచ్యవాచక' ద్వారమున లెక్కకు వింశతి గుణములై యలరారుచున్నవి.

ఆనందవర్ధనాచార్యుఁడు "శృంగారః రసాంతరాపేక్షయా మధురో రసః తన్మయం కావ్యమాశ్రిత్య మాధుర్యలక్షణో గుణః ప్రతితిష్ఠతి—

* భరతుని నాట్యశాస్త్రము. పదునారవ ప్ర॥ 95 వ శ్లో॥

విప్రలంభశృంగారే కరుణే మాధుర్యం ప్రకర్షవత్" అని మాధుర్యము శృంగారముయొక్క ముఖ్య గుణమనియు, విప్రలంభశృంగారమునందును కరుణము నందును తద్విజృంభణ మధికమనియు చెప్పుచు గుణత్రయమును సూచించినాడు.

మమ్మటుడును ఆనందవర్ధనాచార్యుని వలెనె గుణత్రయమును మాధుర్యౌజఃప్రసాదములు అంగీకరించి దండి వామనాదులు చెప్పిన గుణములు పైవాని యందంతర్భూతములనెను.

పండితరాజు ప్రాచీనులు చెప్పిన దశగుణములను వివరించుచు తన మతమున మాత్రము గుణములు మూడే యను నభిప్రాయమును కనబరచినాడు. భోజ విద్యానాథుల ప్రకారము గుణము లిరువదినాల్గు. విద్యానాథుని మతమున పైగుణములలో కొన్ని స్వయముగా చారుత్వ హేతువులు కావున గుణములగుచున్నవి. మరికొన్ని దోషపరిహార హేతుమాత్రములు.

సౌకుమార్యము కాంతి సమ్మితత్వము ఉదాత్తత ఔర్జిత్యము రీతి ప్రసాదము ఉక్తి సౌశబ్ద్యము సమత ప్రేయము అనునవి దోషాభావరూపములై గుణత్వము గాంచుచున్నవి. శ్రుతికటుదోషనివారణార్థము సౌకుమార్యము, గ్రామ్యదోష నివారణార్థము కాంతియు, అపుష్టార్థపరిహారమునకు అర్థవ్యక్తియు, న్యూనాధిక పదదోష పరిహారార్థము ఉదాత్తతయు, విసంధి దోషమునకు ఔర్జిత్యము, పతత్ప్రకర్ష దోషమునకు రీతి, క్లిష్టదోషమునకు ప్రసాదము, అశ్లీలమునకు ఉక్తి, చ్యుతసంస్కారమునకు సౌశబ్ద్యము, ప్రక్రమభంగమునకు సమత, పరుషమునకు ప్రేయము, పరిహారకరములుగా నంగీకరింపఁబడినవి. దోషపరిహార హేతుభూతములైన గుణములను గుణములుగా ఆలంకారికు లందరు నంగీకరింపరు. కారణము గుణముల ప్రత్యేక స్వరూపముపట్ల ఆలంకారికులలో గల భేదాభిప్రాయమే. దోషాభావమాత్రముచే గుణత్వ మబ్బుచున్నదను వారి మతముననే సౌకుమార్యాదులు గుణములగుచున్నవి. ఈ సందర్భముననే క్షేమేంద్రుఁడు శబ్దార్థోభయనైర్మల్యములను మూఁడు విధములను దెల్పియున్నాఁడు. కాని యీమతము మృతశిశుప్రాయమై నామమాత్రావశిష్టమై పోయినది.

పైవిమర్శనమువలనఁ దేలిన సారాంశ మేమనగా కావ్యమునందు గుణప్రాధాన్య విషయ మెట్లున్నను గుణముల సంఖ్యానిరూపణమునందే భిన్నాభిప్రాయములు కన్పట్టుచున్నవి. గుణములసంఖ్య పదియనువారు కొందరు, ఇరువదినాల్గనువారు కొందరు, మూఁడనువారు కొందరు.

భోజవిద్యానాథులు వినా తక్కిన యాలంకారికులలో గుణసంఖ్య నిరూపణముపట్ల ముఖ్యముగా రెండు సిద్ధాంతములు కలవు. మమ్మటాదులు మొదటి తెగకు చెందినవారు. వారి ప్రకారము గుణములు మూఁడు. దండి వామనాదులు ద్వితీయకక్ష్యకు చెందినవారు. వీరి ప్రకారము గుణములసంఖ్య పది. మూఁడనుచెప్పువారి లక్షణ మెట్లును పరస్పరము భేదకముగనే యున్నది. ఇక పదియనువారిని ప్రత్యేకించి చూచినను, ఒకరి లక్షణ మింకొకరికి నప్పుటలేదు. స్థూలదృష్టికి కొన్ని పరస్పర విరుద్ధములుగ కూడ భాసించును. ఉదాహరణకు॥ సమాసభూయస్త్వము ఓజముగుచుండగా (ఓజస్సమాసభూయస్త్వం) వేరువేరు పదములను కూర్చు రచన మాధుర్యముగుచున్నది. (యా పృథక్పదతా వాక్యే తన్మాధుర్యం ప్రకీర్త్యతే) అట్టే శ్లేషకును మాధుర్యమునకును విరోధమున్నట్లు భాసించును.

అప్పకవి వినా తెలుఁగు ప్రాచీనాలంకారికు లందరు గుణములను దశవిధములుగనే వివరించిరి. అనంతుఁడు దోషములవరకు, కావ్యగుణములను స్పృశించి ప్రక్కనే యున్న గుణములపట్ల మూకీభావము వహించుటకు గతి మేమియో తెలియకున్నది. మాదామాత్యకారుఁడును "[illegible] ఔదార్య శ్లేషములును సుకుమారతా ప్రసాద మధురతార్థవ్యక్త్యోజస్సమాధి కాంతులును దశగుణప్రాయములై" అని గుణములను పదింటినే పేర్కొనినాఁడు.

ఇక నరసభూపాలీయము:— "ప్ర. రుద్రీయమునకుఁ గావ్యాలంకార సంగ్రహము తెనుఁగు సేతయే" అను విషయ మిప్పట్టున కొలదిగ పరికించుట అప్రసక్తము కాదనుకొందును. ప్ర. రుద్రీయకారుఁడు శ్లేషాది గుణముల నిరువదినాల్గింటిని పేర్కొనినాఁడు. వానిలోఁ గొన్ని దోషపరిహారకత్వముచే గుణత్వము నందుచున్నవనియు, కొన్ని సహజములైనే యుత్కర్ష హేతువులగుటచే గుణములగుచున్నవనియుఁ దెలుపుచు సహజచారుత్వ హేతువులగు గుణములే యుత్కృష్టములగుననియు, దోషపరిహారకత్వముచేఁ గుణత్వమందునవి, సర్వాలంకారిక సమ్మతములు కావనియు చెప్పినాడు. విద్యానాథుఁడు చెప్పిన ఇరువదినాల్గు గుణములలోను పండ్రెండు సహజగుణములు. మిగిలిన పండ్రెండు దోషపరిహారకత్వముచే గుణములు.

కా. సం. కర్త పయిప్రణాళిక ననుసరించినట్లు తోచదు. ఈతఁడు పేర్కొనిన గుణములు మొత్తము పది మాత్రమే. అందు గుణవిభాగ మేమియు చేసియుండలేదు. కాని విద్యానాథుఁడు సహజగుణములని చెప్పిన వానినుండి ఐదును, దోషపరిహారకత్వముచే గుణత్వ మందునను వానినుండి యైదును గ్రహించినాఁడు. మొత్తిమేల గ్రహింపలేదో, గ్రహించినపైనను ఒక తరగతినుండి కొన్ని వేరొక తరగతినుండి కొన్ని గ్రహించుటకు కారణమేమియో తెలిపియుండలేదు. మరియు

నీతఁడు పేర్కొనిన పదిగుణములు విద్యానాథుఁడు చెప్పిన మొదటి పదునైదు గుణములలోనే ఇమిడి పోయినవి.

ప్ర. రు. నందలి కొన్ని లక్షణములు కా. సం. నందలి లక్షణములకంటె భిన్నములు. ప్ర. రు. న "వికటాక్షర బంధత్వ మార్యై రౌదార్యమిష్యతే" అన, కా. సం. కారుఁడు "కతిపయ సంయుక్తాక్షర వితతం త్వౌదార్యమయ్యే" అని లక్షణమును కూర్చినాఁడు. వికటాక్షర బంధత్వముతో కతిపయ సంయుక్తాక్షర వితతింబునకు సామ్యమేమియో తెలియదు.

సౌకుమార్య నిరూపణముపట్ల ప్ర. రు. కారుఁడు:

"సుకుమారాక్షర ప్రాయం సౌకుమార్యం తదుచ్యతే" అనియు, సరస భూపాలీయకర్త "అరయఁగ బొల్లు పిఱుందల నగుదగునది సౌకుమార్యము" అనినాఁడు —అపరుషత్వము సౌకుమార్యమని రత్నాపణము. బొల్లనఁగా సున్నలు సమగల పదములని తెలుఁగు లక్షణమునకు అర్థము చెప్పుకొనవలయును. అట్లు చెప్పుకొన్నను, పైలక్షణముతోఁ బొత్తుకుదరదు. సరికదా ఒకప్పుడు బొల్లు పిరుందల లేనప్పుడుకూడ సౌకుమార్యము పొసగకలదు. కావున లక్షణము అవ్యాప్తిదోషమునకుఁ బాల్పడుచున్నది.

సమత:—"అవైషమ్యేణ భణనం సమతా సాని గద్యతే" (ప్ర. రు)

"లలితార్థ భంగిఁబాదంబులు నాల్గిట నేకసరణిఁ బొనుపఁ సమతయగు" (శా. సం)

పాదంబుల నాల్గిట అనుటచే మూలమునందు చెప్పిన లక్షణార్థమునకంటె నీయర్థము కొలఁదిగ సంకుచితముగుచున్నది. నాలు పాదములకన్న హెచ్చున్నపట్టులఁగూడ సమతయుండును కదా. అప్పుడీ లక్షణము సంకుచితమగును. లేక నాల్గు పాదములనుటను "కాకేభ్యోదధి రక్ష్యతామ్" అనుపట్ల కాకశబ్దము దధ్యుపఘాతి జంతు పరముగునట్లు సర్వపాదములని చెప్పుకొనవలయును.

అప్పకవియు తన గ్రంథమున ప్రసక్తముగా కావ్యగుణములను వర్ణించియున్నాఁడు. "అర్థవ్యక్తి సౌకుమార్యౌజః ప్రసాదకాంతి మధురతౌదార్యసమాధి సామ్యశ్లేషములు పదియును. ప్రాణములు దలంప" అని గుణములసంఖ్య పదియని చెల్పుచు నేయే దోషమున కేయేగుణము పరిహారకారకమో చెప్పనెంచితాను చెప్పని గుణములను కొన్ని పేర్కొనినాఁడు. అనగా అప్పకవి తాను మొదట పేర్కొనిన గుణములు పదిమాత్రమే కాని దోషాభావమాత్ర ప్రయోజకములని తెలుపఁబడిన గుణములు పండ్రెండు. ప్ర. రు. నందు దోష పరిహార కారులని చెప్పబడిన కొన్ని గుణనామములకును అప్పకవీయము నందిచ్చినవానికిని పొత్తు కుదరలేదు. అనఁగా రెండిటికిని నామగ్రహణమునందు భేదము గోచరించుచున్నది.

ప్ర. రు. నందు చ్యుత సంస్కృతికి సౌశబ్ద్యము చెప్పగా, అప్పకవీయమున మధురతియు, అందు అశ్లీలాభిధానమునకు ఉక్తిని చేర్కొనఁగా నిందు సూక్తితంత్రమనియు, అందు న్యూనాధిక పదమునకు సమ్మితత్వము వివరింపఁగా నిందు సామ్య కల్పనమనియుఁ జెప్పఁబడినవి. ఈ విషయమున అప్పకవీయ ముద్రణ సంస్కర్తలు సరిగా వ్రాతప్రతులలోని దోషములను దిద్ది సంస్కరింపకుండుటచేత చాల తబ్బిబ్బేర్పడినది. అదియుగాక అప్పకవి పద్యములలోని గణప్రాసాది నిర్వంధముకొరకు కొన్ని పేర్లను మార్చియు కొన్ని కూర్చియుండుటచే పై చిక్కు మరింత హెచ్చినది.

కావ్యమనోహరతా ప్రతిపాదకము గుణాలంకారములు రెండును సమానాంగములే. అటైనచో గుణాలంకారముల కేల యాభేదము చెప్పరాదను ప్రశ్న కల్గుచున్నది. ఆ చర్చ ఆలంకారికులలో కలుగక పోలేదు. వామనుని మతమున గుణములు అర్థగతములు శబ్దగతములు కూడనగుటచేత గుణాలంకారములకు భేదము తానొక యుక్తిపూర్వకముగ సాధించినాఁడు. అతని మతమున గుణములు స్వతస్సిద్ధముగా చారుత్వ హేతువులు కాగా, అలంకారములు ఉన్న శోభను అతిశయింప జేయునవగుచున్నవి. గుణముల వలె అలంకారములు స్వతస్సిద్ధముగా కావ్య శోభకుపస్కారకములు కావనుటచే నాతని మతమున గుణాలంకారములకు భేదము నిరూపితమగుచున్నది. కాని ఈతని మత ప్రకారము గుణములన్నియు కావ్య శోభాకారులే యనక తప్పదు. అట్లంగీకరించినచో సర్వగుణ సంభరితము వైదర్భీ రీతియే గాక కతిపయ గుణములు గల్గిన మరికొన్ని నీరస స్థలములలో గూడ కావ్యత్వమున్నదనవలసి వచ్చును. కావుననే వామన మతము శాస్త్ర చర్చకు నిలువఁజాలక వామనమై పోయినది.

కావ్యేందిరకు గుణాలంకారములు రెండును మనోజ్ఞత్వమును గూర్చునవియే యైనను తత్కార్యకలాపకరణములు మాత్రము భిన్నములు. గుణములు సంఘటనాశ్రయములు. అలంకారములు శబ్దార్థ ధర్మములు. ఈ భావమునే ప్రతాప రుద్రీయ కారుడు ప్రాచీనాచార్యులు చెప్పినట్లు.

"చారుత్వ హేతుత్వేఽపి గుణానామలంకారాణాం

చాశ్రయ భేదాద్భేద వ్యపదేశః సంఘటనాశ్రయా గుణాశ్శబ్దార్థాశ్రయాస్త్వలంకారాః" అని చెప్పియున్నాఁడు.

# గ్రంథ విమర్శనము



## వేణీ సంహారము

**మూలం:** భట్ట నారాయణుడు. **అనువాదం:** శ్రీ బులుసు వేంకటేశ్వర్లు. ప్రతులకు: వి. వి. అండ్ సన్సు, రామారావుపేట, కాకినాడ. వెల: 3-0-0

సంస్కృత వాఙ్మయమున వెలసిన నాటక సంచయమునందు భట్ట నారాయణుని వేణీసంహార నాటకమునకు తగినంత ప్రతిష్ఠ వచ్చింది. కాళిదాస మహాకవి రచనలలో అభిజ్ఞాన శాకుంతలము, భవభూతికృతి ఉత్తరరామ చరిత్ర గీర్వాణానికి రెండు నయనములు కాగా భట్ట నారాయణుని వేణీసంహారము తిలకాయమానమని పేర్కొనడమునకు సందేహింపపనిలేదు.

కథావస్తువు, దానికి తగిన రసము, భాష, శైలి, నాయకుడు, ప్రతి నాయకుడు సమంజసమైన విధాన అమరిన ఉజ్జ్వల సృష్టి వేణీ సంహారం.

లాక్షణికులు చెప్పిన లక్షణాలనన్నింటిని వంటపట్టించుకొని తరువాతి వారి రచనలకు తానొక లక్షణ గ్రంథమైన పరువును సంతరించుకొన్నదా నాటకం.

వేణీ సంహారమును ఓం ప్రథమముగా ఆంధ్రీకరించినవారు కీ॥ శే॥ కొండా రామచంద్రశాస్త్రి గారని వినికిడి. కాని అది అముద్రితమైనందువలన కాబోలు అంతతోనే ఆగిపోయింది.

తరువాత ఆంధ్రీకర్త కీ॥ శే॥ వడ్డాది సుబ్బారాయ కవిగారు. దీనికి తెలుగుదేశములో చాలా ప్రచారం వచ్చింది. అనువాద విషయములో సుబ్బరాయకవి గారిది యథేష్టంగా నడిచిందే కాని ప్రదర్శనయోగ్యమై పలువురి మన్ననలందుకొన్నది.

కవి సార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రుల వారి అనువాదం ఒకటి ఉంది. అది శ్రీవారి బహుముఖ ప్రజ్ఞకు ప్రతిబింబముగా వాసికెక్కింది.

ప్రకృత గ్రంథము ఇంచుమించు నాల్గవదిగా పేర్కొనవలసి ఉంది. ఇది మూలమును చేపట్టి చూడగా చేర్పులూ కూర్పులూ ఉన్నట్టు స్పష్టం అవుతూంది.

దుశ్శాసనుడు పరమ పతివ్రతయైన ద్రౌపదిని జుట్టుపట్టి సభలోనికీడ్చుకొనిరాగా అపరాధానికి ప్రతీకారం జరిగేవరకూ కొప్పు ముడవనని ఆమె ప్రతిన పట్టింది. ప్రియసాహసుడైన భీముడు, తదనుగుణముగా దుర్యోధనుని తొడలను తన గదచే విరుగగొట్టి తద్రక్త సిక్తములైన హస్తములతో ద్రౌపది వేణి ముడిపెట్టాడు. ఈ విధాన నాటకానికి 'వేణీ సంహారము' అని పేరు వచ్చింది.

ఈ నాటకానికి నాయకుడెవరు? రసమేమి? అనే ప్రశ్నలకు సమాధానాలు సులభముగా రావు. చిరకాలమునుండీ ఆవిషయ ద్వయమూ వివాద గ్రస్తమయ్యే ఉంది. పరిమితమైన యీ సమీక్షలో మేము దానిని వివరించి చెప్పలేము గాని ప్రతినాయకుడైన దుర్యోధనుడు మదోద్ధురుడు మహామాని. వానికి తగిన నాయకుడు ధీరోద్ధతుడు, ప్రియసాహసుడైన భీముడొకడే. కనుక ఇందు నాయకుడు భీముడే కావొచ్చునని మా యుద్దేశం. ఏతావతా రస విషయం ఇలాగే నిర్ణీతమవుతుంది. అది రౌద్రం. రౌద్రం అంగిరసం—అని ఫలితార్థం.

భారతానికీ భట్టనారాయణుని యీ నాటకానికీ కథా గమనములో చాలా మార్పులున్నాయి. వానిలో రెండవ అంకమున ప్రాకోట కథ ఉత్కృష్టమైన మార్పు. ఉపవనమున చెలికత్తెలకు రేయి గాంచిన స్వప్న వృత్తాంతమును భానుమతి వగరు బెదురులతో చెప్పుచుంటూ ఉంటుంది. అది దుస్స్వప్నమనీ, యథావిధిగా శాంతి చేయించాలనీ చెలికత్తెలూ, ఆమె అనుకొంటూ ఉండగా అవివేకి దుర్యోధనుడు అక్కడకు వచ్చి శృంగార కలాపానికి దిగుతాడు. తత్ఫలితంగా కవి సూచించిన భావ్యనర్థం అసాధారణ రీతిగా ఉంది.

# గ్రంథ విమర్శనము

ఉవిద నీ చూపు 'దన్నునాయాగు యుగము'- అంటాడు సుయోధనుడు. వెంటనే కంచుకివచ్చి:

దేవా! భగ్నము, భగ్నము- అంటాడు.

దుర్యో: ఎవనిచే.

కంచు: భీమునిచే— '—మనోజ్ఞమైన మార్పు' సహజ రమణీయమైన సంభాషణ—.

అనువాదములో వేంకటేశ్వరులు గారు స్వేచ్ఛా విధానమును అవలంబించినట్లు చెప్పుచున్నారు. అందు వల్ల నాటకం చాలావరకు 'రక్తి' కట్టించేదిగానే ఉంది. అక్కడక్కడ పద్యాలలో అతికని పాద పూరణ పులకములైన పదాలు అనువాదాలలో ఇముడక తప్పదు. అలాటివాటిని సాధ్యమయినంతవరకు దరి రానీయక అనువదించారు. పద్యరచనలో పట్టుదల బాగా కనబడుతుంది.

"మాపుల విచ్చుపూవులను
మంచును దేనెను గూడిమాడియుఁ
రేపటిప్రొద్దు భూమిపయి
జీవ్వనఁ బూలును దాము రాలిపో,
నాపయి సూర్యకాంతి విరియంఁ
గఁ దోషించుచుఁ గమ్మతావులన్
వ్యాపనచేయు పద్మముల ప్రాలెడుఁ
జూచుము చంచరీకముల్."

ఆధునికమైన అనువాద సాహిత్యములో ఈ నాటకం మంచి స్థానాన్ని సంపాదించుకోగలదని ఆసిద్దాము. ఇందులో చారిత్రక విషయం ఒకటి ఇచ్చారు. నన్నయభట్టుకు సహాధ్యాయి అయిన నారాయణభట్టే ఈ నాటక కర్త అని—అది చరిత్ర పరిశోధనలో ధ్రువపడితే చాలా శ్లాఘ్యమైనవిషయం.

యా. ప.

* * *

## కృష్ణకథావిపంచి

పద్యకావ్యము; రచన: శ్రీ బాడాల రామకవి: ప్రాప్తినం: బాడాల రామకవి, యం. ఎ., ఆంధ్రోపన్యాసకుడు యువరాజ కళాశాల, మైసూరు. వెల రు 3.

'కృష్ణకర్ణామృతం' మన్నట్లు 'కృష్ణకథా విపంచి' అనగానే శ్రీ కృష్ణలీలాభివర్ణనా పరమైన కావ్యమనే స్ఫురణ కలుగుతుంది కాని ఇది అలాంటిది కాదు. ఇది కృష్ణదేవరాయల చరిత్ర. ఇలాంటి ప్రమాదమున్నదని గ్రహించే కాబోలు 'కృష్ణకథా విపంచి' అన్న ప్రధాన శీర్షిక క్రిందనే తిరిగి చిన్న అక్షరాల్లో కృష్ణదేవరాయల చరిత్ర అని ముద్రించారు. ఈ భాగ కంటే కృష్ణదేవరాయల చరిత్ర అంటే పోను. రాయలు దైవాంశ సంభూతుడని ఆ నాడు ప్రజాప్రవాదం వుండేదని అందుచేత అలా అన్నా ఫరవాలేదనీ కొందరు సమర్థింప చూస్తున్నారు గాని, అలాంటిది పొసగనిది. ఆయన అందును బతికే వారెవరన్నా అలా ముఖప్రీతికోసం పొగడినా అలాంటి ప్రజాభిప్రాయం వున్నట్టు నిరూపించటానికి ఆధారాలేమీ లేవు. ఇంత అనవసరం—అనాడు కాదు, ఈనాడు కాదు, ఏ నాడూ కూడా కృష్ణదేవరాయలు కృష్ణశబ్దవాచ్యుడుగా గుర్తింపబడుట అసంభవం. పైపెచ్చు 'కథావిపంచి' అనటం, లోపలి ఆశ్వాసాలకు, అసావేరి, ఆనందభైరవి వగైరా పేర్లు పెట్టడం, ఇదంతా సంగీత శాస్త్రమందు రచయితకున్న ఔత్సుక్యాన్ని తెలియ చేస్తున్నా, ప్రత్యేకమైన అర్థస్ఫూర్తి ఏమీ కనుపించటం లేదు. కథను, పోనీ గానం చేయుటమే అనుకున్నా, ఆ గానం చేస్తున్నవాడు కవి—ఎందుకొచ్చిన హడావిడి యిదంతా?

ఇది చారిత్రకగాథ; పాత్రలు చారిత్రక పురుషులు—అనగా పురాణ పురుషులుగారు. అయినా కవి కృష్ణదేవరాయలను గుణదోష సమన్వితుడైన చారిత్రక పురుషుడుగా చిత్రించటానికి ప్రయత్నించలేదు. కావ్య నిర్మాతకుండే స్వాతంత్ర్యాన్ని పురస్కరించుకొని, ధీరోదాత్త, ధీరలలితుల స్థాయినుంచి పడిపోకుండా పోషించుకురావటానికి ప్రయత్నించారు. ఇంతో అంతో చరిత్రనెరిగి దేవరాయల గుణావగుణాలు తెలిసినవారికి ఇదంతా కొంత ఎబ్బెట్టుగానే వుంటుంది. కృష్ణదేవరాయలుగాని, మరొక విజయనగ పాలకుడెవడేనాగాని ప్రశస్తుడు కావటానికి విజయనగర

సామ్రాజ్యవ్యవస్థ, దాని నిర్మాణానికి కారకులైన మహాపురుషులు, వారి ఆదర్శాలూ కారణంగాని, ఈ రాజాది పురుషులుమాత్రం గారు. ఇట్టి రచనలవల్ల చారిత్రకమైన ఈ మహాసత్యం విస్మరింపబడుతుందేమో ననే ఆందోళనతో ఇంతదూరం వ్రాయవలసివచ్చింది. ఇందుకు క్షంతవ్యుణ్ణి.

ఇది 7 ఆశ్వాసాల కావ్యం. ఈ ఆశ్వాసాలకు వరుసగా అసావేరి, అమృతవర్షిణి, ఆనందభైరవి, కదన కుతూహలం, హంసధ్వని, అఠాణా, కళ్యాణి, అని ఏడు రాగాల పేర్లు పెట్టారు. ఈయేడు ఆశ్వాసములకూ ప్రవేశికలుగా ఏడు పద్యాలు వ్రాశారు. ఈ పద్యాలు చదివితే ఈ శీర్షికలుంచటంలో కవిగారి అభిప్రాయమేమిటో మనకు కొంత బోధపడుతుంది. ఉదాహరణగా, 'అసావేరి' అనే ప్రథమాశ్వాసానికి ప్రవేశికగా ఇలా వ్రాశారు.

"ఎల్లరసములు కరుణను స్ఫుల్లమునదు
బాధల ప్రపంచశాంతియు పరిమళింప
రాయల విపంచి వేదనా స్థాయిపిలిచి
యమృతి మొలుకనసావేరి నాలపించు."

ఈ ఆశ్వాసంలో, కృష్ణదేవరాయలు. బహమనీ సుల్తానులు, గజపతిరాజులు, క్షోభాకారణమైన యుద్ధావసరాన్ని కల్గిస్తున్నందుకు పరివేదన పడటం అభివర్ణితం. అమృత 'వర్షిణి'లో పెద్దనగారి 'పూతమెఱుంగులో' అనుకవిత, గండపెండేరపు గజ్జెల రవంబు వినిపింపబడినై. 'ఆనందభైరవి'లో చిన్నాదేవి కథ వస్తుంది. 'కదన కుతూహలం' యుద్ధసన్నాహాల వర్ణన.

'హంసధ్వని'లో క్షేత్రయాత్రలు, ఈ ఘట్టంలోనే కృష్ణరాయలకు ఆంధ్రవిష్ణుదర్శనం, గోదాదేవి చరిత్ర వ్రాయవలసినదిగా ప్రబోధించటం వర్ణింపబడివుంది. 'అఠాణా' లో కళింగయుద్ధము, రాయచూరు యుద్ధము, అనంతరం తిరుపతి వెంకటేశ్వరుని దర్శనం చెప్పారు. చివరిది మామూలు కళ్యాణఘట్టం.

వీరికి ప్రాచీన కవులయెడ ప్రాచీన కవితా సంప్రదాయముల యెడా గాఢమైన అభిమానం వుంది. వీరి పద్యనిర్మాణ విధానం, భావన ప్రాచీన సంప్రదాయ ధోరణిలోనే నడుస్తూ వుంటాయి. ప్రతి పద్యంలో ఎవరో ఒక ప్రాచీనకవి మనకు దర్శనమిస్తూనే వుంటాడు. ఉదాహరణకు.

'ఆయనగార మా హృదయ
మారసభావములా దృగంచలం
బా నిపుణత్వ మా బిగువు
లా సరసోక్తులు వావిలాస ము
మేని పసందులా చిరునవ్వుసను
లందొలకాడు నవ్వు...'

## స్వీకారము

రాగస్వరాలు: నవల; రచన: కనక మేడల; ప్రచురణ: కుబేరా ఎంటర్‌ప్రైజెస్ లిమిటెడ్; 21 సుంకురామశెట్టి వీధి మద్రాసు-1 వెల 1-25.

ఆత్మవేదన: గేయాలు; రచన: శ్రీ పొట్లపల్లి రామారావు; ప్రచురణ: దేశోద్ధారక గ్రంథమాల, 2841 ఇమాంబాది వీధి సికింద్రాబాదు 3.

సాంఖ్యరేఖలు: కథలు; రచన: ప్రసన్న; ప్రాప్తిస్థానం: ఆంధ్రప్రదేశ్ పబ్లికేషన్స్ రాజమహేంద్రవరం; వెల రు 0.50

దత్తమహిమ: వచనం: బ్రహ్మాండ పురాణంలోని దత్తాత్రేయ మహాత్మ్యమునకు అనువాదం; అనువాదకులు: శ్రీ మిన్నికంటి గురునాథశర్మ; ప్రాప్తిస్థానము. రచయిత, ఏ వ రైను, బ్రాడీపేట, గుంటూరు.

ఆత్మచింతనము (మార్కస్ అరేలియస్) శ్రీ చక్రవర్తుల రాజగోపాలాచార్యులవారి తమిళ అనువాదానికి ఇది శ్రీ చల్లా రాధాకృష్ణశర్మగారి ఆంధ్రానువాదం. ప్రాప్తిస్థానం; లక్ష్మీనారాయణ గ్రంథమాల 24—వి. తాండవరాయగ్రామణి వీధి మద్రాసు-1 వెల రు 1/-

పంజర ప్రణయం: కథలూ, గల్పికలూ, రచన పూర్ణ శోభా ప్రచురణాలయం, విజయనగరం వెల రు 0-50

Printed & Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna, at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras—1. Editor: S. Sambhu Prasad.